వైదిక వాఙ్మయము

# తైత్తిరీయ ప్రాతిశాఖ్య

[త్రిభాష్యరత్న సంస్కృత వ్యాఖ్య, మహీప్రభ అను ఆంధ్రవివరణలతో]

తృతీయ భాగము [అధ్యాయములు 12—24]

శ్రీమత్ తిరుమల తిరుపతి దేవస్థానముల వారి "ధార్మికగ్రంథ ప్రచురణ సహాయము
పథకం క్రింద అందించిన ఆర్థిక సహాయముతో ఈ గ్రంథము ముద్రించబడెను


ఆంధ్ర వివరణ కర్త

డా॥ [illegible]ల సుబ్రహ్మణ్యము.

వైదిక వాఙ్మయము

# తైత్తిరీయ ప్రాతిశాఖ్య

త్రిభాష్యరత్న సంస్కృత వ్యాఖ్య మతిప్రభ అను ఆంధ్రవివరణలతో ]

తృతీయ భాగము [అధ్యాయములు 13_24]

శ్రీమత్తిరుమల తిరుపతి దేవస్థానమువారి "ధార్మికగ్రంథ ప్రచురణ సహాయ
పథకం క్రింద అందించిన ఆర్థిక సహాయముతో ఈ గ్రంథము ముద్రించబడెను

ఆంధ్ర వివరణ కర్త
డా॥ వేదుల సుబ్రహ్మణ్యము,
రీడర్, సంస్కృత విభాగము,
ఆంధ్రవిశ్వవిద్యాలయము,
విశాఖపట్టణము

ప్రజోత్పత్తి సంవత్సరము
విజయదశమి
అక్టోబరు 1991

ప్రొ. యస్వీ. జోగారావు,
ఎమ్. ఏ, పిహెచ్‌డి. డి. లిట్
(హానీ.) ఏ. యు; యు. ఎస్. ఏ.

తెలుగు జాతీయాచార్యులు
ఇదివరకు ప్రిన్సిపాల్ ఏ. సి. ఎల్. కాలేజీలు
ఆంధ్ర యూనివర్సిటీ, వాల్తేరు.

వాల్తేరు
తే. 5-2-1987.

## స హృ ద య భూ మి క.

ఒక బ్రహ్మజ్ఞుడు వ్రాసిన ఈ మహాగ్రంథానికి పీఠిక వ్రాసే అధికారం వసేమిరా నాకి జన్మకు లేదు. అయితే ఆయన యొక్క ప్రణయ నిర్బంధానికి తట్టుకోలేక ఈ ముడి ముక్కలు వ్రాస్తున్నాను.

పశు ప్రపంచం నుండి మానవుని పార్థక్యం నిరూపించే లక్షణాల్లో అతి ముఖ్యమైనది వాక్కు. సర్వ విద్యలకు అధిష్ఠాన దైవతమైన సరస్వతిని భాషా శబ్దవ్యపదిష్టను చేసి శబ్దమును పరబ్రహ్మ స్వరూపంగా భావించిన భారతీయులు, వాగర్థములను జగత్పితరులైన పార్వతీ పరమేశ్వరులుగా విశ్వసించిన భారతీయులు, స్వరవ్యతిక్రమంవల్ల వాక్కుయొక్క మౌలికార్థమే మారిపోతుందని అతి ప్రాచీనకాలంలోనే అవగాహన చేసుకున్నారు. అది వైదిక భాషకే పరిమితం కాదు. లౌకికంగా చూసుకున్నా ఒక శబ్దంకాక్వాక్షిప్తమైతే దాని అర్థం మారిపోతూ వుంది. ఇంతటి అవగాహన ఇట్టి అవగాహన పాశ్చాత్య ప్రపంచం కన్ను తెరవని కాలంలోనే భారతీయులకున్నది. దానికి ఈ ప్రాతిశాఖ్యలే తగిన కారణాతి కారణాలు.

అక్షర వర్ణకారేఫ ప్రత్యయములు, స్వర వ్యంజనములు అందులో విసర్జనీయ జిహ్వామూలీయోపధ్మానీయానుస్వారనాసిక్యాది ప్రభేదములు. ఉదాత్తానుదాత్త స్వరితములు, పదక్రమ జటాఘన రథ శిఖాది వేదపాఠ ప్రభేద

ములు, వాగుత్పత్తి స్థాన కరణ ప్రయత్నములు, ఘోషాఽఘోష ప్రాణ మహాప్రాణాదిక భేదములు- వీటన్నిటి విచారణ పురస్సరంగా శబ్ద శాస్త్ర ప్రాణస్నాయువులను పరిరక్షించు శిక్షాస్మృతులీ ప్రాతిశాఖ్యలు. అందులో తైత్తిరీయ మత్యపూర్వము (అతి పూర్వము + అపూర్వము) అని నా అభి సంధి. ఆధునికులు కొందరు భాషాశాస్త్ర మిటీవలే హఠాత్తుగా ఏ అమెరికాలోనో ఆవిర్భవించిందని అంటుంటారు. రొమ్ము విరుచుకుంటారు గాని వెన్ను చూసుకోరు అప్రాచ్యులు! ఈ ప్రాతిశాఖ్యల్లోని తంతంతా చూస్తే ఆ శాస్త్ర దృష్టి, సృష్టి కూడ అచ్చంగా అతి సమీచీనంగా ప్రాచీనములే (దేశ కాలములు రెండూ ఉద్దిష్టములే) అని తెలుతుంది. ఈ పరిజ్ఞానాన్ని ప్రాతిపదికగా చేసుకునే మాక్సుముల్లర్ తన "సైన్స్ ఆఫ్ లేంగ్వేజ్" గ్రంథాన్ని రూపొందించాడు. తరువాత బ్లూమ్ ఫీల్డులూ, జెస్పర్ సన్నులూ, సధీరులూ బయలుదేరేరు. అంతటి ఆ బ్లూమ్ ఫీల్డు పాణినీయ ఫక్కికకే మురిసిపోయాడు. ఆశ్చర్య చకితుడై పోయాడు. అదొక Stupendous feat of human intelligence అని శ్లాఘాశిరః కంపం చేశాడు.

ఇన్నాళ్ళకి తెలుగువారిలో బ్లూమ్ ఫీల్డు దొరికేడు- చి. వి॥ డాక్టర్ సుబ్రహ్మణ్యం శబ్ద శాస్త్రాన్ని క్షుణ్ణంగా అవగాహన చేసుకున్న అంతర్వాణీ వరేణ్యుడు. తన అభిరుచికి తగిన పరిశ్రమ చేసేడు. పరిశ్రమకు తగిన ఫలాన్ని వెలయించాడు. పూర్వ భాష్యములను పుక్కిటబట్టి తనదైన మణీ ప్రభతో వెలుగులు వెదజల్లి ఆంధ్ర సరస్వతికి అంచితపరివస్య చేశాడు. ఇతనికి మనః పూర్వక మంగళాశాసనము.

యస్వీ. జోగారావు



ములు, వాగుత్పత్తి స్థాన కరణ ప్రయత్నములు, ఘోషాఽఘోష ప్రాణ మహా ప్రాణాదిక భేదములు- వీటన్నిటి విచారణ పురస్సరంగా శబ్ద శాస్త్ర ప్రాణస్నాయువులను పరిరక్షించు శిక్షాస్మృతు లీ ప్రాతిశాఖ్యలు అందులో తైత్తిరీయ మత్యపూర్వము (అతి పూర్వము + అపూర్వము) అని నా అభిసంధి ఆధునికులు కొందరు భాషాశాస్త్ర మిటీవలే హఠాత్తుగా ఏ అమెరికా లోనో ఆవిర్భవించిందని అంటుంటారు రొమ్ము విరుచుకుంటారు గాని వెన్ను చూసుకోరు అప్రాచ్యులు! ఈ ప్రాతిశాఖ్యల్లోని తంతంతా చూస్తే ఆ శాస్త్ర దృష్టి, సృష్టి కూడ అచ్చంగా అతి సమీచీనంగా ప్రాచీనములే (దేశ కాలములు రెండూ ఉద్దిష్టములే) అని తెలుతుంది ఈ పరిజ్ఞానాన్ని ప్రాతిపదికగా చేసుకునే మాక్సుముల్లర్ తన "సైన్స్ ఆఫ్ లేంగ్వేజ్" గ్రంథాన్ని రూపొందించాడు తరువాత బ్లూమ్ ఫీల్డులూ, జెస్పర్ సన్నులూ, సధీరులూ బయలుదేరేరు అంతటి ఆ బ్లూమ్ ఫీల్డు పాణినీయ ఫక్కికకే మురిసి పోయాడు ఆశ్చర్య చకితుడై పోయాడు అదొక Stupendous feat of human intelligence అని శ్లాఘాశిరః కంపం చేశాడు

ఇన్నాళ్ళకి తెలుగువారిలో బ్లూమ్ ఫీల్డు దొరికేడు- చి వి॥ డాక్టర్ సుబ్రహ్మణ్యం శబ్ద శాస్త్రాన్ని క్షుణ్ణంగా అవగాహన చేసుకున్న అంతర్వాణి వరేణ్యుడు తన అభిరుచికి తగిన పరిశ్రమ చేసేడు పరిశ్రమకు తగిన ఫలాన్ని వెలయించాడు పూర్వ భాష్యములను పుక్కిటబట్టి తనదైన మతి ప్రతిభతో వెలుగులు వెదజల్లి ఆంధ్ర సరస్వతికి అంచితపరివస్య చేశాడు ఇతనికి మనః పూర్వక మంగళాశాసనము

యస్వీ జోగారావు

రాగమము హన్యాదుప్యమానంచ అన్న చోట ఉపసర్గమీద ణత్వము వికారము ఏషసస్య అను చోట విసర్గలోపము వద్మాహి సూనోఅసి ఇందాౖ ఇంౖద్రియావత్ ఇత్యాదులందు ప్రగ్రహత్వము (సంధ్యభావకార్యముగు ప్రకృతిభావము)

నంహితా పారములో దీర్ఘాంతములుగా నున్న కుౖత్రా దక్షిణేనా, విద్మా మొదలగునవి పదపారములు. కుతౖ దక్షిణేన ఇత్యాదికము హౖస్వాంతము అగుట ఈ మొదలగు వేదమంత్రముల పఠన విషయములో అనేక విషయములు చెప్పబడినవి. ఇవి సంహిత, పదము క్రమము మొదలగునవి చెప్పుకొను వారికి సులభ గ్రాహ్యములు.

ఈ ప్రాతిశాఖ్యకు తెలుగున వివరణము వ్రాసినవారు బ్రహ్మశ్రీ వేదుల సుబ్రహ్మణ్యముగారు. ఇట్టి విలక్షణ వైదిక విషయములు నేడు తెలుప పూనుకొనుట చాల ప్రశంశనీయము. వేదుల అనగ వేదముల సంగతి తెలిసినవారు అని గదా అర్ధము. వీరు ఇదివరకు సమామ్నాయము మొదలగు వేద విషయక గ్రంథములు రచించినారు. నేడు సాహిత్య విషయములే తెలిసికొనలేని రోజులలో గూడ ఇవి కొందరు చదివినా మంచిదే. పనికిరానివి వెయ్యి కంటె మేలైనవి కొన్ని అయినను చాలు. పాఠకుల అసమర్ధత సంగతి చూడక ఇట్టి మహోత్తమ గ్రంధరచన చేయుట ముఖ్యము, ఇట్టివే ఇంకను వ్రాసి పండితుల మన్ననలకు వేదులవారు అర్హులు కాగలరని నా ఆశంస.

ఆశంస.

## ఒక్క మాట

నమో వేదస్వరూపాయ నిత్యానంద విధాయినే।
సచ్చిదానందరూపాయ బ్రహ్మజ్ఞానాత్మనే నమః॥

వేద వాఙ్మయమునకు పుట్టినిల్లగు భారతదేశములో నేడు యజుర్వేదమునకు సంబంధించి, కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ శాఖ, శుక్ల యజుర్వేదీయ కాత్యాయన శాఖలు మాత్రమే అత్యధికమగు పఠన, పాఠన, ప్రచారము లందున్నవి. అందును తైత్తిరీయ శాఖ ఆంధ్రప్రాంతమందు ప్రబలముగ నున్నది. వేదాధ్యయనము చేయు వ్యక్తి ఎట్టి జ్ఞానమును కలిగియుండవలెనో ఈ క్రింది శ్లోకములో చెప్పబడినది

"స్వరోవేదోఽక్షరం మాత్రా వినియోగోఽర్థ ఏవ చ।
మన్త్రం జిజ్ఞాస మానేన వేదితవ్యం పదే పదే॥

అనగ మంత్రమును తెలియగోరు వ్యక్తికి స్వరము, అక్షరము, కాలము, అర్థము, ఆ మంత్రమును ఏ కర్మ కాండయందెట్లు వినియోగించవలెననిడి క్రమము, మొదలగు సంపూర్ణ జ్ఞానముండవలెను. అందులో స్వర, వేదాక్షర, మాత్రాజ్ఞానము ప్రాతిశాఖ్యలు, శిక్షాగ్రంథముల నుండి వచ్చును. అందును ప్రాతిశాఖ్యలే ప్రమాణము. కాని ఇట్టి లక్షణ గ్రంథములతో కూడిన వేదప్రవచనాధ్యయనములు నేడు తగ్గిపోయినవి. కేవలము మూలమును అనగ సంహితను మాత్రమే విద్యార్థులుపదేశము పొంది కంఠస్థమును చేయుచున్నారు. కనుక ఈ విధముగ వేదము నభ్యసించినవారు ఆయా లక్షణ గ్రంథములను స్వయముగ నభ్యసించుటకవకాశముండునట్లు ఈ ప్రాతిశాఖ్యలకు దేశభాషలలో వ్యాఖ్యావివరములు ఎంతయు నవసరమగుచున్నవి.

ఈ ప్రాతిశాఖ్యలకు కేవలము వైదిక ప్రాముఖ్యతయె కాక, నేడు ప్రపంచమందు ప్రముఖ స్థానము వహిస్తున్న భాషాశాస్త్ర (Linguistics) పరముగ కూడ మిక్కిలి విలువ కలదు. ఈ దృష్టితో చూచినపుడు వైదిక ప్రాతిశాఖ్య, శిక్షాగ్రంథములు భాషాశాస్త్ర ప్రపంచమందు ప్రప్రథమ గ్రంథములగుచున్నవి. ప్రాచీన భారతీయ స్వరశాస్త్రమును (Ancient Indian

Phonetics) తెలుసుకోదలచినవారు ఈ ప్రాతిశాఖ్య, శిక్షా గ్రంథములను తప్పనిసరిగా అధ్యయనము చేయవలెను.

ఈ విధముగ ప్రాతిశాఖ్య, శిక్షా గ్రంథములకు వైదికపరముగ చూచినను, ఆధునిక భాషాశాస్త్ర పరముగ చూచినను దేశభాషలయందు వివరణము చాల యావశ్యకమై యున్నది. మరియు ప్రాతిశాఖ్య శిక్షాగ్రంథ సాహిత్య సంపదను తెలియచేయు గ్రంథములు కూడ మన తెలుగు భాషయందు అంతగలేవు. కాగ, ఈ కారణములను పురస్కరించుకొని స్వశాఖీయమగు తైత్తిరీయ ప్రాతిశాఖ్యకు "మణిప్రభ" అను ఆంధ్ర వివరణమును చేసితిని.

తైత్తిరీయ ప్రాతిశాఖ్యను రెండు ప్రశ్నలుగ (ఖండములుగ) విభజించిరి అందు ప్రథమ ప్రశ్నయందు పండ్రెండధ్యాయములు, ద్వితీయ ప్రశ్నయందు పండ్రెండధ్యాయములు గలవు ఈ గ్రంథమందు మొత్తము 545 (546) సూత్రములున్నవి. అట్టి ఈ గ్రంథమును ఆంధ్ర వివరణముతో మూడు భాగములుగ వెలువరించుచున్నాము. అందు— ఒకటినుంచి నాలుగు అధ్యాయములు (181 సూత్రములు) ప్రథమ భాగము.

5 నుండి 12 అధ్యాయములు (185 సూత్రములు) - ద్వితీయ భాగము.

13 నుండి 4 అధ్యాయములు (178, 179 సూత్రములు - తృతీయ భాగము.

"మణిప్రభ" అను ఈ ఆంధ్ర వివరణమును ప్రధానముగ త్రిభాష్యరత్నము నాధారముగ గొని చేసితిని ఒకనెడ వైదికాభరణ మాహిషేయ భాష్యములను గూడ నుట్టంకించితిని. త్రిభాష్యరత్న వ్యాఖ్యను పూర్తిగ నిచ్చితిని. ఉదాహరణములను మాత్రము సంక్షిప్తముగ ఒకటి రెండక్షరములలో చూపితిని. కాని వానినెల్ల ఆంధ్రవివరణమున పూర్తిగ చూపితిని. పాఠకులు ఈ వ్యత్యతిని గమనింతురు గాక.

ఈ గ్రంథ ముద్రణమునకు తిరుమల తిరుపతి దేవస్థానమువారు ధన సహాయమునందజేసిరి. వారికి నా కృతజ్ఞతలు.

ఇక నీ పుస్తకము నచ్చొత్తించుటకు శుద్ధప్రతిని మా శిష్యురాలు చి॥ కుమారి సరిపల్లి లక్ష్మి, M A, వ్రాసి అందించినది. ఆమెను శ్రీ వేంకటేశ్వరుడనుగ్రహించు గాక,

ఈ గ్రంథమును ముద్రించి ఇచ్చిన లలితా ఆర్టుప్రెస్ సిబ్బంది యాజమాన్యములకు కృతజ్ఞతలు.

ఇట్లు
వివరణకర్త, సుధీవిధేయుడు
వేదుల సుబ్రహ్మణ్యము

క్షయనామ సంవత్సర
విజయదశమి.
(12-10-86)

# ప్రాక్కథనము

## ప్రాతిశాఖ్యోద్భవ వికాసములు

హరిః ఓమ్.

భారతీయ సంప్రదాయమునననుసరించి, ఆదిలో ఏకరాశిగ నుండెడి వేదము ద్వాపరయుగాంతము నాటికి నాల్గు వేద భాగములుగ విడివడెను. అట్లు కలియుగ ప్రారంభములో నాల్గుగ ఉండెడి వేదము కాలక్రమంలో 1130 శాఖలుగ వృద్ధిపొందింది. ఈ మార్పునకు చాల కాలం పట్టింది. బహుశః కొన్నివేల సంవత్సరాలు పట్టి ఉండాలి కాగ ఆదిలో ఉండే ప్రధాన గురువులు ఇతరత్ర వేదాన్ని ప్రవచిస్తున్న తమతమ శిష్యుల ఆశ్రమాలకు వెళ్ళి పాఠమునందు భ్రమప్రమాదములు లేకుండునట్లు పరిశీలించేవారు. కాని బహుకాలాన్తరంలో, మానవమేధ నీరసించిపోసాగింది. మరియు స్వర వర్ణోచ్చారణయందు ప్రాంతీయ వాతావరణము, భాషలు తమతమ ప్రభావాన్ని చూపసాగాయి ఈ రెండు కారణాలవల్ల భిన్నశాఖలందలి వేదపాఠమునందు అచటచట చెప్పుకోదగ్గ పాఠభేదం స్పష్టంగ కన్పించింది. మూలపాఠాన్ని అచటచట మరచిపోయిన కులపతులగు గురువులు వారి ప్రథమ గురువులను సంప్రదించుటకవకాశములేక, వారి బుద్ధిబలంతో ఆయా భాగాల్ని పూరించారు. నిజానికి శాఖాభేదం మొదట్లో ఆయా గురువులపేరిట వచ్చినా, కాలక్రమంలో సంహితాపాఠంలో కూడ వచ్చిన మార్పులను పురస్కరించుకొని శాఖాభేదములు స్థిరపడ్డాయి.

## వేదరక్షా చర్యలు :-

ఈ పరిస్థితులలో ప్రతి రెండు మూడు సంవత్సరముల కొకసారి, ప్రధాన కులపతులు వారి వారి వేదశాఖలకు సంబంధించిన సమావేశాలను ఏర్పరచేవారు. ఈ సమావేశాలనే పరిషత్తులని, పర్షదములని అంటారు. ఈ పర్షదముల్లో శిష్యులు వారు చెప్తున్న (ఉపదేశిస్తున్న) వివిధ శాస్త్రములను, వేదములను చర్చించుకొని, పాఠములను సరిదిద్దుకొని, మరల వారి వారి ఆశ్రమములకు పోయి ఉపదేశం చేస్తూండేవారు. ఈ విధంగ మరి

కొన్ని వందల సంవత్సరాలు గడిచాయి తర్వాత కాలంలో ఈ పరిషత్తు అందలి ఉపదేశాలవల్ల ఆశించినంత ప్రయోజనం కల్గలేదు. కనుక నాటి మహర్షులు ఈ విద్యలు మరింతగ భ్రష్టమైపోకుండ చూడటానికి, వీనినన్నిటినీ లేఖనంద్వార భద్రపరచాలని నిశ్చయించారు. అప్పటినుంచి గ్రంథ లేఖనం ప్రారంభమై వ్యాప్తిలోనికి వచ్చింది. ఈ విషయాన్ని "యాస్కాచార్యు"లవారు తమ నిరుక్తగ్రంథంలో— "ఉపదేశాయ గ్లాయన్తోఽవరే బిల్మగ్రహణాయేమం గ్రంథం సమామ్నాసిషుః వేదంచ వేదాంగానిచ"— అని స్పష్టంగ చెప్పారు. మరియు ఇంకా పాఠభేదాల్ని అరికట్టడానికి నాటికున్న మూల సంహితా పాఠాలకు "పదపాఠ, క్రమపాఠము లను ఏర్పరచారు. ఈ విధంగ వేదరక్షాచర్యలలో ప్రథమచర్యగ ఆయా వేదశాఖలకు, పదక్రమ పాఠములు ఏర్పడ్డాయి ఇలా కొంతకాలం గడవగ వీటిలో కూడ ప్రక్షేపాలు, అపపాఠాలు రావటం జరిగింది. వీటిని వారించటం కోసం ప్రకృతి పాఠాలైన పద, క్రమ, సంహితా పాఠాలకు "జటా, మాలా, శిఖా, రేఖా, ధ్వజ దండ, రథ, ఘనపాఠాల్ని ఏర్పరచారు. వీటిని వికృతి పాఠాలంటారు అయితే ఈ రోజుల్లో మాలా, శిఖాదిపాఠాలు పఠన పాఠనాల్లో విస్తృతంగ లేకపోయినను పద, క్రమ, జట, ఘనపాఠాలు మాత్రం ఉన్నాయి. అప్పటికీ, అంటే ఈ విధమైన వికృతిపాఠాల ఏర్పాటుతో సంతృప్తి చెందక నాటి ఋషులు మంత్రసూచి, పదక్రమసూచి, అనుక్రమణికలు, దేవతా నిర్దేశములు మొదలైన అనేక గ్రంథాల్ని కూడ వ్రాశారు. ఈ విధంగ వైదిక వాఙ్మయము, మానవమేధ బలహీనపడిపోయిన కారణంగ లిఖిత గ్రంథరూపంలో పెరగటం ప్రారంభించింది.

ప్రాతిశాఖ్యలు :—

యాస్కాచార్యులవారు ప్రాతిశాఖ్యలగురించి నిరుక్తంలో — "పద ప్రకృతీని సర్వ చరణానాం పార్షదాని" (నిరుక్త 1-17) అని చెప్పారు. ఈ వాక్యాన్ని వ్యాఖ్యానిస్తు దుర్గాచార్యులవారు పార్షదమనగ ప్రాతిశాఖ్యయని వివరించారు. "శాఖాం శాఖాం ప్రతి ప్రతిశాఖామ్। ప్రతిశాఖంభవం ప్రాతిశాఖ్యమ్।" అని వ్యుత్పత్తి చెప్పారు. అనగ ప్రధాన వైదికశాఖకు చెందిన గ్రంథం "ప్రాతిశాఖ్య" యని తేలింది. అయితే ఈ ప్రాతిశాఖ్యల్లో చెప్పే విషయం ఏమిటి?

ప్రాతిశాఖ్యల్లోని విషయము :-

వేదానికి స్వరం ప్రధానము. స్వరహీనమైన మంత్రప్రయోగంవల్ల ఫలితం ఉండదు. సామాన్య భాషాజ్ఞానం కల్గితే కలగవచ్చుకాని, యజ్ఞయాగాదులనుంచి ఆశించిన ఫలఘ మాత్రం ఉండదు. ఆ ఫలము సుస్వరయుక్త వేదమంత్ర ప్రయోగం వల్లనే సిద్ధిస్తుంది. కనుక వేదరక్షా చర్యలుగ పదపాఠ క్రమపాఠ, వికృతి పాఠాలను ఏర్పరచినపుడు ఈ అంశాలనన్నిటిని పరిగణించారు. సంహితాపాఠం నుంచి పదపాఠం ఏర్పరచటమంటే మూలమంత్రంలోని పదాలను వేరుచేసి, విడివిడిగ చూపించుట. దీన్నే మనం లౌకికంలో పదచ్ఛేదమంటున్నాము. ఈ విధంగ పదాల్ని వేరుచేసినపుడు, మంత్రంలో ఉన్నప్పటికంటె వ్యస్తంగ ఉన్నపుడు పదముల రూపం మారుతుంది. ఉదాహరణకు మంత్రంలో "అగ్నిమీళే" అని ఉంటే, పదపాఠంలో "అగ్నిమ్। ఈళే।" అని ఉంటుంది. అలాగే స్వరంలో కూడ సంహితాపాఠంకంటె పదపాఠంలో మార్పు ఉంటుంది. ఈ విధంగ సంహితనుంచి పదక్రమ పాఠాల్ని ఏర్పరచిన, లేక పదపాఠం నుంచి సంహితా పాఠాన్నేర్పరచిన పదాన్త పదాదులందుండెడి అక్షరాల్లోను, పదమందలి స్వరంలోను మార్పులు వస్తాయి. సంహితలో దీర్ఘాన్తముగ ఉండెడి కొన్ని పదాలు పదపాఠంలో హ్రస్వాన్తములుగ మారుతాయి. ఉదాహరణకు: తైత్తిరీయ ప్రాతిశాఖ్యలో మూడవ అధ్యాయమున ఈ విధమైన పదాల్ని చెప్తుంది. ప్రస్థా, ఇన్ద్రియా। ద్రవిణా మొదలైన దీర్ఘాన్త పదాలు పదపాఠంలో ప్రస్థ। ఇన్ద్రియ। ద్రవిణ। అని హ్రస్వాలుగ ఉంటాయి. (తై. ప్రా. 3-5). అలాగే కొన్ని ప్రకృతిభావాన్ని కలిగి ఉంటాయి. కొన్నిచోట్ల కొన్ని అక్షరాలకు అనునాసికత్వం వస్తుంది. ఈ విధమైన స్వర, సంధి కార్యాలకు సంబంధించిన అనేక విషయాల్ని, విశేషాల్ని ఈ ప్రాతిశాఖ్య గ్రంథాలు వివరిస్తాయి. ఇంతేకాక ఉచ్చారణ స్పష్టంగ నిర్దుష్టంగ ఉండటం కోసం వర్ణోత్పత్తి విధానం, స్థాన, కరణ ప్రయత్నాదులను కూడ ఈ ప్రాతిశాఖ్యలు వివరిస్తాయి. అట్లే జటాదిపాఠ విషయాల్ని కూడ సాంగోపాంగంగ తైత్తిరీయ ప్రాతిశాఖ్య వివరిస్తోంది. ఈ విధంగ ప్రతివేదశాఖకు సంబంధించి పైన చెప్పిన అనేక విశేషాల్ని ప్రాతిశాఖ్యల రూపంలో గ్రన్థీకరించటం జరిగింది. ప్రతిశాఖకు సంబంధించిన పదక్రమాది పాఠములను, స్వర

ము, సంధికార్యము లు మొదలగు విషయము గల్గిన గ్రంథములకు "ప్రాతి శాఖ్య"లని పేరు. ఈ విధమగు ప్రాతిశాఖ్యలు అన్ని వేదముల యొక్క ప్రధానశాఖలకు ఉండేవని భావిస్తున్నారు.

ప్రాతిశాఖ్యలెన్ని :

ఆదిలో నాల్గుగ ఉండిన ఋగ్యజుస్సామాధర్వణ వేదము లు కాలాన్తర ములో 1130 శాఖలుగ వ్యాప్తి చెందినవి గద. మరి యీ శాఖలన్నిటికి ప్రాతిశాఖ్య గ్రంథాలున్నాయా? నేడు లభించుచున్న ప్రాతిశాఖ్య గ్రంధ సం ఖ్యనుబట్టి చూస్తే అన్ని ప్రాతిశాఖ్యలు లేవనే చెప్పాలి. ఇకపైన చెప్పిన 1130 వేదశాఖలు ప్రధానంగ ఆచార్యభేదంచే కల్గినవే గాని, విషయ వైవి ధ్యంచే కల్గినవి కావు. ఆయా శాఖల్లోని సంహితా పాఠాల్లో పెద్దగ మార్పుం డదు కాకపోతే కొన్ని శాఖలలో ప్రాంతీయభాషా ప్రభావంవల్లనో, ధారణ యందలి లోపంవల్లనో ఏకొద్ది స్థలములందో అతిస్వల్పమైన భేదం ఉండ వచ్చు. కనుక ప్రాతిశాఖ్య గ్రంథాల్ని రాయటంలో ఎట్టి మార్పులు లేని వేదశాఖలనన్నింటిని తీసికొని వానిననుసరించి గ్రంధరచన చేశారు. పాఠ భేదం ఉన్నస్థలాల్లో వాటినచటనే శాఖాన్తరమందలి మతాన్తరంగా పేర్కొ న్నారు. కనుకనే నేడు మనకు లభిస్తున్న ప్రాతిశాఖ్య గ్రంథాల్లో వేర్వేరు మహర్షుల అభిప్రాయాలు వ్రాసి ఉండటం గమనిస్తాము.

ప్రతిశాఖకు ఉండేది ప్రాతిశాఖ్యయే యైనను మూలవేద శాఖలగు ఋగ్వేదము, కృష్ణ, శుక్ల యజుర్వేదము- సామవేదము, అథర్వణవేదము-ఈ ఐదు సంహితలకు సంబంధించిన ప్రధాన శాఖలకు మాత్రమె ప్రాతిశాఖ్య లను వ్రాయటం జరిగి ఉంటుంది. వాటినే తర్వాత తర్వాత ఆయా ప్రత్యేక శాఖలలో వచ్చిన మార్పులను పరిగణనలోకి తీసుకొని ఆయా ప్రాతిశాఖ్య లను వారివారి శాఖలకు అనుగుణంగ ఎవరికి వారే వ్రాసికొని యుందురు. కాని తర్వాత కాలమందు ప్రబలిన అనార్షమతములు వానిని ధ్వసంచేసి యుండును తక్షశిల, నలంద మొదలైన విశ్వవిద్యాలయాలను, గురుకులా లను మొన్నమొన్నటి శతాబ్దాలలో తురుష్కులు, యవనులు, మహ్మ దీయులు తగులబెట్టగ, ఎన్నియో వైదిక, సాంకేతిక, శాస్త్ర విజ్ఞాన గ్రం థాలు నశించిపోయాయి కద. మిగిలినవి విదేశాలకు తరలి వెళ్ళిపోయాయి.

ఇంకను మిగిలి యున్నవి దేశీయ లిఖితపుస్తకాగారాల్లో, లేదా ఏ మారు మూలకు గ్రామాల్లోనే ఉంటే ఉండవచ్చును కాని నేడు మనకు లభిస్తు, పఠన పాఠనాలలో ఋగ్వేదము ఐదు శాఖలు, కృష్ణ యజుర్వేదము ఆరు శాఖలు, శుక్ల యజుర్వేదము రెండు శాఖలు, సామవేదం పద్నాలుగు శాఖలు అథర్వణవేదం పదమూడు శాఖలున్నాయని పరిశోధకుల యభిప్రాయము అయితే ఇందులో కొన్ని ఉపశాఖలు ఉండవచ్చును అట్లే ఈ వేదము లకు సంబంధించి పన్నెండు ప్రాతిశాఖ్యాల పేర్లు వినిపిస్తున్నాయి ; కాని నేటి వరకు లభించి ప్రకటింపబడినవి కేవలము "ఆరు" ప్రాతిశాఖ్యగ్రంథములు మాత్రమె కలవు

ప్రాతిశాఖ్య-వ్యాకరణము

ప్రాతిశాఖ్యములందు వర్ణసమామ్నాయము, వర్ణోత్పత్తి స్థాన కరణ ప్రయత్నాలు, వర్ణోచ్చారణ, స్వరసంధి నియమాలు చెప్పబడ్డాయి ఈ విష యాల్ని వ్యాకరణ శాస్త్రం కూడ చెబుతోంది కనుక ప్రాతిశాఖ్యలు వ్యాక రణ శాస్త్రాంతర్భాగములగునా యని ప్రశ్న 'కావు' అని సమాధానము

ప్రాతిశాఖ్యలో చెప్పబడుచున్న విషయాలు వ్యాకరణంలో అతి సామాన్యమైన అంతర్భాగము మాత్రమె మరియు ప్రాతిశాఖ్యల స్వరూప స్వభావములు, లక్ష్యము, పరిధికూడ వ్యాకరణంకంటె మిక్కిలి భిన్నమైనవి వ్యాకరణం లౌకిక-వైదిక వాఙ్మయ సామాన్యానికి చెందినది కాని ప్రాతి శాఖ్య కేవలం వైదిక సంహితా పదక్రమాది పాఠాలకు మాత్రమే పరిమిత మైనది మరియు వ్యాకరణంలో పద వ్యుత్పత్తి, సాధుత్వాఽసాధుత్వచర్చ ఉంటుంది సంస్కృత భాషలో పదవ్యుత్పత్తికి సంబంధించి కృత్, తద్ధిత, సమాస, ధాతువృత్తులనే చతుర్విధ ప్రక్రియలున్నాయి ఈ ప్రక్రియలు వ్యాకరణ శాస్త్రంలో విశేషంగ చర్చింపబడతాయి కాని ప్రాతిశాఖ్యల్లో ఈ విధమగు పదనిష్పత్తి, సాధుత్వాఽసాధుత్వ చర్చలు ఉండవు

ప్రాతిశాఖ్యల్లో ప్రధానంగ పదపాఠంనుండి సంహితను కూర్చునపు డును, అట్లే సంహితనుంచి పద, క్రమ పాఠములను చెప్పునపుడును కలుగు స్వర వర్ణభేదములను గూర్చిన చర్చ వానికి సంబంధించిన విస్తృత ఉదా హరణ పరిశీలనములుంటాయి అట్లే క్రమ, జటా పాఠాలకు సంబంధించి

నట్టియు, ఛందశ్శాస్త్రానికి సంబంధించిన నియమాలను కూడ కొ శాఖ్యలలో చర్చించటం జరిగింది మరియు వ్యాకరణ శాస్త్రాన్నా సించకపోయిన, వేద రక్షణకు స్వర పద పాఠ రక్షణకు కావలసిన జ్ఞానాన్ని కల్గించటమే ప్రాతిశాఖ్యల ఉద్దేశ్యము

ఈ విషయాన్నే— శిక్షా చ్ఛందో వ్యాకరణైః సామాన్యేనోక్త లక్షణ
తదేవత్విహ శాఖాయామితి శాస్త్ర ప్రయోజనమ్।

అని ఒక చిన్ని శ్లోకంలో చెప్పారు అంటే– "శిక్ష, ఛందస్సు, లలో చెప్పిన సామాన్య లక్షణములు ఆయా ప్రత్యేక సంహి మంత్ర క్రమ పద పాఠములకు సంబంధించినంతవరకు సోదాహ శాస్త్రంలో (ప్రాతిశాఖ్యలలో) చెప్పబడుచున్నవి"–అని అని అర్థము బదార్థ వ్యుత్పత్తితో సంబంధం లేదు ఈ విధంగ ఈ ప్రాతిశాఖ్య రణంకంటె భిన్నమై, సంహితా పదక్రమాదిపాఠ రక్షణామాత్ర ప్ర కల్గినవి కనుక ఈ ప్రాతిశాఖ్యలు వ్యాకరణంలో అన్తర్భాగం కా

ఈ విధంగ ఇంతవరకు వేదముయొక్క క్రమ పరిణామము శాఖల్లో ఉద్భవ భిన్నసములు గూర్చి తెలిసికొన్నాము వేదశాఖ అన్ని చెప్పినా, ప్రస్తుతం లభిస్తున్నవి 12 శాఖలు మాత్రమే అయి సంబంధించిన ప్రాతిశాఖ్యల్లల్లో కేవలం పన్నెండింటి పేర్లు తెలుస్త ఈ పన్నెండింటిలోను కేవలం ఆరు గ్రంథములు మాత్రమే దొరక పరిష్కరింపబడి ప్రకటించబడ్డాయి

యజుర్వేద ప్రాతిశాఖ్యలు

యజుర్వేదమ్ము నందు మంత్ర పాఠము, బ్రాహ్మణ పాఠ వేర్వేరుగ నుండక అంతయు కలసిపోయి గజిబిజిగ నుండును వేదము యొక్క ప్రత్యేకత ఈ వేద రక్షణము ఆదిలో వైశంపా వ్యాసమహర్షి నుంచి గ్రహించెను ఈతడు మరల వాజసనేయుడు, అను ఇరువురు శిష్యులకు అప్పగించెను మంత్ర బ్రాహ్మణములు పర కలిసిపోయి సంక్లిష్టముగ నున్న యజుర్వేదమ్ము నుండి వాజసనేయు బ్రాహ్మణ భాగమును వేరు పరచి మంత్ర భాగమును స్పష్టపరచెను,

బ్రాహ్మణములను వేర్వేరుగ శిష్యుల కుపదేశము చేసెను. తిత్తిరి మహర్షి మాత్రము మంత్ర బ్రాహ్మణములను కలిపియే యథాతథముగ ప్రవచించు చుండెను. ఈ విధముగ ఆద్యయజుర్వేదము నుండి ప్రప్రథమముగ వాజసనేయి సంహిత వేరు పడెను. ఈ ప్రథమ సంహితా శాఖ ననుసరించిన వారు ప్రథమ శాఖీయులుగ వ్యవహరింప బడుచున్నారు. నాటినుంచి తిత్తిరిచే ప్రవచింప బడుచున్న సంకీర్ణ వేదము తైత్తిరీయమని ప్రసిద్ధి పొందెను. ఇదిగాక ఈ శాఖా భేదమునకు మరియొక ఉపపత్తిని కొందరు పండితులు చెప్పుదురు. వాజస నేయి శాఖ యందు, పూర్ణిమ రాత్రులతో వస్తువులు సుఖముగ స్పష్టముగ కంటి కగుపించునట్లు, ఇది మంత్రము, ఇది బ్రాహ్మణమని స్పష్టముగ నుండుటచే దానికి శుక్లయజుర్వేదమనియు, తైత్తిరీయ మందు ఇట్టి స్పష్టత లేకుండ, అమావాస్య రాత్రి యందు వస్తువులవలె మంత్ర బ్రాహ్మణములు కలసి యుండుటచే దానికి కృష్ణ యజుర్వేదమనియు పేరు కల్గెను. మరి కొందరు పండితులు ఈ శుక్ల, కృష్ణ యజుర్వేద వ్యవహారమును గూర్చి- "వేదోప క్రమణమునందు తైత్తిరీయులు ప్రతి ప్రయుక్త పౌర్ణమాసిని (పూర్ణిమ యుక్తమైన పాడ్యమిని) గ్రహింతురు. కనుక నిది కృష్ణయజుర్వేదము. వాజసనేయులుచతుర్దశీ యుక్తపూర్ణిమను గ్రహింతురు. కావున నీవైదిక శాఖకు శుక్లయజుర్వేదమని వ్యవహారము కల్గె"-నని చెప్పిరి. ఇక తిత్తిరి పిట్ట కథ కట్టు కథయెకాని, నమ్మదగ్గ అధారము లేవియును లేవు. ఏది ఎట్లైనను యజుర్వేదము శుక్ల యజుర్వేదమనియు, కృష్ణ యజుర్వేదమనియు రెండు ప్రధాన భాగములుగ విడివడెను.

---

"కృష్ణ యజుర్వేదీయ ప్రాతిశాఖ్య".

కృష్ణ యజుర్వేదము ఎనబైయారు (86) శాఖలుగ విస్తరిల్లినది. కాని వీనిలో చాల శాఖలు కాలగర్భములో కలసి పోయెను. కాగ నేడు 1. కఠ, 2 కాపిష్ఠల, 3. చరక, 4. తైత్తిరీయ, 5. మైత్రాయణీయ, 6. శ్వేతాశ్వతర మను ఆరు శాఖలు మాత్రం లభించు చున్నవి. అయితే కొద్ది సంవత్సరములకు పూర్వము జరిగిన పరిశోధనలలో "చారాయణీయ" మను మరియొక కృష్ణ యజుర్వేదీయ శాఖగూడ లభ్యమైనది. కాని ఈ శాఖలకు సంబంధించిన ప్రాతి శాఖ్యలు అన్నియు దొరకుట లేదు. ప్రసిద్ధముగ, బహు వ్యాఖ్యా సమే

తముగ సర్వత్ర తైత్తిరీయ ప్రాతిశాఖ్య యొక్కటియె దొరకుచున్నది. చారాయణీయ ప్రాతిశాఖ్య యొకటి యుండెడిదని పరోక్ష సాక్ష్యముల వలననె తెలియుచున్నది. మైత్రాయణ ప్రాతిశాఖ్యను ఈ శతాబ్దముననే కనుగొనిరి. కాని ఇది వ్యాప్తిలో నంతగలేదు.

## తైత్తిరీయ ప్రాతిశాఖ్య :

నేడు తైత్తిరీయ ప్రాతిశాఖ్యగ లభ్యమగుచున్న గ్రంథమును ఎవరు, ఎవుడు వ్రాసిరో తెలియదు. కనుక కాల దేశాది వివరములు తెలియవు. కాని సుప్రసిద్ధ వైదిక పరిశోధకులగు "యుధిష్ఠిర మీమాంసకులు" ఈ గ్రంథము ఆపస్తంబ మహర్షిచే వ్రాయబడెననియు, ఇపుడు తైత్తిరీయ సంహితగ వ్యవహరింపబడుచున్న సంహిత, ఆపస్తంబీయమనియు చెప్పుచున్నారు. గ్రంథకర్త కాలము నిశ్చయముగ తెలియకున్నను ఇది పాణిని మహర్షి కాలముకంటె చాల ప్రాచీనమగుట సత్యము.

## గ్రంథస్వరూప స్వభావములు :

ప్రతియొక ప్రాతిశాఖ్యము ప్రధానముగ ఆయా సంహితాశాఖకు సంబంధించిన స్వర సంస్కారములగూర్చి ముఖ్యముగ చర్చించును. వాని కనుగుణముగ వర్ణోత్పత్తి, స్థానకరణ ప్రయత్నాదులు కూడ వివరింపబడును. ఈ గ్రంథమున కూడ విషయమిట్టిదే. అయితే ఋక్ప్రాతి శాఖ్యయందున్న శిక్షాపటలము, ఛందఃపటలములు ఇందు ప్రత్యేకముగ లేవు. ఈ గ్రంథము కేవలము ప్రకృతి పాఠములకు (సంహితా, పద, క్రమ పాఠములు) సంబంధించిన విషయమునే గాక, వికృతి పాఠమగు జటాది పాఠములకు చెందిన విషయములను కూడ చర్చించెను. ఈ గ్రంథమునందు రెండు ప్రశ్నలు (ఖండములు) గలవు. ప్రతి ప్రశ్నయందు పండ్రెండధ్యాయములు కలవు. కాగ మొత్తము ఇరవైనాల్గధ్యాయముల గ్రంథము ఇది. ఇందు మొత్తము 545 సూత్రములు గలవు. సూత్ర సంఖ్యను బట్టి ఋక్ప్రాతి శాఖ్య, వాజసనేయ ప్రాతిశాఖ్యలకంటె నిది చిన్న గ్రంథము. కాని విషయ వివరమందు ఋక్, వాజసనేయ ప్రాతిశాఖ్యలకంటె శాస్త్రీయము గను, సరళముగ నున్నది. ప్రణాళికా విధానము సుఖావహమైనది. ఇక నిపుడధ్యాయములందలి విషయములను సూచించెదను.

1 వ అధ్యాయము  వర్ణ సమామ్నాయము - ఉపసర్గలు - వర్ణాఖ్య పరి భాషలు-ఉదాత్తాది స్వరములు - హ్రస్వదీర్ఘ ప్లుతాది స్వరూపము - ఇంగ్యము అవగ్రహ-అవ్యక్తము-లోపాదుల లక్షణములు

2 వ అధ్యాయము  శబ్దోత్పత్తి ప్రకారము, స్థాన నిరూపణము, వర్ణప్రకృతి నిరూపణము  స్వరాద్యుచ్చారణము, అనునాసిక-స్థానకరణ ప్రదర్శనము-స్వర వ్యంజన భేదము-స్పర్శ, ఊష్మ అన్తస్థల ఉచ్చారణ విధి-విసర్జనీయ, అనునాసికా స్థాన నిరూపణము

3 వ అధ్యాయము  పదాన్త, పదాదులందలి దీర్ఘమునకు హ్రస్వవిధి

4 వ అధ్యాయము  ప్రగ్రహ నిరూపణము

5 వ అధ్యాయము  సంహితాధికారము-ప్రకృతి లక్షణము-ఆగమ ఆదేశ-లోపవిధులు-మకారమునకనునాసికత్వము

6 వ అధ్యాయము  షత్వ, నత్వ, విధానములు

7 వ అధ్యాయము  ణత్వ, టత్వ, తత్వ విధానము

8 వ అధ్యాయము  వర్గ ప్రథమాక్షర మనునాసికముగ మారుట, విసర్గకు రేఫ, లోప, సత్వ, షత్వ విధానము

9 వ అధ్యాయము  విసర్జనీయులోపము, అయవాద్యాదేశము, అప్పృక్తోకారమునకు ప్రకృతి భావము, వకారాగమము, జకార, వకారములకు ద్విర్భావము గ్రహోఖ్యాదులందు ఈకారోకార పూర్వకమగు వకారమునకు రేఫ, అయాద్యాదేశ విధి

10 వ అధ్యాయము  స్వరసంధి విధానములు సంధి నిమిత్తములగు స్వరముల వ్యత్యయము - అకారాకార లోపము - యణాదేశము - పదాన్త యకార వకారలోపము-ప్రకృతి భావ విశేషములు

11 వ అధ్యాయము  అకారలోపము-నిషేధము మతభేదములు

12 వ అధ్యాయము  అకారలోప ప్రతిషేధములు-తత్కృత స్వరభేదములు

ఇది ప్రథమ ప్రశ్నయందలి పంన్డ్రెండధ్యాయములలోని విషయము

ఇకనిపుడు రెండవ ప్రశ్నయందలి విషయములను పరిశీలింతము

రెండవ ప్రశ్నయందు

1 వ అధ్యాయము: మకారలోప ప్రతిషేధములు, ణత్వవిధి జకారమునకు "ళ" కారాదేశము.

2 వ అధ్యాయము. ద్విత్వ, అగమ, ఆదేశ, స్వరితాది విధానము.

3 వ అధ్యాయము: అనుస్వార, అనునాసిక, యమ విధానము.

4 వ అధ్యాయము: అనుస్వారాగమ విధి.

5 వ అధ్యాయము: అనునాసిక భేదములు - తీవ్రోచ్చారణమున వ్యంజన కాలాధిక్యత-దృఢప్రయత్నతర విధి-ఉచ్చారణ ప్రకారము.

6 వ అధ్యాయము. ప్రణవోచ్చారణము.

7 వ అధ్యాయము: విక్రమ విధి- మత భేదములు.

8 వ అధ్యాయము: స్వరిత భేదములు.

9 వ అధ్యాయము. స్వర వ్యంజనముల కాశ్రయాశ్రయి భావము. ప్రిచ్చయ విధి- నాసిక్యాగమ విధి స్వరభక్తి.

10 వ అధ్యాయము: శబ్ద ద్రవ్యములు.

11 వ అధ్యాయము: వర్ణవిశేషోత్పత్తి కథనము-సప్త వాక్ స్థానములు-. కృష్టాది స్వర నిరూపణము.

12 వ అధ్యాయము: సంహితా స్వరూప విభాగ కథనము- ఫలశ్రుతి॥

ఈ విధముగ తైత్తిరీయ ప్రాతిశాఖ్య యందలి విషయము ఇరువది నాల్గధ్యాయములలో, రెండు ప్రశ్నలుగ విభజింపబడి వివరింప బడెను.

## వ్యాఖ్యానములు — వ్యాఖ్యాతలు

తైత్తిరీయ ప్రాతిశాఖ్యకు తొమ్మిది వ్యాఖ్యానములు కలవు. అందు రెండింటి యునికి పరోక్ష సాక్ష్యము వలననే తెలియ చున్నది. అవి అలభ్యములు. మిగిలిన వానిలో మూడు మాత్రము ప్రకటితములు. మిగిలిన నాల్గు వ్యాఖ్యలు ప్రాచ్య లిఖిత గ్రంధా గారములందు, పెల్లు చూచుటకై యున్నవి.

1. వరరుచి ) వరరుచి, ఆత్రేయుడు అను ప్రాచీన వైదిక పండితులు
2. అత్రేయుడు ) ఈ తైత్తిరీయ ప్రాతిశాఖ్యకు వ్యాఖ్యానములను

వ్రాసిరను విషయము త్రిభాష్య రత్నమను ఇంకొక వ్యాఖ్యనుంచి తెలియు చున్నది. ఈ భాష్య కర్తయగు సోమయార్యుడు, తన గ్రంథాదిలో

"వ్యాఖ్యానం ప్రాతి శాఖ్యస్య వీక్ష్య వారరుచాదికమ్।
కృతం త్రిభాష్యరత్నం యద్భాసతే భూసుర ప్రియమ్॥

అత్ర ఆది పదేన ఆత్రేయ, మాహిషేయే గృహ్యేతే॥" అని చెప్పెను. పై వాక్యము లాధారముగ వరరుచి, ఆత్రేయులు వేర్వేరుగ ఈ ప్రాతిశాఖ్యకు వ్యాఖ్యానములు వ్రాసిరని నిశ్చయము. ఈ గ్రంథములు నేడెచటను లభించుట లేదు.

వైదిక వాఙ్మయము నందనేక ఆత్రేయులు కలరు. తైత్తిరీయ సంహితా పద కారుడగు ఆత్రేయుడొకరు. తైత్తిరీయ ప్రాతిశాఖ్య యందొక ఆత్రేయుడు (5-31; 17-8) స్మరింపబడెను. వ్యాఖ్యాకారుడగు ఆత్రేయుడొకడు, విచారించి చూడగ ప్రాతిశాఖ్య యందు స్మరింపబడిన ఆత్రేయుడు, ప్రాతిశాఖ్యాకారుడగు ఆత్రేయునికంటె భిన్నుడని స్పష్టము. ఇక పదకారుడగు ఆత్రేయుడు, వ్యాఖ్యాతయగు ఆత్రేయుడు నొకరే యగుదురా? ఋక్ప్రాతిశాఖ్యను కూడ ఒక ఆత్రేయుడు వ్యాఖ్యానించెనుకద. వ్యాఖ్యానములను వ్రాసినవారు ఒక్కరేనా? అయితే రెండు ప్రాతిశాఖ్యలను ఒక్కరే వ్యాఖ్యానించి యుండుటకు అవకాశములు కలవు ఏది యేమైనను ప్రస్తుత ప్రాతిశాఖ్య వ్యాఖ్యాతయగు ఆత్రేయుని దేశ, కాలాది వివరములేవియు తెలియవు. వారి వ్యాఖ్యానములు కూడ దొరకకపోవుట యది మన దురదృష్టము.

ఇక వరరుచి విషయమున గూడ నన్నియు ప్రశ్నలే. పాణినీయ వార్తికకారుడగు వరరుచి కాత్యాయనుడును, ప్రాకృత ప్రకాశకారుడగు వరరుచియు, ప్రాతిశాఖ్య వ్యాఖ్యాతయగు వరరుచియు నొక్కరే యగుదురా? దేశకాలములేవి? అను ఈ ప్రశ్నలన్నిటికి "తెలియదు" అనున దొక్కటియె సమాధానము.

**3 మాహిషేయము. మాహిషుడు :**

మాహిషుడను ఒకానొక ప్రాచీన వైదికవిద్వాంసుడు తైత్తిరీయ ప్రాతిశాఖ్యకు భాష్యము వ్రాసెను. ఈభాష్యమునే మాహిషేయ భాష్యము

లేక "పదక్రమ సదనము" అని కూడ పండిత లోకమున నందురు. ఈతని తండ్రి మహిషుడై యుండును. కనుక నితడు మాహిషుడు. ఈతని గ్రంథము మాహిషేయము. ఈ భాష్య ప్రతియొకటి మద్రాసు రాజకీయ లిఖిత పుస్తక భాండాగారమున కలదు. కాని భాష్య మచటనచట త్రుటిత మయ్యెను. తైత్తిరీయ ప్రాతిశాఖ్యను మాహిషేయ వ్యాఖ్యానముతో పరిష్కరించి, వ్యాఖ్య లోపించిన స్థలములను వైదికభూషణము (భూషణ రత్నము) అను వేరొక వ్యాఖ్యా భాగములతో పూరించి మద్రాసు విశ్వ విద్యాలయమువారు ప్రకటించిరి. ఈ మాహిషుని కూర్చిన దేశకాలాది వివ రములు తెలియవు. అయితే ఇతడు త్రిభాష్యరత్నకారుడగు సోమయార్యుని కంటె పూర్వుడు.

4 త్రిభాష్యరత్నము: సోమయార్యుడు:

తైత్తిరీయ ప్రాతిశాఖ్యకు సోమయార్యుడను పండితుడు త్రిభాష్య రత్నమను చక్కని వ్యాఖ్య నొకదానిని వ్రాసెను. ఈ వ్యాఖ్యాన ప్రారం భమున నాతడు, వరరుచి, ఆత్రేయ, మాహిషేయ వ్యాఖ్యలను బాగుగ పరి శీలించి, ప్రస్తుత వ్యాఖ్యానము చేసినట్లు చెప్పెను. ఈ వ్యాఖ్యానమును చక్కగ పరిష్కరించి, ప్రాతిశాఖ్యను కూడ కలిపి మైసూరు విశ్వ విద్యా లయముద్వార, పండిత కస్తూరి రంగాచార్యులవారు ప్రకటించిరి. సోమ యార్యుని దేశకాలాది వివరములు తెలియవు. కాని తైత్తిరీయ ప్రాతి శాఖ్యకు గార్గ్య గోపాలయజ్వ అను పండితుడు తాను వ్రాసిన "వైదికాభర ణము" అను వ్యాఖ్యానమున త్రిభాష్యరత్నకారుని మతము ననేక స్థలము లలో తిరస్కరించెను. కనుక సోమయార్యుడు గోపాలయజ్వకంటె పూర్వు డని మాత్రమె చెప్పగలము. అయితే ఈ గోపాలయజ్వ యొక్క దేశకాలా దులు గూడ స్పష్టముగ తెలియకపోవుటచే సోమయార్యుని గూర్చి ఇదమిత్థ ముగ ఏమియు చెప్పలేకపోవుచున్నాము.

5 వైదికాభరణము: గార్గ్యగోపాలయజ్వ:

తైత్తిరీయ ప్రాతిశాఖ్యకు 'గార్గ్య గోపాలయజ్వ' యను ప్రసిద్ధ వైదిక విద్వాంసుడు "వైదికాభరణము" అను సరళమగు వ్యాఖ్యానమును వ్రాసెను. ఈ వ్యాఖ్యాప్రతులను సరిచూచి పరిష్కరించి, ప్రాతిశాఖ్యతో కూడ పండిత కస్తూరి రంగాచార్యులవారు మైసూరునుండి ప్రకటించినారు.

శ్రీ గార్గ్య గోపాలయజ్వయొక్క దేశకాలాది వివరములేవియును తెలియవు. ఇతడు వృత్తరత్నాకరమునకు "జ్ఞానదీపము" అను వ్యాఖ్యానమును రచించెనని, కస్తూరి రంగాచార్యులవారు, వైదికాభరణమునకు వ్రాసిన యుపోద్ఘాతములో పేర్కొనిరి మరియు నీ యజ్వ సుప్రసిద్ధమగు "బోధాయన శ్రౌతకారికల"లోని ప్రాయశ్చిత్త సూత్రములకు "ప్రాయశ్చిత్త దీపిక" యను నొక వ్యాఖ్యాగ్రంథమును వ్రాసెను తైత్తిరీయ సంహితా స్వరమునకు సంబంధించి "స్వర సంపద" యను గ్రంథమును కూడ వ్రాసెను కాని ఈ గ్రంథములందెచటను తనను గూర్చిన దేశ, కాలాది వివరములను ఈ గోపాలయజ్వ చెప్పుకొనలేదు

6 శబ్దబ్రహ్మ విలాసము వీరరాఘవ కవి

తైత్తిరీయ ప్రాతిశాఖ్యకు "వీరరాఘవ కవి" అను ఒకానొక పండితుడు "శబ్దబ్రహ్మ విలాసము" అను ఒక వ్యాఖ్యను వ్రాసెను ఈ గ్రంథము యొక్క లిఖిత ప్రతులు మద్రాసు రాజకీయ లిఖితపుస్తక భాండాగారమున కలవు ఈతని వ్యాఖ్యయందు ఆత్రేయ, వరరుచి, మాహిషేయ, త్రిభాష్యరత్న, వైదికాభరణ వ్యాఖ్యలను అనేక స్థలములందుట్టంకించెను దీనిని బట్టి ఈతడు గోపాలయజ్వకంటె అర్వాచీనుడు అని తెలియును అయితే ఈతని దేశకాలాది వివరములు తెలియవు ఈ గ్రంథము నేటికిని అప్రకటితముగ నున్నది

7 వర్ణక్రమ దర్పణము భైరవా(చా)ర్య

తైత్తిరీయ ప్రాతిశాఖ్యకు భైరవాచార్యుడను ఒక పండితుడు "వర్ణక్రమ దర్పణము" అను వ్యాఖ్యానమును వ్రాసెను దీనియొక్క లిఖిత ప్రతి యొకటి మద్రాసు రాజకీయ లిఖితపుస్తక భాండాగారమున నున్నదని తెలిసినది వివరములు తెలియవు గ్రంథము ప్రకటితము

8 వివరణము పద్మనాభుడు

తైత్తిరీయ ప్రాతిశాఖ్యకు పద్మనాభుడను పండితుడు "వివరణము" అను వ్యాఖ్యను వ్రాసెను దీని లిఖిత ప్రతి యొకటి అడయారు లిఖి

పుస్తక భాండాగారమున కలదు. గ్రంథకర్తను గురించిన వివరములు తెలియవు. గ్రంథము ప్రకటితము.

9 వైదిక భూషణము (భూషణ రత్నము):

తైత్తిరీయ ప్రాతిశాఖ్యకు పైన చెప్పిన వ్యాఖ్యానములే కాక "వైదిక భూషణము" లేక "భూషణ రత్నము" అను మరియొక వ్యాఖ్యానము కలదు. దీని లిఖిత ప్రతి యొకటి అడయారు లిఖిత పుస్తక భాండాగారమున కలదు. గ్రంథమున గ్రంధకర్త పేరు, ఇతర వివరము లేవియును లేవు. ఈ గ్రంథము కూడ అప్రకటితమే.

నేడు వైదికాభరణము, త్రిభాష్యరత్నము, పదక్రమ సదనము అను భాష్యములతో వేర్వేరుగ తైత్తిరీయ ప్రాతిశాఖ్య ప్రకటింపబడినది. కాని ఈ సంవత్సరము (క్రీ. శ. 1985) ఢిల్లీ నుండి మోతీలాల్ బనారసీదాస్ సంస్థవారిచే ఈ ప్రాతిశాఖ్య త్రిభాష్యరత్నము, వైదికాభరణములలో కలిపి ఒకే గ్రంధముగ ప్రకటించబడెను.

ఇతిశమ్.

———

# తైత్తిరీయ ప్రాతిశాఖ్య

సూత్రములు | అధ్యాయము 1[illegible]

1 అథ మకార లోపః।

2 రేఫోష్మపరః।

3 యవకారపరశ్చైకేషా మాచార్యాణామ్।

4 న సఀ సామితి రాపరః।

5 అథ వర్ణానామ్।

6 ఋకార ర్కార రషపూర్వో నకారో ణకారఀ సమానపదే।

7 వ్యవేతోఽపి।

8 హిరణ్మయమ్।

9 పాణి-గుణ-పుణ్య-కణ్వ-కోణ-గాణ-బాణ-వేణు-గుణ-మణి ప్రవాదేషు పూర్వః।

10 వణ పణిం వీయమాణ ఊర్ణోః।

11 టవర్గ పరః।

12 చరకుణ వణత్ స్థూణా హిణుయాద్ధిణోతి కేణేయోఽణిష్ఠాః ఉల్బణముగుణా శ్రీణి కృపణీ కావాణి జాయాణవశ్చాట్టార స్థాణుం తూణవే వీణాయామ శ్లోణయావణేతవాణీః కల్యాణీ కుణపం వాణ శ్మతశోణా శ్రుతిర్ధాణికామేణీ।

13 అవగ్రహే వృషణ్వర్ష బ్రహ్మణ్వక్షణ్వర్మణ్వర్షణ్।

14 ఋణ్ణ షణ్ణణ్ణమరావ్ణ చేతి ప్రాకృతాః।

15 న సుషుమ్నోఽగ్నియుష్మానీతోఽన్తోఽలోపాత్ స్పర్శపరో వ్యవాయేషు శసచటత వర్గీయేషు।

16 వృత్తస్వరాత్పరో శోడం పౌష్కరసాదేః పౌష్కరసాదేః।



1 స్వర పూర్వం వ్యఞ్జనం ద్వివర్ణం వ్యఞ్జనపరమ్।

2 లకారపూర్వ స్స్పర్శశ్చ పౌష్కరసాదేః।

3 స్పర్శ ఏవై కేషామాచార్యాణామ్।

4 రేఫాత్పరం చ।

5 ద్వితీయ చతుర్థయోస్తు వ్యఞ్జనో త్తరయోః పూర్వః।

6 రేఫ పూర్వయోశ్చ నిత్యమ్।

7 లకారపూర్వే చ।

8 ఉపసర్గ పాధ ఏషోఽత్యాతి ధామ పరమభూతే పూర్వేషు ఛఖి ఖుజేషు చ।

9 అఘోషాధూష్మణః పరః ప్రథమోఽభినిధానస్స్పర్శపరా త్తస్య సస్థానః।

0 అఘోషే ప్లాక్షిః।

1 ఉ త్తమ పరాత్తు ప్లాక్షాయణస్య।

2 ప్రథమ ఊష్మపరో ద్వితీయమ్।

3 బాడబీ కారస్యాస స్థానపరః।

14 అథ న।

15 అవసానే రవిసర్జనీయ జిహ్వామూలీయోపధ్మానీయాః।

16 ఊష్మా స్వరపరః।

17 ప్రథమ పరశ్చ ప్లాక్షిప్లాక్షాయణయోః।

18 ఊష్మాఽఘోషో హారీతస్య।

19 రేఫపరశ్చ హకారః।

20 టవర్గశ్చ తవర్గపరః।

21 లతవర్గౌ యవకారపరౌ।

22 పరశ్చ।

23 సవర్ణ సపర్గీ యు వరః।

24 నాను త్తమ ఉ త్తమపరః।

25 అథైకేషామాచార్యాణామ్।

26 ఌకారో హశవకారపరః।

27 స్పర్శ స్స్పర్శపరః

28 పదాన్తశ్చ వ్యఞ్జనపరః ప్రాకృతః।

29 ఉదాత్తాత్పరోఽనుదాత్తః స్వరితమ్।

30 వ్యఞ్జనాన్తర్హితోఽపి।

31 నోదాత్త స్వరితపరః।

32 నాగ్నివేశ్యాయనస్య।

33 సర్వో నైత్యకే సర్వోనైత్యకే।

———

1 నకారస్య రేఫోష్మ యకార భావాల్లుప్తే చ మలోపాచ్చ పూర్వస్వరోఽను నాసికః।

2 నైకేషామ్।

3 తత స్త్వనుస్వారః।

4 స్వాదిషు చైకపద ఊష్మపరః।

5 నాన్తవికారాత్పూర్వః।

6 అప్రగ్రహాః సమానాక్షరాణ్యనునాసికాన్యేకేషామ్।

7 పదం చ ప్లుతఁ శాఙ్ఖాయన కాణ్డమాయనయోః।

8 అకారస్తు సఁహితాయామపి।

9 సర్వమేకయమం పూర్వేషాఁ సర్వమేకయమం పూర్వేషామ్।

———

అథ సకారపరాః।

ప్రశోహపాశపదాదయస్స్వర పరే।

వికృతేఽపి।

రాపూర్వశ్చ।

శఁ స్తాఽనన్తో దాత్తే।

అశఁసన్।

న శసనం విశసనేన।

మాపదాదిరనుదాత్తః।

పుమీపూర్వశ్చ నిత్యమ్।

సకాయపరశ్చ।

నావగ్రహ పూర్వః।

మాసి మాసుమాసో మాసామితి చ।

హి పు జిగా జిఘా భఁసినేఽతఁ సయదాతాఁ సీత్కనీయా జ్యాయా ద్రాఘీయా రఘీయా శ్రేయా హ్రసీయా వసీయా భూయాఁసో జక్షివా జఘ్నివా జిగివా జీగివా తస్థివా దాశ్వా దీదివా పపివా పీపివా విద్వా వివిశివా శుశ్రువా ససృవా।

ఆకారేకా రోకారాస్స్విషవాః పదాన్తయోః।

వికృతేఽపి।

అనాకారో హ్రస్వఁ సాంజ్కృత్యస్య।

న పదే ద్విస్వరే నిత్యమ్।

ఋజీషి, జిగాసి, జిఘాస్యజాసి యజాసి దదాసి దధాసి వర్తయాసి చ।

దఁషనాభ్యో దఁసోభిర్దఁసం వృషదఁశో దఁశుకా దఁష్ట్రాభ్యాం పరః।

20 మఁస్యే మాఁసత్వై యఁసద్యఁసన్వఁసతే వఁసగః।

21 ఊన్న వఁశమ్।

22 అక్రఁస్తో క్రఁస్యతే సఁస్యతే భ్రఁశతే రఁహ్యై చ॥

23 ఐకార ఊఖ్యస్య నితాన్తః।

24 విరిత్రి సంఖ్యాసు।

25 శిఁశుమార శ్మిఁషత్స్వఁశ్వా సఁస్రి సఁస్కృత్య సఁస్పృష్ట
సఁస్కృతఁ సఁ శితస్ఫఁశితా కిఁశిల।

26 సిత్పృద్పృహకార పరః।

27 మఁహిష్ఠస్య చ।

28 ఆదిరఁహితరఁహోఽఁహోరఁ హోముగత్యఁహో అఁహసోఽఁ
హసాఽఁశమఁశుభిరఁశభువాఽఁశ్వఁశూ అఁశవోఽఁశురఁ
శుమఁశూనఁశునాఽఁ శోరఁ శాయోపాఁశ్వఁ శావవ్రగ్రహే।

29 ఊదాత్తోఽఁసోఽఁసాయాఁసాఖ్యామఁసావితి।

30 నాసావా నాసావా।

---

1 తీవ్రతరమానునాసిక్యమను స్వారోత్తమే ష్వితి శైత్యాయనః।

2 సమఁ సర్వత్రేతి కౌహళీపుత్రః।

3 అనుస్వారేఽణ్వితి భారద్వాజః।

4 నకారస్య రేఫోష్మ యకారభావాల్లుప్తే చ మలోపాచ్చోత్తరముత్తరం
తీవ్రతరమితి స్థవిరః కౌణ్డిన్యః।

5 వ్యఞ్జనకాలశ్చ స్వరస్యాత్రాధికః।

6 స్వారవిక్రమయో ర్దృఢ ప్రయత్నతరః పౌష్కరసాదేః।

7 ప్రయత్న విశేషా త్సర్వ వర్ణానామితి శైత్యాయనః।

8 నాతివ్యక్తం నచావ్యక్తమేవం వర్ణానుదీరయేత్।
పయః పూర్ణ మివామత్రఁ హరన్ధీరో యథామతి॥
ఇత్యాత్రేయః ఆత్రేయః॥

## సూత్రములు — అధ్యాయము 18

1 ఓకారం తు ప్రణవ ఏకేఽర్ధతృతీయమాత్రం బ్రువతే।

2 ఉదాత్తానుదాత్త స్వరితానాం కస్మింశ్చదితి శైత్యాయనః।

3 ధృతః ప్రచయః కౌణ్డిన్యస్య।

4 మధ్యమేన స వాక్ప్రయోగః।

5 స్వరితః ప్లాక్షి ప్లాక్షాయణయోః।

6 ఉదాత్తో వాల్మీకేః।

7 యథాప్రయోగం వా సర్వేషాం యథాప్రయోగం వా సర్వేషామ్।

---

## సూత్రములు — అధ్యాయము 19

1 స్వరితయోర్మధ్యే యత్ర నీచఃస్స్యాదుదాత్తయోర్వాఽన్య తరతో వోదాత్త స్వరితయోః స విక్రమః।

2 ప్రచయ పూర్వశ్చ కౌణ్డిన్యస్య।

3 ద్వియమ ఏకే ద్వియమపరే తా అణుమాత్రాః।

4 తస్యామేవ ప్రకృతా।

5 న పూర్వశాస్త్రే న పూర్వశాస్త్రే।

---

1 ఇవర్ణోకారయో ర్యవకారభావే క్షైప్ర ఉదాత్తయోః।

2 సయకారవకారం త్వక్షరం యత్ర స్వర్యతే స్థితే పదేఽనుదాత్త పూర్వేఽ
పూర్వే వా నిత్య ఇత్యేవ జానీయాత్।

3 అపి చేన్నానాపదస్థముదాత్తమథ చేత్సంహితేన స్వర్యతే స
ప్రాతిహతః।

4 తస్మాదకారలోపేఽభినిహితః।

5 ఊభావే ప్రశ్లిష్టః।

6 పదవివృత్త్యాం పాదవృత్తః।

7 ఉదాత్త పూర్వస్తైరో వ్యఞ్జనః।

8 ఇతి స్వారనామధేయాని।

9 క్షైప్ర నిత్యయోర్దృఢతరః।

10 అభినిహితే చ।

11 ప్రశ్లిష్ట ప్రాతిహతయోర్మృదుతరః।

12 తైరోవ్యఞ్జన పాదవృత్తయోరల్పతరోఽల్పతరః।

———

1 వ్యఞ్జనఁ స్వరాఙ్గమ్।

2 తత్పరస్వరమ్।

3 అవసితం పూర్వస్య।

4 సంయోగాది।

5 పరేణ చాసాఁహితమ్।

6 అనుస్వార స్స్వర భక్తిశ్చ।

7 నాన్తస్థాపరమసవర్ణమ్।

8 నాసిక్యాః।

9 స్పర్శశ్చోష్మపర ఊష్మా చేత్పరస్య।

10 స్వరితాత్సఁహితాయామనుదాత్తానాం ప్రచయ ఉదాత్త శ్రుతిః।

11 నోదాత్త స్స్వరితపరః।

12 స్పర్శాదనుత్తమాదుత్తమపరాదానుపూర్వ్యాన్నాసిక్యాః।

13 తాన్యమానేకే।

14 హకారాన్న ణమపరాన్నాసిక్యమ్।

15 రేఫోష్మ సంయోగే రేఫ స్స్వరభక్తిః।

16 న క్రమే ప్రథమపరే ప్రథమపరే।

———

1 శబ్దః ప్రకృతిస్సర్వ వర్ణానామ్।

2 తస్య రూపాన్యత్వే వర్ణాన్యత్వమ్।

3 తత్ర శబ్ద ద్రవ్యాణ్యుదాహరిష్యామః।

4 వర్ణకారౌ నిర్దేశకౌ।

5 చాపీత్యన్వాదేశకౌ।

6 త్వద్వై వేతి వినివర్తకాధికారకావధారకాః।

7 వేతి వై భాషికః

8 నేతి ప్రతిషేధకః

9 ఆయామో దారుణ్యమణుతా స్వస్యేత్యుచ్చైః కరాణి శబ్దస్య।

10 అన్వవసర్గో మార్దవమురుతా ఖస్యేతి నీచైః కరాణి।

11 మన్ద్ర మధ్యమ తారాణి స్థానాని భవన్తి।

12 తత్రైక విංశతిర్యమాః।

13 ఋగ్విరామః పదవిరామో వివృత్తి విరామ స్సమానపద వివృత్తి విరామ
త్రిమాత్రో ద్విమాత్ర ఏకమాత్రోఽర్ధమాత్ర ఇత్యానుపూర్వ్యేణ।

14 యద్వ్యఞ్జనాన్తం యదు చాపి దీర్ఘం
సంయోగపూర్వం చ తథాఽనునాసికమ్॥
ఏతాని సర్వాణి గురూణి విద్యాత్
శేషాణ్యతోఽన్యాని తతో లఘూని॥

15 అవ్యఞ్జనాన్తం యద్ధ్రస్వమసంయోగపరం చ యత్॥
అననుస్వార సంయుక్తమేతల్లఘు నిబోధత॥
ఏతల్లఘు నిబోధత॥

———

1 అథ వర్ణ విశేషోత్పత్తిః॥

2 అనుప్రదానాత్సంసర్గాత్ స్థానాత్కరణ విన్యయాత్।
జాయతే వర్ణవైశేష్యం పరిమాణాచ్చ పఞ్చమాదితి॥

3 వర్ణపృత్తశ్శబ్దో వాచ ఉత్పత్తిః।

4 సప్త వాచస్థానాని భవన్తి।

5 ఉపాంశుధ్వాన నిమిదోపబ్ది మన్మన్ద్ర మధ్యమ తారాణి॥

6 కరణవదశబ్దమమనః ప్రయోగ ముపాంశు॥

7 అక్షర వ్యఞ్జనా నామనుపలబ్ధి ర్ధ్వానః॥

8 ఉపలబ్ధి ర్నిమదః॥

9 సశబ్ద ముపబ్దిమత్॥

10 ఉరసి మన్ద్రమ్॥

11 కణ్ఠే మన్ద్రమ్॥

12 శిరసి తారమ్॥

13 మన్ద్రాదిషు త్రిషు స్థానేషు సప్తసప్త యమాః॥

14 క్రుష్టప్రథమ ద్వితీయ తృతీయ చతుర్థ మన్ద్రాతి స్వార్యాః॥

15 తేషాం దీప్తిజోపలబ్ధిః॥

16 ద్వితీయ ప్రథమ క్రుష్టాస్త్రయ ఆహ్వరకస్వరాః॥

17 మన్ద్రాదయో ద్వితీయాన్తా శ్చత్వారస్తైత్తిరీయకాః॥

18 ద్వితీయాన్మన్ద్ర స్తైత్తిరీయాణామ్॥

19 తృతీయ చతుర్థావనన్తరమ్॥

20 తచ్చ తుర్యమమిత్యా చక్షతే॥

21 తస్మిన్ ద్వియమూఽన్తరా వృత్తిః॥

22 తాముపదేక్ష్యామః॥

23 తచ్చ తుర్యమిత్యుక్తమ్॥

24 క్రమ విక్రమసమ్పన్నా మన్ద్రితా మవిలమ్బితామ్॥
నీచోచ్చస్వార సమ్పన్నాం వదేస్వృతవతీఁ సమామ్॥
(వదేద్ధృతవతీం సమామితి).

———

సూత్రములు — అధ్యాయము 24

1 అథ చతస్రస స్సంహితాః॥

2 పదసంహితాఽక్షర సంహితా వర్ణసంహితాఽఙ్గ సంహితా చేతి॥

3 నానాపద సంధాన సంయోగః పద సంహితేత్యభిధీయతే॥

4 యథా స్వమక్షర సఁహితాదినామప్యేవమ్॥

5 గురుత్వం లఘుతా సామ్యం హ్రస్వదీర్ఘప్లుతాని చ॥
లోపాగమ వికారాశ్చ ప్రకృతిర్విక్రమః క్రమః॥
స్వరితోదాత్త నీచత్వం శ్వాసో నాదోఽఙ్గమేవ చ॥
ఏతత్సర్వం తు విజ్ఞేయం ఛన్దోభాషామధీయతా॥

6 పదక్రమ విశేషజ్ఞో వర్ణక్రమ విచక్షణః॥
స్వరమాత్రా విభాగజ్ఞో గచ్ఛేదాచార్య సఁసదమ్॥
(గచ్ఛేదాచార్య సఁసదమితి)

———

తైత్తిరీయ ప్రాతిశాఖ్య సూత్రపాఠము సమాప్తము.

***

## విషయ వివరణము.

అధ్యాయము 13.

మకారలోప విధి-1-4; నకారమునకు ణత్వ విధి. ప్రాకృత ణత్వము-5-15; లకారమునకు డత్వ విధి-16.

అధ్యాయము 14.

ద్విత్వ విధి-1-8; ఆగమ విధి-9-11; ఊష్మకు సవర్గీయ ద్వితీయాదేశము-12-13; పై సూత్ర విషయమున అపవాద మతాన్తరములు-14-28; స్వరితాది విధానము-29-33.

అధ్యాయము 15.

అనుస్వార విధి-1-3; ప్రాదులలో అనుస్వార విధి-4-5; సమానాక్షరములలో అనునాసిక విధానము-6-8; ఏకయమ విధానము-9.

అధ్యాయము 16.

పదమధ్యమందలి ఊష్మలకంటె పూర్వమనుస్వార విధి-1-30.

అధ్యాయము 17.

తీవ్రతరాది భేద వివరణ-1-4; తీవ్రతరోచ్చారణ-5, వృథ ప్రయత్న తర విధానము-6; ఉచ్చారణ ప్రకారము-7, 8.

అధ్యాయము 18.

ప్రణవోచ్చారణము-మత భేదములు-1-7.

అధ్యాయము 19.

విక్రమ స్వరూప నిర్వచనము 1, 2 కమ్పు విధానము 3-5

అధ్యాయము 20.

క్షైప్ర, ప్రశిహత, అభినిహిత ప్రశ్లిష్ట పాదవృత్త తైరో వ్యఞ్జన నిరూపణము 1–8, వాని ఉచ్చారణ విధానము. 9–12.

అధ్యాయము 21.

అంగ సంహితాదికార్య నిరూపణము 1–9;
ప్రచయ స్వరూప నిరూపణము 10–11,
యమ, నాసిక్య, స్వరభక్తి స్వరూప నిర్వచనములు 12–16.

అధ్యాయము 22.

వర్ణానృత్వ నిర్వచనము 1–2, పారిభాషిక శబ్ద వివరణము 3–8;
ఉచ్చైః కర, నీచైః కర పద నిరూపణము–9, 10.
మన్ద్రాది స్థాన నిరూపణము 11, 12. విరామ స్వరూపము 13.
గురు, లఘు స్వరూప నిరూపణము 14, 15.

అధ్యాయము 23.

వర్ణ విశేషోత్పత్తికథనము 1-3; సప్తవాచ స్థానములు 4–13,
క్రుష్టాది స్వర నిరూపణము 14, 15. అహ్వారక స్వర, తదుచ్చారణ విధానము 16–24.

అధ్యాయము 24.

చతుర్విధ సంహితా నిరూపణము 1–4;
వేదాధ్యయనము చేయువారు గ్రహించవలసిన విషయములు– 5, 6.



N. B 1 నుండి 12 అధ్యాయముల సూత్ర పాఠము పుస్తకము చివరన గలదు.

ఓమ్

# తైత్తిరీయ ప్రాతిశాఖ్య

అధ్యాయము 13 సూత్రములు 16

ఈ అధ్యాయము నుండి తైత్తిరీయ ప్రాతిశాఖ్య యందలి రెండవ ప్రశ్న (భాగము) ప్రారంభమగును. ఈ ప్రశ్నయందు పండ్రెండు అధ్యాయములు కలవు. కాని, గణన చేయుటయందు ప్రథమ ప్రశ్న యందలి పండ్రెండధ్యాయముల తరువాత కూడ వరుసగనే సంఖ్యానము చేయుటచే ఇది పదమూడవ అధ్యాయమైనది. ఈ ప్రశ్న యందు మొత్తము 178 సూత్రములు కలవు. పరిమాణము దృష్ట్యా ఈ భాగము మొత్తము గ్రంథమున మూడవ భాగమగును. మొదటి పండ్రెండధ్యాయములలోను 367 సూత్రములు వివరింపబడినవి.

**ఈ అధ్యాయములో** మొదటి 4 సూత్రములందు "మ" కార లోపము గురించియు, 5 నుండి 15 సూత్రములలో ప్రకృత "ణ"కారము గూర్చియు 16వ సూత్రమున దుఃశ్లిష్ట (దుస్పృష్ట) డకారము గూర్చియు చెప్పబడెను.

సూత్రము 1 అథ మకారలోపః॥

త్రిభాష్య రత్నము :- అదేత్యయ మధికారః। మకారలోప ఊచ్యత ఇత్యేత దధికృతం వేదితవ్యమిత ఉత్తరం యద్వక్ష్యామః। మకారస్య లోపః మకార లోపః।

మణిప్రభ :- అథ। మకారలోపః॥

"అథ" అనునది అధికార వాచకము 'మ'కార లోపము గూర్చి ఈ క్రింది సూత్రములలో వివరింపబడును– అని ఈ అధికార పదము సూచించును. కాగ నూతన అధికారము చెప్పువరకు, సూత్రములలోనికి 'మకార లోపః' అనునది అనువృత్తమగునని తెలియును.

సూత్రము 9 రేఫోష్మ పరః॥

త్రిభాష్య :- రేఫ పరశ్చోష్మ పరశ్చ పదాంతో మకారో లుప్యతే। యథా ప్రతి., సు , తు , తు. , సు , త్వాం ॥ ఏవం పర ఇతి కిమ్? ఇదం...., పదాంత ఇతి కిం? తస్మాత్ । రేఫశ్చ ఊష్మాణశ్చ రేఫోష్మాణః। తేపరే యస్మాత్స తథోక్తః।

మణిప్రభ :- రేఫోష్మ పరః।

రేఫ పరః, ఊష్మ పరః అనగ "రేఫనుగాని, ఊష్మ వర్ణములనుగాని, పరమందు కలిగిన (పూర్వ) పదాంత 'మ'కారము లోపించును-" అని సూత్ర భావము మకార లోపమనునది అధికార సూత్రమునుండి లభించుచున్నది. అయితే ఈ విధముగ మకారము లోపించగ, పూర్వ స్వరమునకు అనునాసిక అనుస్వారములు కల్గును (సూత్రము 15-1). ఉదాహరణలు.

1 ప్రత్యుష్టం-రక్షః (1-1-2) [ప్రత్యుష్టమ్। రక్షః।] ఇచట పదాంత మకారము తర్వాత రేఫ యుండుటచే, మకారం లోపము సంభవించినది. కాగ, "ప్రత్యుష్టం రక్ష" అని సంహితా పాఠము.

2 సం శితం మే బ్రహ్మ (4-1-10-3) (5-1-10 2) [సమ్ శితమ్। ]
ఇచట ఊష్మ వర్ణము మకారము కంటె పరముగానున్నది

3 తం షడహాని (5-5-6-2) [తమ్। షట్। అహాని]

4 సం సం మిద్యువసే వృషన్ (2-6-11-4, 4-4-4-4) (సమ్। సమ్। ఇత్ యువసే వృషన్]

5 త్వం హ యద్యవిష్ఠ్య (2-6-11-1) త్వమ్। హ। యత్। యవిష్ఠ్య

"రేఫోష్మ వర్ణములను పరమందు గల్గిన" యని చెప్పుటచే తద్భిన్న వర్ణములను పరముగ గల్గిన పదాంత మకారమునకు లోపము రాదని తెలియవలెను. కనుకనే-"ఇదం వామాస్యే (3-2-11-1) [ఇదమ్। వామ్। ఆస్యే] అను వాక్యమున పదాంత మకారమునకు లోపము లేదు.

"పదాంత మకారమనుటచే" పదమధ్యమందు 'మ' కారము కంటె రేఫోష్మలు పరముగ నున్నను, ఆ మకారము లోపించదు.

దా :— తస్మాత్-తామ్రే అవః (2-4-2-4)

"రేఫోష్మపరః యనుచోట సమాసమును "రేఫ, ఉష్మలు ఏ వర్ణము ంటె పరముగ నుండునో, ఆ వర్ణము", (రేఫోష్మాణః పరేయస్మాత్) అని వరించవలెను. [2]

సూత్రము 3 యవకారపరశ్చైకేషామాచార్యాణామ్॥

త్రిభాష్యము :— యకారపరో, వకారపరోవా మకారో లుప్యత ఇతి ఏకేషా మ్మతమ్। య ఏవాఽస్య షష్ఠ్యమాధ్యాయే సవర్ణాపత్తిం ప్రతిషేధయంతి నా మేవైషో లోపవిధి రితి జ్ఞాన న్యాదిశతి చకారః సింహావలోకనేన। ఉదా— త్వం , తం , ఏవం పర ఇతి కిం? యం..। యకారశ్చ కారశ్చ యవకారౌ। తౌ పరే యస్మాత్స తథోక్తః॥ ఏతత్సూత్రమనిష్టమ్॥

యవకార పరః। చ। ఏకేషామ్। ఆచార్యాణామ్॥

వివరణ :–

యకారమును, లేక వకారమును పరమందు గల్గిన పదాంత మకారము లోపించునని కొందరి అభిప్రాయము. ఈ సూత్రమున కొందరుగ చెప్ప బడినవారు షష్ఠమాధ్యాయమున ముప్పదియవ సూత్రమున చెప్పబడిన వారే. అనగ అచట (5-30) యకారమును గాని, వకారమును గాని పర మందు గల్గిన పదాంత మకారమునకు సస్థానీయ అనునాసికత్వమును నిషే ధించిన వారే ఇచట అట్టి మకారమునకు లోపమును విధించుచున్నారు. కను కనే ఇచట (2-30) సస్థానానునాసికత్వము నంగీకరించలేదు. అయితే ఈ భావము అంత యు సింహావలోకన న్యాయమునను సరించి సూత్రమునందలి (13-3) "చకారము"చే చెప్పబడుచున్నది. ఇకనిపుడు ఉదాహరణలు :

త్వ , యజ్ఞేష్వీడ్యః (1-1-14-4) [త్వమ్। యజ్ఞేషు। ఈడ్యః] త స్వా ఏత ం యజమానః (5-6-9-3) [తమ్। వా। ఏతమ్। యజమానః] "య, వ, కారమును పరమందు గల్గిన" యని చెప్పటచే, ఇతర వర్ణముల పరముగ నున్నచో మకార లోపము రాదు.

ఉదా :— యం కామయేత (1-6-10-4) [యమ్। కామయేత]

ఈ సూత్రము అమోదము కాదని త్రిభాష్యరత్నకారులు చెప్పిరి. [3

సూత్రము 4 న సꣳ సామితి రాపరః॥

త్రిభాష్యము :– 'రే' త్యేవం పరః సం సా మిత్యేతయోర్గ్రహణ యోర్మ కారో నలుప్యతే। యథా— ప్ర. . । సాం... । సంసామితి కిమ్? శꣳ । రాపర ఇతి కిం? సꣳ రరాణః। పదాన్తశ్చ వ్యంజన పరః పాకృత (14–28) ఇతి వక్ష్యమాణం ద్విత్వ నిషేధం ఇతి శబ్దో నివారయతి। తస్మాదత్ర ద్విత్వ సిద్ధిః న।

సమ్। సామ్। ఇతి రాపరః॥

మణిప్రభ .– సమ్ ఉపసర్గ, భావార్థమున "సామ్"గ గూడ యగును. (సంస్కృతి, సాంస్కృతిక యను చోట్లయందువలె) ఇవి పద పాఠమున ప్రత్యేక పదములుగనే భావించబడును. "రా" దీర్ఘాన్తము. కాగ, 'సమ్' 'సామ్' ఈ పదముల కంటె రేఫ పరముగ నున్నను, వీని మకారమునకు లోపము రాదని సూత్రార్థము. నిజమునకు రెండవ సూత్రముచే మకారము నకు లోపము వచ్చుచుండగ, ఈ సూత్రముచే సమ్, సామ్‌ల యందు ఆ లోపము నిషేధింపబడినది. ఉదా :–

1 ప్రసమ్రాజమ్ (1-6-12 3) [ప్ర। సమ్–రాజమ్]
2 సామ్రాజ్యాయ సుక్రతుః (1-8-16-1) [సామ్ రాజ్యాయ।]

ఈ సూత్రము సమ్రాజ, సామ్రాజ్య అను రెండు స్థలములందే ప్రవర్తించుచున్నది. అనగ "రాజృ" ధాతునిష్పన్న పదములకే పరిమితమైనది.

సమ్, సామ్‌ల యొక్క మకారము అని చెప్పుటచే ఇతర పదముల యొక్క పదాన్త మకారమునకు లోపము వచ్చును.

శꣳ రాజన్నోషధీభ్యః (3-2-3-1) [శమ్। రాజన్। ఓషధీభ్యః] 'రా' 'పరః' యని 'రా' దీర్ఘాన్తముగా చెప్పుటచే హ్రస్వ 'ర' కారము కంటె పూర్వ మందున్న సం, సామ్‌లలోని మకారమునకు లోప నిషేధము లేదు. అనగ లోపము వచ్చును. ఉదా .– సꣳ రరాణః (1-4-44-1) సమ్-రరాణః]

ఇక సూత్రమందలి 'ఇతి' శబ్దము వక్ష్యమాణ సూత్రముచే (14–28) చెప్పబోవు ద్విత్వ నిషేధమును, సమ్, సామ్ విషయమున వారించును అని త్రిభాష్యంత్న కారుని అభిప్రాయము. కనుకనే

సమ్రాజ్యమ్: సామ్రాజ్యాయ అని "మ్రా" కారమును చెప్పవచ్చును. అయితే మాహిషేయ భాష్యకారులు 'ఇతి' ప్రయోజనము గూర్చి ఏమియు చెప్పలేదు.

సూత్రము 5 అధ వర్ణానామ్॥

త్రిభాష్య :– అధేత్యయమధికారః। వర్ణానాం సంహితా వక్ష్యత ఇత్యేత దధి కృతం వేదితవ్యమ్। అథవా అథశబ్దః పద సంహితా నిషేధకః॥

అధ। వర్ణానామ్॥

సంక్షిప్తభ :– 'అధ' అను శబ్దము అధికార వాచకము. అనగ ఇకనిపుడు ఏక పదస్థములగు వర్ణ సంబంధి కార్యముల గూర్చి చెప్పబడును.

ఇంతవరకు అనగ, ఐదవ అధ్యాయము మొదలుగ ఇంతవరకు రెండు పదముల యొక్క అద్యన్తవర్ణములలో గల్గు మార్పులు చెప్పబడినవి. పూర్వ పదాన్త వర్ణము, ఉత్తర పదాదివర్ణముల మధ్య పరస్పర ప్రభావముచే గల్గు మార్పులు చెప్పబడినవి. కాని, ఇపుడు ఏక పదమువందే ఒక వర్ణమునకు ఇతర వర్ణ సన్నిధానమున గల్గు మార్పులు చెప్పబడుచున్నవి. దీనిని శాస్త్ర పరిభాషలో 'వర్ణ సంహితను గూర్చి చెప్పుచున్నారు' అని చెప్పవలెను. సంహిత యనగ "అర్ధమాత్రాధిక వ్యవధానముకంటె యధికముగు వ్యవధానము లేని విధముగ ఉచ్చరించుట" కాగ ఇట్టి ఉచ్చారణము పదసంబంధియైనచో నది 'పద సంహిత' అనబడును అక్షర సంబంధియగుచో "అక్షర సంహిత" యగును. అట్లే వర్ణ సంహిత అంగ సంహితలు కూడ తెలియవలెను. కాగ సంహిత నాల్గు విధములు. పద, అక్షర, వర్ణ, అంగ సంహితలు. అట్టి సంహితలలో ఇపుడు వర్ణ సంహితయందలి మార్పులు చెప్పబడును. కనుక, 'అధ' శబ్దము 'పదసంహితా' నిషేధ వాచకమని చెప్పకొనవచ్చును. లేదా అధికార వాచి యనినచో, వక్ష్యమాణ కార్యములు వర్ణసంహితయందు కల్గునని తెలియచెప్పను. [5]

సూత్రము 6 ఋకారర్కార రష పూర్వోనకారో ణకార ం సమానపదే॥

త్రిభాష్య :– సమానపద ఏకపద। ఋకారర్కార రేఫ షకార పూర్వో నకారో

కారమాపద్యతే। త్రిభిర్ .. ; త్వ ః . ; ఏష , కృష్ణో ...; ఏవం పూర్వ
ఇతికిమ్? దేవానామ్ ; సమానపద ఇతి కిం? ఏభి , సమానం చ తత్వ
ం చ సమానపదమ్ తస్మిన్॥

ఋకారర్కార రషపూర్వః। నకారః। ణకారమ్। సమానపదే॥

ంజీవళ :— ఈ అధ్యాయమున నకనుంచి ఏకపదస్థమగు నకారమునకు
ణత్వ ప్రాప్తిని గురించి, సహజముగు "ణ"కారముల గూర్చి వివరించబడును.
పకృత సూత్రమున సమాన పదమందలి నకారము ణకారముగ మారుటను
చెప్పుచున్నారు.

ఋకార, ఋకార, రేఫ, షకారములు. వీనిలో దేనినైనను పూర్వ
మందు గల్గిన నకారము ణకారముగ సమాన పదమున మారును. సమాన
పదమనగ అదే పదమని యర్థము. కాగ, 'ఋ' 'ౠ' ర, ష, వీని తర్వాత
నున్న నకారము ణకారముగ మారునని సూత్రార్థము. ఉదాహరణలు :—

త్రిభిర్ ఋణవా జాయతే (6- -10-5)

త్వ ః హోతృణామ్ - (4-3-13-4)

ఏష వా ఋతో వర్షః - (6-1-3-1) కృష్ణోఽసి (1-1-11-1)

ఋ, ౠ, ర, ష, పూర్వమందు కల్గిన అమటచే ఇతర వర్ణములను పూర్వ
మందు కల్గిన నకారమునకు ణత్వము రాదు. ఉదా :— 'దేవానాం వా
అన్తం జగ్మషామ్ (7-..-8-1) దేవానామ్, అన్తమ్‌లలోని నకారమునకు
'ణ'త్వము రాలేదు.

'సమాన పదమందు' అని చెప్పుటచే నకారముకంటె పూర్వ పదాంత
మందు ఈ నిమిత్తములున్నను, 'ణ'త్వము రాదు ఉదా :—

ఏభిర్నో అర్కైః (4-4-4-7)

పాణిని అష్టాధ్యాయియందు 'రషాభ్యాం నో ణః సమానపదే"
అని సూత్రీకరించెను. [6]

సూత్రము 7 వ్యవేతేఽపి॥

త్రిభాష్య:— ఉక్తనిమిత్తపూర్వో నకారోఽన్యేన వ్యవేతేఽపి వ్యవహితేఽపి

ణత్వమాప్నోతి। యథా— అవ అత్మ అధి కృష వంవే తః। అ౦॥

పూర్వ సూత్రమునందు ఋ ౠ ర షలను నిమిత్తముగ నకార మును నిమిత్తిగ ణత్వము కార్యముగ చెప్పబడినది కద ఇపుడీ సూత్రమున "నిమిత్త నిమిత్తులు ఇతర వర్ణములచే వ్యవధానములైనను అంగీకారము చేయబడినను ణత్వము సిద్ధించును అని చెప్పబడెను

ఋ ౠ రేఫ షకారముల తర్వాత వెంటనే ణకారము ఉండనక్కర లేదు వీని మధ్యలో ఇతర వర్ణములున్ననూ ఋకారాదుల ప్రభావముచ నూ గ నున్నను కొంత ణకారముగ మారును అయితే ఈ వ్యవధానము కూడ కొన్ని వర్ణముల వలననే యుండవలెను అ వర వివరము 1 ఎ సూత్రమున చెప్పుదును పాణిని ఈ వ్యవధానము అట్ కు పు ఆఙ్ నుమ్ వ్యవాయేఽపి అని వివరించెను

ఉదా అవర శు వృక్ణం దహతి (౫ 1 10 1)

ఇట ఋకార ణకారముల మధ్య కకారమున్నను ణత్వం వచ్చెను

2 అ ప్రస్నిహా రమణం కురుతే (6 5 11 4) [ర్ అష్ అస]

3 ధిషణామ్ (1 1 5 2) [ష్ అవ్ అన=షణ]

4 కృషమాణ పతిషాకామః (౬ 4 3 3) [ష్ అమ్ అన=షమాణ]

ఈ విధముగ ఋ ౠ రేఫ షకారము లకు నకారమునకు మధ్య కొన్ని ఇతర వర్ణములున్నను నకారమునకు ణత్వము వచ్చెను [౧]

సూత్రము 8 వారణ్యయమ్॥

త్రిభాష్య - వారణ్యయ మిత్యస్మిన్ గ్రహణే నకారో ణత్వ మాప్నోతి। యథా - వారణ్య స్పర్శవర (13-15) ఇతి వక్ష్యమాణ ప్రతిషేధస్య ప్రతి ప్రసవార్థమిదం సూత్రమ్॥

వారణ్యయమ్॥

పరిశీపిక -

వారణ్యయ అను పదమున నకారము ణకారముగనే యుండవలె

భావము. ఈ సూత్రమును ఇచట చెప్పుటచే వక్ష్యమాణ సూత్రముచే (3-15) చెప్పబోవు నిషేధమునకు అపవాదయగును. ఆ సూత్రమున 'న' కారము తర్వాత స్పర్శ పరముగా ఉన్నచో ణత్వము రాదని చెప్పబడినది. 'హిరణ్మయ మను' పదమున ణకారము తరువాత మకారముండుటచే, ణత్వము సిద్ధించదు. కనుక దానిని వారించుచు, ముందుగ అపవాదకు అపవాద చెప్పబడెను. ఇట్లు చెప్పుటకు "ప్రతి ప్రసవమని" శాస్త్ర పరిభాష. కాగ 'హిరణ్మయ' యందు ణత్వము ఉన్నది. ఉదా:- హిరణ్మయం దామదక్షిణా (2-4-12) [8]

అవతారిక :- ఆరవ సూత్రమున సమాన పదమందలి 'న'కారమునకు ణత్వ విధానము చెప్పబడినది. ఇపుడీ చెప్పబోవు ఆరు సూత్రములందు, పూర్వము చెప్పిన నిమిత్తము సంబంధము లేకుండా, సహజముగనే ణత్వము గల పదములను గురించి వివరించును. ఈ పదములందలి ణకారము సహజమని (ప్రాకృతము) 14 వ సూత్రమునందు చెప్పబడినది. 'ప్రాకృత ణకారము' అని చెప్పుటచే ఆ పదముయొక్క ఇతర రూపములందు కూడ ఆ ణకారము మారదని భావము. ఇపుడు సూత్రములను వివరంగా చూద్దాము.

సూత్రము 9 పాణిగణ పుణ్యకణ్వకాణ గాణ బాణ వేణు గుణ మణి ప్రవాదేషు పూర్వః॥

త్రిభాష్య :- పాణీత్యాది శబ్దానాం ప్రవాదేషు పూర్వః ప్రథమో ణకారః ప్రకృత్యైవ వేదితవ్యః। ప్రకర్షేణవాదః ప్రవాదః। లిఙ్గ విభక్తి భేద సమాస తద్ధితాదిభిః నిర్దేశ ఇత్యర్థః। యథా:— సుపా...; వృష...; హిర...; గణా..; గణా ; గణేన ; దూరే ; పుణ్యే. ; సా .; కణ్వా. , తస్మై ., అకర్ణయా .; గాణ...; విశల్యే....; వేణు...; వేణునా.. ; యత్ , యథా ., మణినా ..,

నను గణ శబ్ద ప్రవాదత్వాత్ గాణ గ్రహణ మయుక్తమ్। మైవమ్ః గణప్రవాదత్వే సతి తద్భవేత్। కింతు గణపతి శబ్ద ప్రవాదోఽయమ్। పూర్వ ఇతి కిమ్? గణ..; వేణు. ; మణి. ; ఇత్యాదిషు ఉత్తరస్య ణత్వం మా భూదితిః

పాణి, గణ, పుణ్య, కణ్వ, కాణ, గాణ, బాణ, వేణు, గుణ, మణి ప్రవాదేషు పూర్వః॥

వ్యాఖ్య :– ఈ సూత్రమందలి ప్రవాద శబ్దమునకు "ఈ పదములయొక్క లింగ, విభక్తి, భేదములు, సమాస తద్ధితరూపములు కూడ గ్రహింపబడును." అని అర్థము. పూర్వః అనగ "తొలి" అని అర్థము. కాగ, పాణి, గణ మొదలగు శబ్దముల యొక్క, భిన్న రూపములలో తొలి 'ణ' కారము అట్లే యుండును. ద్వితీయాది నకారము దన్త్యమగును అని సూత్ర భావము. అంతకంటె ప్రాతిపదికలలోని సహజమైన 'ణ'కారము. దీనికి నిమిత్తములవసరము లేదు — అని చెప్పుకొనుట యుక్తము. వీనియొక్క వివిధ రూపములందు, ప్రత్యయ సంబంధ నకారమునకు తగు నిమిత్తమున్నచో "ణ"కారముగా మారును. లేనిచో నకారముగనే యుండును.

ఉదా:– 1 పాణి:– సుపాణిః స్వఙ్గురిః (3-1-11-4, 4-1 6-3)
వృషా పాణయోఽశ్వాః (4-6-6-3)

హిరణ్యపాణి మూతయే (1-4 25, 2-2-12-2) ఇంకను ఆరు స్థలములందు ఈ పాణి శబ్దము కలదు.

2 గణ :– గణానాం త్వా గణపతిం హవామహే (2-3-14-3)
గణా మే మా వితృషన్ (3-1-8-2) గణేన గణం (5-4-7-7)
దూరేమిత్రశ్చ గణః (4-6-5-6)

3 పుణ్య :– పుణ్యో భవతి వసన్తమ్ (1-6-11-4) సామా పర్వాన్ పుణ్యాన్ (7-1-()

4 కణ్వ :– కణ్వా అభిప్రగాయత (4-3-13-7)

5 కాణ :– తస్యై కాణో యాదతః (2-5-1) అకర్ణయాఽకాణయాఽశ్లోణయా [6-1-6-7]

6 గాణ :– గాణ వత్యాన్ మయో భూరేహి [4-1-2-2]

7 బాణ :– విశల్యో బాణ వాం ఉత [4-5-1-4]

8 వేణు :– వేణుర్వైణవీ భవతి [5-1-1-4] వేణునా మిమీతే [5-2-5-2] యద్వేణోః సుషిరమ్ [5-1-1-4]

9 గుణ:– యథా గుణే గుణమ్ [7-2-4-2] ద్విగుణ [5-2-5-2-3]

10 మణి:– మణి నా రూపాణి [7-3-14] మణివాల [5-6-13]

సూత్రమున "పూర్వః" (తొలి) యనుటచే గణానామ్, వేణునా, మణినా, మున్నగు స్థలములలో ప్రథమముగ నున్నది మూర్ధన్య ణకారము. తర్వాత నున్నది ప్రత్యయ నకారము దన్త్యము.

ఇపుడు సన్దేహము గణ, గాణ, యని రెండు పదములు సూత్రము నందక్కర లేదు గణ శబ్ద భవము గాణ యగును. కనుక ప్రవాద శబ్దార్థ బలముచేతనే గాణ శబ్దము కూడా గృహీతమగును కద అయితే ఈ సందేహము గాణాపత్యమనుచోట వచ్చిన 'గాణా' రూపము 'గణపతి' శబ్ద భవము అంతియే కాని, శుద్ధ 'గణ' పద నిష్పన్నము కాదు కనుక సూత్రమున గణ, గాణ, యనునవి భిన్న పదములుగ గ్రహింపబడుట యుచితమే యగును. [9]

సూత్రము 10 పణి పణిం వీయమాణ ఊణ్వోః॥

త్రిభాష్య :- పణీత్యాది గ్రహణేషు ణకారః ప్రకృత్యైవ వేదితవ్యః॥ అప్రవాదార్థోఽయ మారమ్భః॥ అగ్నె.. , పణిం.. , వీయ .. , ఊణ్వోః॥

పణి, పణిమ్, వీయమాణ, ఊణ్వోః॥

మణిప్రభ :-

"పణి, పణిం వీయమాణ, ఊణ్వోః" అను ఈ శబ్దములలోని ణకారము ప్రకృతమైనది, సహజమైనది. ఈ సూత్రము ప్రత్యేకముగ చెప్పబడుటచే 'ప్రవాదేషు' అనునది ఈ పదములకు నివారించబడినదిగా తెలియవలెను.

ఉదా :- 1 పణిః :- అగ్నేదేవ పణి భిర్వీయ మాణః (1-1-13-2)
2 పణిమ్ :- పణిం గోషు స్తరామహే (2-6-1'-2)
3 వీయమాణః :- వీయమాణః॥ తం త వీతమ్ (1-1-13-2)
లేదా మొదటి ఉదాహరణమును కూడా గ్రహించవచ్చును
4 ఊణ్వోః :- ఊణ్వోః కవి క్రతుమ్ (1-2-6-1) [10]

సూత్రము 11 టవర్గ పరః॥

త్రిభాష్య :- టవర్గేపరే ణకారః ప్రకృత్యైవ వేదితవ్యః॥ శిత్రి.. , కణ్డూ , టవర్గ పరోయస్మాత్ స తథోక్తః॥

టవర్గ పరః॥

మణిప్రభ :– టవర్గీయ స్పర్శాక్షరమునకు పూర్వమందున్న 'ణ' కారము ప్రకృత ణకారముగ తెలియవలెను. అయితే మొత్తం సంహితలో ఠకార, డకారముతో కూడిన "ణ'కారము కలదు. ట, థ, కారముతో కూడిన ణకారము లేదు. అనగ ణ్ఠ ణ్డ యను ద్విత్వాక్షరములోని ణకారము సహజమైనది.

శితికణ్ఠాయచ (4-5-5-1) శితికణ్ఠాయ స్వాహా॥ ( ? )
కణ్డూయేత పామనం ఖావుకాః (6-1-3-8) అట్లే ఇంకొక ఉదా:–
కాణ్డాత్కాణ్డా త్ప్రరో హన్తీ (4-2-9)

సూత్రము 12 చఙ్క్రణపణత్ స్థాణౌ హిణుయాద్ధిణోతి కౌణేయోఽణిష్ఠో ఉల్బణముగణా శ్రుతిశ్చపుణీకా వాణీ జాయాణవశ్చాట్ణార స్థాణుం తూణవే వీణాయామ శ్లోణయాపణేత వాణీః కల్యాణీకుణ పం వాణః శ్నతశోణా శ్రుతిర్ధాణీకా మేణీ॥

త్రిభాష్య :– చఙ్క్రణ ఏషుణకారః ప్రకృత్యైవవేదితవ్యః। అవ....; అన్వా . అయ , త్రా. .; ఏవా. ; రజ .; యే ..., యజ్ఞ... ; యత్ర యత్ర శ్రుతిరుగణా గ్రిహణస్య తత్ర తత్ర ణత్వం కరణీయమ్। ఆవా , ఉగణ . ; వర్ష....; మన్త్రిణే....; ప్రియ....; చేతికిమ్? అనవ ..., ఏతం....; యు...., యా...., అశ్లోణ్యా...., పణే...., ఇన్ద్రిం...., కల్యాణీ...., పురుష...., వాణ...., శతేతి కిం? ఋతా ..., శోణా...., శ్రుతిరితి కిం? శోణాయ...., ని , వన , మకారేణ కిం? ఉభ .. ,॥

చఙ్క్రణ; పణత్; స్థాణౌ, హిణుయాత్; హిణోతి; " కౌణేయః ఆనిష్ఠాః, ఉల్బణమ్, ఉగణాశ్రుతిః, చుపుణీకా, బాణీజాయ, అణవశ్చ, అటారః, స్థాణుమ్, తూణవే, వీణాయామ్, అశ్లోణయా, పణేత, వాణీః, కల్యాణీ, కుణపమ్, వాణశ్నత, శోణాశ్రుతిః, ధాణీకా, మ్ఏణీ॥

మణిప్రభ :– చఙ్క్రణ, ఫణత్ మొదలగు పదమందలి 'ణ'కారము ప్రకృత 'ణ'కారముగ తెలియవలెను.

ఉదాహరణలు :-

1 చఙ్కుణ — అవభృథ నిచఙ్కుణ నిచేరుః (1-4-45-2) (6-6-3 4)
2 ఫణత్ — అన్వావసీ ఫణత్ (1-7-8-3)
3 స్థూణౌ — అయః స్థూణా వుదితౌ (1-8-12-3)
4 హిణుయాత్ — భ్రాతృవ్యాయ ప్రహిణుయాత్ (2-2-6-5)
5 హిణోతి — ఏవాఽస్మై ప్రహిణోతి (2-2-6-5)
6 కౌణేయః — రజనో వై కౌణేయః (2-3-8-1)
7 అణిష్ఠాః — యేఽణిష్ఠా స్తాన్ (2-5-5-2)
8 ఉల్బణమ్ — యజ్ఞ ఉల్బణం క్రియతే (3-4-3-7)
9 ఉగణా — అవ్యాధినీరుగణా ఉత (4-1-10-2) ఈ 'ఉగణా' యను ప
మెచట వచ్చినను, అందలి 'ణ'కారము ప్రకృతమె యగును. కనుక
'ఉగణాభ్య స్తృంహతీభ్యః (4-5-4-1) అని ఉదాహరణము.
10 సుపుణీకా — వర్షయన్తీ సుపుణీకా నామాఽసి (4-4-5 1)
11 వాణీజాయ — మన్త్రిణే వాణిజాయ కక్షాణాం పతయే (4-4-2-?)
12 అణవశ్చ — ప్రియఙ్గవశ్చమేఽణవశ్చమే (4-7-4-2)

అణవః తరువాత చకారమున్ననే ణత్వము। లేనిచో 'న'త్వమే.

ఉదా:— అనవస్తే రథమ్ (1-6-12-6) [అనవః తే రథమ్]

13 అట్ణారః — ఏతం వై పర అట్ణారః (5-6-5-3)
14 స్థాణుమ్ — యః స్థాణుం హన్తి ( -3-1-1)
15 తూణవే ] యా తూణవే యా వీణాయామ్ (6-1-4-1)
16 వీణాయామ్]
17 అశ్లోణయా — అశ్లోణయాఽసప్త శఫయా క్రీణాతి (6-1-6-7)
18 పణేత — పణేతాఽగో అర్ఘం (6-1-10-1)
19 వాణీః — ఇన్ద్రం వాణీరనూషత (1-6-12-2)
20 కల్యాణీ — కల్యాణీ రూపసమృద్ధా సాస్యాత్ (7-1-6-6)
21 కుణపమ్ — పురుష కుణపం అశ్వకుణపం గౌః (7-5-9-2)
22 వాణశ్శత — వాణశ్శత తన్తుర్భవతి। (7-5-9-2)

వాణ తర్వాత శత అని యున్నపుడే 'ణ'కారము వచ్చును. లేనిచో 'న'కారమే యగును.

ఉదా:— ఋతావానశ్చయమానా ఋణాని (2-1-11-2)

3 శోణా – శోణాధృష్ణూ నృవా హసా (7-4-20) శ్రుతిః అని చెప్పుటచే శోణా ఇతర విభక్తి స్థలములలో గూడ ణత్వమే యుండును.

ఉదా: – శోణాయ స్వాహా (7-3-18)

4 ధాణికా— నిజల్గులీతి ధాణికా (7-4-19-3)

5 మ్ ఏణీ— వనస్పతీ నా మేణీ (5-5-15)

పూర్వ పదాన్తమున మకారము ఉన్నపుడే ఏనీలోని 'న' కారము ణకారముగ నుండును. అట్టి మకారము పూర్వమందు లేనిచో 'న' కారమట్లే యుండును. ఉదా:— ఉభయత ఏనీ స్యాత్తదాహుః (7-1-6-5)

ఈ విధముగ సూత్రమందలి పదములు సోదాహరణముగను, అవసర మగు స్థలములందు ప్రత్యుదాహరణములతోను వివరింపబడెను. [12]

సూత్రము 13 అవగ్రహోవృషణీ ఛర్షబ్రహ్మణక్షణ్చ రణ్చర్షణ్॥

త్రిభాష్య:– వృషణ్ణిత్యాది గ్రహణే ష్వవగ్రహో 'ణ' కారః ప్రకృత్యైవ వేదితవ్యః। వాతో . , శీర్ష .; బ్రహ్మ , అక్ష ; చర్మ . . । చర్షణ గ్రహణస్య శాఖాన్తరే విజ్ఞేయమ్ ఉదాహరణమ్। మిత్రస్య ఇతి కేచి దుదాహరన్తి। తన్నసాధు। అన్తోలోపాత్ (13-15) ఇతివక్ష్యమాణ ప్రతిషేధ ప్రతిప్రసవార్థం ఉక్తత్వాదేషాం గ్రహణానాం 'వర్షణీధృత' ఇత్యత్ర ణకారస్య పదాన్త త్వాఽభావాత్। అథవా ఋకారర్కారరషా (13-6) అదిప్రాప్తే అత్రణకారో వైకృత ఇతి శంకా నిరాకరణార్థం ఏతాని గ్రహణానీతి అన్యే మన్యన్తే। తథాసతి "మిత్రస్య చర్షణీ ధృత" ఇత్యుదాహరణమ్ రమణీయ మ్। అవగ్రహ ఇతికిమ్? వృష , తస్మా .; బ్రహ్మ .; అక్ష . పశూనాం ॥ అవగ్రహస్థోఽవగ్రహ ఇతి లక్ష్యతే॥

అవగ్రహః। వృషణ్। శీర్షణ్। బ్రహ్మణ్। అక్షణ్। చర్మణ్ చర్షణ్॥

మణిప్రభ :– అవగ్రహలగు (సమాసమున పూర్వ పదముగ నుండిన వృషణ్, శీర్షణ్, బ్రహ్మణ్, అక్షణ్, చర్మణ్, చర్షణ్ అను పదములలో పదా

కారము ప్రాకృతికము అని సూత్రార్థము అవగ్రహః అను దానికి "అవగ్రహస్థః" అని భావము. ఉదా:—

వృషణ్ — వాతో అపాం వృషణ్వాన్ [వృషణ్-వాన్] (2-1-11-1)
శీర్షణ్ — శీర్షణ్వాన్ మేధ్యో భవతి [శీర్షణ్-వాన్] (7-5-25-1)
బ్రహ్మణ్ — బ్రహ్మణ్వన్తో దేవా అసన్ [బ్రహ్మణ్-వన్తః] 6-4-10-1
4 అక్షణ్ — అక్షణ్వతే స్వాహా [అక్షణ్-వతే] (7-5-12-1)
5 చర్మణ్ — చర్మణ్వతే స్వాహా [చర్మణ్-వతే] (7-5 1 2)
6 చర్షణ్ — దీనికి తైత్తిరీయ శాఖయందు దాహరణము లేదు. శాఖాన్తరమునందు చూచుకొనవలెనని త్రిభాష్య రత్నకారులు. అయితే కొంతమంది 'మిత్రస్య చర్షణీ ధృతః' [3-4-11-5] అనుదానిని ఉదాహరణగా చెప్పుచున్నారు కాని అది సమ్మతము కాదు. సూత్రమునందు వృషణ్ ఇత్యాదులు అవగ్రహస్థితిలో "ణ"కారాన్తముగా నున్నవానినిచ్చిరి. చర్షణీ ధృతః యనుచోట అట్టి 'ణ' కారము పదాన్తమున లేదు. కనుక అ ఉదాహరణ మయుక్తము.

ఈ సూత్రము యొక్క లక్ష్యము పదునైదవ సూత్రముచే పదాన్త ణకార నకారములకు విధింపబడు లోపమున కపవాద చెప్పుట. కాగ చర్షణీ అనుచోట పదాన్త నకారము లేదు గద

కాని కొంతమంది ఈ సూత్ర లక్ష్యమును వేరుగ చెప్పిరి. ఋకార ర్కార రషకార పూర్వః 13-6 అను సూత్రముచే పైపదములందు ప్రాప్తించిన ణత్వము ప్రాకృతమా? వైకృతమా? అను సన్దేహ నివృత్తికై చేయబడినది. ఫలితముగ పై పదములలోని ణత్వము 13-6 సూత్రముచే వచ్చినది కాదు. అది సహజమైనదే ప్రాకృతమే అని తేలినది. కనుక 'మిత్రస్య చర్షణీ ధృతః' అను ఉదాహరణము యుక్తమనుచున్నారు. ఈ అభిప్రాయమే ప్రాతిశాఖ్యకారులకున్నచో సూత్రమందు 'చర్షణీ' అని చెప్పి యుందురు గద. కనుక ఈ అభిప్రాయము కూడ సరైనది కాదు. కాగ 'చర్షణ్' అనుపది అవగ్రహగ ఈ శాఖయందు ఎచటను లేదు. మాహిషేయ భాష్యకారుడు కూడ ఈ పదమును వ్యాఖ్యానించలేదు. సూత్రమందు "అవగ్రహ యగు" అని చెప్పుటచే ఇతర స్థలములందు బ్రహ్మన్, వృషన్, శీర్షన్, అక్షన్,

ర్మన్ అనియే యుండును. అనగ 'న'కారమే యుండును కాని ణత్వము
3-6 సూత్రము...

... — వృషన్నగ్నే విశ్వావస్వర్య అ (4-4-4-4)
తస్మాత్ సప్త శీర్షన్ (5-1-7)
బ్రహ్మన్విశ్వం వి (2-3-3-5)
అక్షన్నమీమద న్త (1-8-5-2) పశూనాం చర్మన్ (6-1-9-2)

ఈ విధముగ ఈ సూత్రము వక్ష్యమాణ పదునైదవ సూత్రము (13-15)
కు ప్రతి ప్రసవమని వివరింపబడినది. [13]

సూత్రము 14 ఋణ్ణ్ షణ్ణ్ ష్ణ్ మ్ణ్ శాన్ణ్ చేతి ప్రాకృతాః॥

త్రిభాష్య :- అత్ర సూత్రే పద్రై క దేశా ఏతే బహూపాదానార్థ ముక్తాః।
ఋణ్ణా... ష్వేషు చ ణకారాః ప్రాకృతా ఏవ విజ్ఞేయాః॥ న్వ.. , అసం.. ,
...యి , అభి , నిష్ , దశ...., పూష్ణో .., పూష్ణా. , పూష్ణి....,
...ర్యమ్ణే , దధి . , అ... ,

ప్రాకృత శబ్దోయం పాణ్యాదిష్వివ చర్మణ్ పర్యన్తేషు ముఖ్యః। చత
ష్ప్రషు సంహితాసు ణత్వ సద్భావాత్। ఋణ్ణేత్యాదిషు తు న ముఖ్యః। కింతు
ప్రాప్త్యభావేఽపి ణత్వప్రాపణార్థః। తథాహి: — ఋణ్ణాదౌ పూర్వ ణకారస్య
ష్ప్రర్ప పరత్వాన్నిషేధః। ఇతరస్యోత్తరస్య తవర్గీయ వ్యవహితత్వాత్। ష్ణ
ష్ణు గ్రహణయోస్తు స్వలోపాదితి నిషేధః। గ్రహణ సామర్థ్యాదేవ ణత్వం సిధ్య
తీతి చేత్— ఏవం స్వభావత్వమేవ గ్రహణస్యాఽపి ...మితి పరిహారః।
కిం చ అన్వాచయే వర్తమాన శ్చకారోఽప్యేతేషు ణత్వ ముఖ్యమితి ద్యోత
యతి। ముఖ్యం చేత్ చతసృషు సంహితాసు విద్యేత। నచాత్ర విద్యతే।
తథాహి అభిష్ణ ఇతి అభి-సన్న॥ నిషణ్ణాయేతి ని-సన్నాయ ఇత్యత్ర పద
సంహితాయామ్। పూషన్నర్య మన్నితి నకారాన్త శబ్దయోః "పూష్ణో ర ... హ్యై।
అర్యమ్ణే చరుమ్" ఇత్యాది సిద్ధరూపత్వాత్ అత్ర వర్ణ సంహితాయాం
ణత్వభావో మన్తవ్యః। ప్రసిద్ధ పద సమిభి వ్యాహారే బాఽప్రసిద్ధ పదార్థ
సమర్థనమర్థ శాస్త్రవిధః సర్వేఖలు స్వీ కుర్వతే। తస్మాదస్మదుక్త ఏవ
యుక్తః ప్రాకృత శబ్దార్థః॥

బుష్ణ, షణ్ణ, ష్ణ, ష్ణు రాష్ణ చ ఇతి ప్రాకృతాః॥

మణిప్రభ :-

ఈ సూత్రమున బుష్ణ, షణ్ణ, ష్ణ, ష్ణు, రాష్ణ అనునవి పదైకదేశములు. కనుక ఈ భాగములను కల్గిన భిన్న పదములన్ని ఈ సూత్రమునకు లక్ష్యములే యగును. కాగ బుష్ణ, షణ్ణ, ష్ణ, ష్ణు, రాష్ణ— వీనియందలి 'ణ' కారము ప్రాకృతము అని సూత్రార్థము.

ఈ సూత్రమందలి ప్రాకృత అను విశేషణము కేవలము ఈ సూత్రమందలివానికే గాక పూర్వమందు చెప్పబడిన హిరణ్మయ, పాణి మొదలు ఈ సూత్రస్థ పదములకును వర్తించును. అనగ 13-8 వ సూత్రము నుంచి 13-14 సూత్రములలో చెప్పబడిన పదములలోని 'ణ' కారము ప్రాకృతమే అని అర్థము. ప్రాకృతమనగ వికార ఫలితము కానిది. సహజమైనది అని భావము. అనగ 13-6, 13-7 సూత్ర నిమిత్తములను పురస్కరించుకొని దన్త్య నకారము మూర్ధన్యముగ మారలేదనియు, ఈ పదములందలి మూర్ధన్య ణకారము సహజమైనదే అనియు తెలియువలెను. అంతేకాక ఈ పదముల లోని 'ణ' కారము పదసంహితయందు, వర్ణసంహితయందు, అక్షర సంహిత యందు ఏకాకారముగ నున్నది కనుక ప్రాకృతమగును. కాగ హిరణ్మయాది శబ్దములలోని ణకారము ప్రాకృతమే యగును. కాని, ఈ సూత్రమున చెప్పిన బుష్ణ, షణ్ణ ష్ణ, ష్ణ రాష్ణలలోని 'ణ'కారము ప్రాకృతమగునా అను విషయము వివాదాస్పదము. కనుక దీనిని వివరించే ముందు ఈ సూత్ర లక్ష్యములను పరిశీలిద్దాము.

1 బుష్ణ :- స్వయి మాతృష్ణా ముప (5-2-8-1, 5-3-2-1)
అసంతృష్ణేహి హనూ (6-3-11-3) స్వయమాతృష్ణా జ్యోతిః (5-7-6-1)
2 షణ్ణ :- అభిషణ్ణో యస్మాత్ (2-4-2-4) నిషణ్ణాయ స్వాహా (7-1 19-1)
దశమాసా నిషణ్ణా ఆసన్ (7-5-1-1, 7-5-2-1)
3 ష్ణ :- పూష్ణో ర హ్యై (1-3-10 2) పూష్ణా సయుజా సహ (4-1-2-2)
పూష్ణే ప్రపథ్యాయ స్వాహా (7-3-15)
4 ష్ణు :- అర్యమ్ణే చరుం నిర్వపేత్ (2-3-4) సుత్రామ్ణే (1-8-9-2)
5 రాష్ణ :- దధిక్రాష్ణో అకారిషమ్ (1-5-11-4) (7-4-19-4)
అగ్రాష్ణః (6-3-2-3)

ఇవి ఉదాహరణలు. అయితే ఇందులో "తృణ్ణ" అనునది నాల్గు సంహితలందు ఏకాకారముగనే యున్నది కనుక నిజమునకు దీనిని పూర్వ సూత్రములలో ఎచటనైనను చెప్పిన బాగుండెడిది. ఇక 'షణ్ణ' (అభిషణ్ణ, నిషణ్ణ) విషయములలో పదసంహితయందు 'ణ'కారము 'న'కారముగ మారు చున్నది. అభిషణ్ణ ఇత్యభి–సన్నః.

నిషణ్ణా యేతి ని–సన్నాయ కనుక షణ్ణలోని 'ణ'కారము ప్రాకృతము కాదు. అట్లే అర్యమన్, పూషన్ మొదలగు నకారాన్త శబ్దములలోని నకారము 'ణ'కారముగ మారినది. అయితే ఈ సూత్రమున వీనిని చేర్చి ప్రాకృతాః అని చెప్పుటచే వీనికి 15-వ సూత్రముచే చెప్పబోవు ణత్వ నిషేధమును వారించి నిపతించబడెనని గ్రహించవలెను.

తృణ్ణ, షణ్ణ – వీనియందు ఋకార, ౠకార, రేఫ, షకారములను పురస్కరించుకొని (సూ. 13-6) నకారమునకు 'ణ'త్వము ప్రాప్తించుచుండగ, స్పర్శపరముగ నున్నను, తవర్గ, టవర్గ పరముగ నున్నను, ణత్వము రాదు. (13-15) అను నిబంధనచే 'ణ'త్వము తృణ్ణ, షణ్ణ అనువానియందు వారింపబడినది. అట్లే ష్ణ, ష్ణు, ష్ణ అనువానియందు — పూషన్ శబ్దము యొక్క పూష్ణా, పూష్ణే ఇత్యాదులందు షకారము పైనున్న అకారము లోపించినది. కనుక అట్టి అకార లోపము తర్వాత నున్న నకారమునకు ణత్వము రాదు. (13-15) అను వాక్యముచే 'న'కారము ష్ణ, ష్ణు, రాష్ణల యందు వారింపబడినది. కనుక ఈ విధముగ సూ. 13-15 చే నిషేధింపబడిన ణత్వమును సాధించుటకై వానిని ఈ సూత్రమున (13-14) గ్రహించి "ప్రాకృతాః" అని చెప్పిరి. కాగ ఈ సూత్రము తర్వాత సూత్రము (15)నకు ప్రతిప్రసవము.

అయితే, షణ్ణ, ష్ణ, ష్ణు, ష్ణ ఇత్యాదులందలి 'ణ' కారము హిరణ్యపాణి, గణ మొదలగు వానియందున్న 'ణ'కారమువంటిది కాకపోయినను, వానితో పాటుగ కలిపి చెప్పుటచే ఇందలి ణకారమును కూడ ఆ విధమగు ప్రాకృతముగనే గ్రహించవలెను. ఋణ్ణ, షణ్ణ, ష్ణ, ష్ణు, ష్ణ–ల యందలి ణకారము సహజ 'ణ' కారము కాదని ఎట్లు తెలియును – అనిన, సూత్రమునందలి 'చ'కారముచే తెలియును. సాధారణముగ లోకమందు ప్రధానమైనవారిని లేదా ముఖ్యమైనవానిని ముందుగ చెప్పి, అముఖ్యమైనవానిని వాటితో కలిపి చెప్పినపుడు

'కూడ' (చ) అను పదమును ప్రయోగింతురు. కనుక సూత్రమందలి ప్రాక్పదాః అను శబ్దమునకు సహజమైన, ముఖ్యమైన ఇతర నిమిత్తములక్కర లేకుండగనే యున్నట్టి-అను అర్థము యుక్తము. [14]

సూత్రము 15 నషుమ్నోఽగ్నిర్యుష్మానీతోఽలోపాత్, స్పర్శపరో వ్యవవాయేషు శ స చ ట తవర్గీయేషు॥

త్రిభాష్యః:- షుమ్నః, అగ్నిః, యుష్మానీతః-ఏతేషు నకారో ణత్వంనాఽపద్యతే। సుషు , ఇంద్రా ..., యుష్మా ..॥ అన్తః పదాన్తో నకారో ణత్వం నాఽపద్యతే। పితౄన్ . , ప్ర ., అలోపాదకార లోపాత్ పరోఽపి నకారో ణత్వం నాఽపద్యతే। వృత్ర. . , వృత్రి....॥ నన్వత్ర నిమిత్త నిమిత్తి నోర్భిన్న పదస్థత్వాత్ విషమోదృష్టాన్తః। సత్యమ్। సింహావలోక న్యాయేన ప్రథమ ప్రశ్నే సప్తమాధ్యాయే శేషోదాహరణ రూపేణ ఘటతే। తత్ర చ సమాన పద నియమో నాస్తి। 'ఘ్న' ఇత్యస్య 'హన్' శబ్దవికృతత్వాత్ "రష పూర్వోహవనీతి (7-11) ప్రాప్తిః॥ స్పర్శపరో నకారశ్చ ణత్వం నాఽప్నోతి। సం కృ . , ఆవ...., నఖ । స్పర్శోఽత్రా ప్రసిద్ధ లక్షణ విషయో వివక్ష్యతే। అన్యథా పూర్ణా పశ్చాదిత్యాదౌ ణత్వం న స్యాత్। రేఫాత్పరంచ (14-4) ఇతి హి ప్రసిద్ధ లక్షణం తన్మూలం చ పూర్ణేత్యత్ర ద్విత్వమ్। ప్రసిద్ధ పదేన కిం? నఖనిర్భిన్న మిత్యాదావపి కథం చిల్లక్షణ మూలత్వం సంభవతి। కిం తల్లక్షణ మితిచేత్:- ద్వితీయ చతుర్థయోః (14-5) ఇత్యత్ర సూత్రోక్త వ్యంజనోత్తరయోః (14-5) ఇతివాచో యుక్త్యన్తర మితి బ్రూమః। తస్య లక్షణం తత్రైవ స్ఫుటీ కరిష్యతే మహతా ప్రబంధేన॥ స్పర్శపరో యస్మాత్ అసౌ స్పర్శపరః। శ, స, చ, ట వర్గీయేషు వ్యవధాయికేషు సత్స్వ నకారో ణత్వం నాఽపద్యతే। యథా రశనాం ., అగ్నే , రోచన్తే , సోమః . , వృతినా .., జన॥

ఋకారర్కార.... (13-6) ఇత్యాదిప్రాప్తేః ప్రతిషేధోఽయం విహితః॥

న। షుమ్నః। అగ్నిః। యుష్మానీతః। అన్తః। అలోపాత్,। స్పర్శపరః। వ్యవాయేషు। శ, స, చ, ట, తవర్గీయేషు॥

మణిప్రభ:- ఈ సూత్రము ఒక విధంగ ఐదు సూత్రముల సమ్మిశ్రనము.

ఇందులో వీనిని ఈ విధముగ విభజించుకొనవచ్చును.

1 షుమ్నః, అగ్నిః యుష్మానీతః అను పదములలోని 'న'కారమునకు 6, 7 సూత్రములచే ణత్వము ప్రాప్తించుచుండగా, ఈ సూత్రముచే (న) నిషేధము చెప్పబడెను.

2 అన్తః అనగ పదాన్తమందున్న నకారమని భావము. అట్టి నకారమునకు కూడ ణత్వము నిషేధము.

ఉదాహరణలు :– క్రమముగ

షుమ్నః : సుషుమ్నః సూర్యరశ్మిః (3-4-7-1)
అగ్నిః : ఇన్ద్రాగ్నిభ్యాం త్వా సయుజా (4-4-5-1)
యుష్మానీతః : యుష్మానీతో అభయం జ్యోతిః (2-1-11-6)
పదాన్త నకారమునకు : పితౄన్ హవిషే అత్తవే (1-6-12-1)
ప్రమృణీహి శత్రూన్ (1-2-14-2)

3 అలోపాత్ అనగ అకార లోపాత్ అని భావము. నకారమునకు పూర్వమందున్న అకారము లోపించినచో, ఆ 'న'కారమునకు ఇతర నిమిత్తముల కంటె ణత్వము రాదు. ఉదాహరణకు, వృత్రఘ్నః ఇన్ద్రాయ త్వా (1-4-1-1) వృత్రఘ్నస్తోమాః (4-7-15-1) ఇచట ఘ లోని అకారము లోపించినది. కనుక ఘ్న అయినది. కనుక 'న' కారమునకు 'ణ' త్వము రాదు. అయితే ఇక్కడొక సందేహం రావచ్చు. వృత్ర, ఘ్న అనునవి భిన్న పదములు కనుక, వృత్ర పదములోని 'న' కారమునకు 'ణ'త్వము రాలేదు కద. ఈ ణత్వ ప్రకరణము "ఒకే పదమునందు" (సమానపదే) అని కద చెప్పబడు చున్నది. ఇచట నిమిత్త నిమిత్తులు భిన్న పదస్థములగుచున్నవి గద. నిజమే కాని ఇచట 'ఘ్న' శబ్దము 'హన' శబ్ద వికృతి కద. కనుక "రషపూర్వో హవని " (7-11) అను సూత్రము సింహావలోకన న్యాయముచే ఇచట వృత్రఘ్న అనుచోట ప్రవర్తించి 'న'కారమునకు 'ణ'త్వం విధించును. కనుక దానిని వారించుటకై "అలోపాత్" అని నియమము చేయబడినది.

4 స్పర్శపరః — అనగ నకారము తర్వాత స్పర్శ వర్ణమున్నచో ణత్వము రాదు. ఉదా:— సంక్రన్దనోఽనిమిషః (4-6-4-1)
అవరున్ధే తార్ప్యమ్ (2-4-11-6)

ఇచట నకారము తర్వాత దకార, ధకారములు స్పర్శాక్షరములు పర

ుగ నుండుటచే నకారమునకు ణత్వము నిషేధింపబడినది. అట్లే "సఖ ిర్భిన్న" మనుచోట (1-89-1) గూడ 'న్న'కు ణత్వము వారింపబడినది.

ఇక "శస చట తవర్గీయేషు వ్యవహితేషు"

ఈ అధ్యాయము 6వ సూత్రము ఋ, ౠ, రేఫ, షకారమునకు పర ుందున్న నకారమునకు ణత్వము వచ్చునని చెప్పుచున్నది. 7వ సూత్రము ు నిమిత్తని మిత్తులకు మధ్య ఇతర వర్ణముల వ్యవధానమున్నను, ణత్వము ుచ్చునని వివరించుచున్నది. అయితే ఈ వ్యవధానము శకార, సకార, వర్గీయ, టవర్గీయ, తవర్గీయ వర్ణములచే మాత్రము కారాదు. అ గ ిమిత్త నిమిత్తుల మధ్య ఈ వర్ణములుండెనేని ణత్వము రాదు. ఉగ ాదా:— రశనా మాదత్తే (6-3-63) అగ్నేరసేన తేజసా (1-4-42-2) ోచన్తే రోచనా దివి (7-4-20) సోమః రాజానమ్ (1-7-10-1) ప్రక్రీడినః ుయోధాః (4-3-13-7) పృతనా జయేమ (3-5-3-1) జన ప్రథ నాయ స్వాహా (3-2-8-1)

పై యుదాహరణములను పరిశీలించగ రేఫ నకారముల మధ్య శ, స, ప, ట, త వర్ణాక్షరములు కూడ యుండుటచే, నకారమునకు 'ణ'త్వము ారింపబడినట్లు స్పష్టమగును. ఈ సూత్రము 13-6 సూత్రమునకు అవ ాదలను చెప్పినది. [15]

సూత్రము 16 పృక్తస్వరాత్పరో ళో డం పౌష్కర సాదేః పౌష్కరసాదేః॥

త్రిభాష్యః— పృక్తస్వరాత్ ఋకారాత్పరో ళకారో దుఃశ్లిష్ట సంజ్ఞకో డకార మాపద్యతే। పౌష్కరసాదేర్మతే। మృడాతి . । పృక్త స్వరాదితి కిం? సళం ప్లవమితి శాఖాన్తరే। పౌష్కరసాదేర్గ్రహణం పూజార్థం నతు వికాల్పార్థమ్। మూర్ధ స్థాన తయా దుఃశ్లిష్ట ళడకారయో సాదృశ్యమస్తీతి వ్యాకరణానుసారీ సూత్ర పాఠోఽయమ్। కథమనుసారి త్వమితి చేత్-తథాహి-స్థానేఽన్తర తమః। స్థానే ప్రాప్యమాణానాం వర్ణానామన్తరతమ ఆదేశో భవతి।

సూత్రస్య పాఠాన్తరమపి వ్యాఖ్యాయతే। పృక్తస్వరాత్పరో లకారో ళకారమాపద్యతే। యథా— తే ॥ పృక్తస్వరాదితి కిం? ఇలామ్. ,

సమానపద ఇతికిమ్? పితృలో । సహచారిత్వాత్ ఏకవ్య నిర్దిష్ట ఇతరస్యాఽపి పితృలోక కామస్యేత్యస్యాపి సమాన పదత్వే సత్యపి నిషేధో భవతి। ఇదమపి పారాన్తరం బహ్వాదృతమ్।

వృక్తస్వరాత్। పరః। లః। డమ్। పౌష్కరసాదేః। పౌష్కరసాదేః॥

వ్యాఖ్య – ఈ సూత్రముతో ఈ అధ్యాయము పూర్తియగును ఇంత వరకు మకార లోపము (1–4) తర్వాత నకారమునకు ణత్వము (6–15) గూర్చి విధ్యపవాద సూత్రములు చెప్పబడినవి ఇక నిపుడు లకారమునకు డత్వ ప్రాప్తి గురించి చెప్పుచున్నారు

వృక్త స్వరమనగ ఋ'కారము ఇది స్వరమైనను రేఫ గర్భితమై యున్నది కాగ హల్లును అంతతః కల్గియున్న అచ్చు ఇది కాగ ఇట్టి వృక్త స్వరము (ఋకారము) కంటె పరముగనున్న ల కారము డకారముగ మారును ఇట్టి లకారమునకు, దుశ్లిష్టమని పేరు ఇది సూత్రార్థము అయితే సూత్రము నందు పౌష్కరసాదేః అని చెప్పబడినది సాధారణముగ సూత్రమునందు ఏదేని ఆచార్యుని పేరు చెప్పి, అతని మతమునందు అనినచో ఆ కార్యము ఆ ఆచార్యుని మతమందేగాని, ఇతరుల మతమున కాదు అని అర్థము కాగ ఆ కార్యము వికల్పమని సారాంశము కాని శాస్త్రమునందు, వికల్పమును సూచించుటకే కాక, గౌరవమును సూచించుటకు కూడ అయా ఆచార్యుల పేరును స్మరించు ఆచారము కలదు ఈ విధముగ ఇచట సూత్రమునందు "పౌష్కరసాది" ఆచార్యుని పేరు పూజార్థము స్మరింపబడినదే కాని లకారమునకు డత్వప్రాప్తిలో వికల్పమును సూచించుటకు కాదని త్రిభాష్యరత్న కారులు స్పష్టము చేసిరి

అపుడు సాధారణంగ ఆదేశముగ వచ్చునపుడు స్థానేఽన్తరతమః అని స్థానాన్తర తమ్యమును చూతురు గద లకారము దన్త్యము డకారము మూర్ధన్యము కద. ఆన్తరతమ్యమును పురస్కరించుకొని చూచినచో లకార డకారములకెట్లు సరిపోవును? నిజమే శుద్ధ లకారము మాత్రము మూర్ధన్య స్థానీయము కనుక ఇట్టి లకార డకారములు సస్థానీయములే కనుక లకార స్థానమున డకారము వచ్చినది ఇకనిపుడు ఉదాహరణము – నృడాతీ

శే ('-1-14-3) నిజమునకిచట 'మృళాతి' అని తెలియవలెను. ఋకా
కంటె పరముగ నున్నపుడే ఈ మార్పు. లేనిచో లేదు.

:- నలమ్, ప్లవమ్ (ఈ యుదాహరణములు శాఖాన్తరము నుండి గ్రహింపబడెను.)

త్రిభాష్య రత్నకారులు ఈ సూత్రమునకు వ్యాఖ్యాన్తరము చెప్పిరి. ్కరసాది ఆచార్యుని మతమున అని 'వికల్పము' నే కొందరు అంగీకరిం
ఆ ప్రకారము సూత్రములోనికి 6వ సూత్రము నుండి 'సమాన పదే' నది అనువృత్తి రాగ, 'సమాన పదమందు, దుఃశ్లిష్ట లకారమునకు కారము కంటె పరముగ నుండు లకారమునకు) డకారమగును అని సూత్రా
ఉదా :- తేనో మృడయన్తు (4-4-3-2) "వృక్త స్వరముకంటె గు" అని చెప్పుటచే 'ఇలాన్దం భవతి' (7-5-9) అనుచోట లకారము డత్వము లేదు. సమానపదే అనుటచే 'పితృలోకః సోమేన (2-6-2-1) చోట ఋకార లకారములు భిన్న పదస్థములు అగుటచే లకారమునకు ము లేదు.

అయితే పితృలోక కామస్య (6-6-4-1) అను సంహితా పదమును పద మున పితృ-లోక కామస్య అని చెప్పబడినది. దీని ప్రకారము 'పితృ అనునది సమాన పదమే అగును కద. మరి ఇచట ఋకారాత్పర లకా నకు డత్వము ఏల రాలేదు? అని ప్రశ్న. నిజమే కాని 'పితృలోక' స్థలమున పూర్వమందే 'డ' త్వము నిషేధింపబడినది కద అదే నిషే ఇచటను ప్రవర్తించును. సహచారిత్వాదే కస్య నిషిద్ధః ఇతరస్యాఽపి అను పరిభాష ఇందుకు ప్రమాణము.

పౌష్కరసాదేః పౌష్కరసాదేః అను ద్విరుక్తి అధ్యాయ పరిసమాప్తిని బోధించును. [16]

కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ ప్రాతిశాఖ్యకు
త్రిభాష్య రత్నానుసారము వేదులోపనామక
సుబ్రహ్మణ్యముచే వ్రాయబడిన "మణిప్రభ"
అను ఆంధ్ర వివరణమున పదమూడవ అధ్యాయము
సమాప్తము.

యమును ద్విత్వ ప్రకరణమని చెప్పవచ్చును. సూత్ర త్వ విధిని చెప్పును. 8 వ సూత్రము ఛ, ఖ, థ వర్ణముల ను. 9—13 కొన్ని ఆగమములను చెప్పును. 14—28 ద్విత్వ ల ను చెప్పును. 29—33 స్వరిత స్వరమును గూర్చి చెప్పును. నీ యధ్యాయము ద్విత్వ ప్రకరణమనవచ్చును.

స్వరపూర్వం వ్యజనం ద్వివర్ణం వ్యంజనపరమ్॥

స్వరపూర్వం వ్యజనం వ్యంజనపరం ద్వివర్ణమాపద్యతే। యధా- ం పూర్వ ఇతి కిమ్? తత్. . ఏవం పర ఇతి కిమ్? ఊరు , మ్? ప్ర .. స్వరః పూర్వో యస్మాత్ తత్ స్వర పూర్వమ్। త్పరమితి వ్యంజనపరమ్ ద్వయోర్వర్ణయోస్సమాహారః ద్వి

పూర్వమ్। వ్యంజనమ్। ద్వివర్ణమ్। వ్యంజనపరమ్।

స్వరపూర్వమ్ = స్వరమును పూర్వమందు కల్గినట్టియు, వ్యం ల్లును పరమందు కల్గినట్టి, వ్యంజనమ్=హల్లు, ద్వివర్ణమ్ = మునని భావము.

హల్లు పూర్వ ముందు అచ్చును పరమందు హల్లును కలిగి ఆట్టి హల్లునకు ద్విత్వము వచ్చునని సూత్రార్థము. ఉదా! చట "ప్ర"లోని పకారమునకు ముందు ఉకారము (అచ్చు) ంగ రేఫ కలదు. కనుక ఈ పకారమునకు ద్విత్వము వచ్చును. వధస్వ (ఉరుప్ప్రథస్వ) అని అగును.

ప్రయోజనము సార్థక్యము చూతము: అచ్చును పూర్వమందు కల్గి యుండ "తత్ వ్రివతే (6-4-7-2) అనుచోట వకారమునకు ద్విత్వము రమునకు మాత్రమే ద్విరుక్తి వచ్చును. కాగ "తత్ర్ప్రవతే"

రమందుండ వలెననుటచే "ఉరుకృదురణః (2-6-11-3) అను

స్థలమున "క"కారమునకు ద్విత్వము వారింపబడెను. కకారమునకు పూర్వము అచ్చు (ఊ) ఉన్నను, పరమందు "ఖు" కారము ఉన్నది కద. వ్యంజన మని చెప్పుటచే "ప్రాగమృక్థమ్" అనుచోట ఔకారములో ఊకారమునకు ద్విత్వము రాదు. స్వరపూర్వం అను సమాసమును బహువ్రీహిగ గ్రహించి స్వరః పూర్వమ్ యస్మాత్ అని విగ్రహ వాక్యమును చెప్పుకొనవలెను. అట్లే వ్యంజనపరమ్—అనగ దేనికంటె వ్యంజనము పరముగ నుండునో అది – అని బహువ్రీహి సమాసముగనె విగ్రహ వాక్యమును తెలియవలెను. అనగ ఆ వర్ణము రెండుసార్లు వచ్చుట—అనగ ద్విత్వమని భావము. ఇది సామాన్య సూత్రము. [1]

సూత్రము 2 లవకారపూర్వ స్పర్శశ్చ పౌష్కరసాదేః॥

త్రిభాష్య :– పౌష్కరసాదేర్మతే లకారపూర్వో వకారపూర్వోవా స్పర్శో ద్వివర్ణ మాదవ్యతే। కల్యాణ్ , విభూ. , స్వరపూర్వత్వం ద్విత్వం చాన్వాదిశతి చకారః। స్పర్శ ఇతి కిమ్? కూర్మా. ; తస్మాత్ , లకారశ్చ వకారశ్చ లవ కారౌ తౌ పూర్వౌ యస్మాత్ స తథోక్తః॥

లవకారపూర్వః। స్పర్శః। చ। పౌష్కరసాదేః॥

మణిప్రభ :– ఈ సూత్రమునందు పౌష్కరసాద్యాచార్యుల అభిప్రాయము చెప్పబడినది.

సూత్రమందలి "చ"కారము పూర్వ సూత్రమునుండి స్వరపూర్వః, ద్వి వర్ణమ్ అను పదములను ఈ సూత్రములోనికి అన్వాదేశము చేయును. కాగ "స్వరపూర్వః లకారపూర్వః వకారపూర్వో వా స్పర్శః ద్వివర్ణమాపద్యతే" అని భావము.

స్వరము పూర్వమందుండి, తర్వాత లకారముగాని, వకారముగాని యుండి తర్వాత స్పర్శ వర్ణమున్నచో ఆ స్పర్శ వర్ణమునకు ద్విత్వము వచ్చును. ఇచట స్పర్శవర్ణము తర్వాత వ్యంజనము ఉండవలెనను నియ మము లేదు. అచ్చు యున్నను స్పర్శకు ద్విత్వము వచ్చును అని సూత్ర భావము.

ఉదాహరణలు : కల్ప్వప్సుహోతి (5-4-8-5) ఇచట పకారము స్పర్శ వర్ణము. దీనికి పూర్వమందు లకారము కలదు. దానికంటె పూర్వము స్వరము (అకారము) కలదు. కనుక ఈ పకారమునకు ద్విత్వము వచ్చును. 'కల్ప్ప్వప్సుహోతి' అని అగును. ఇచట 'ప' కారము తర్వాత వ్యంజనము లేకున్నను ద్విత్వము వచ్చినది. అట్లే విభూదావ్నే (3-5-8-1, 3-5-9-2) అను స్థలమున కూడ 'వ' కారమునకు ద్విత్వము వచ్చును. విభూదావ్న్నే (దావ్న్నే).

ఈ సూత్రము స్పర్శ వర్ణములకే అని చెప్పుటచే "కల్యాణీ" అనుచోట య'కారమునకు ద్విత్వము వారింపబడెను. కల్యాణీ రూప సమృద్ధా (7-1-6-6) అట్లే హోతవ్యమ్ దీక్షితస్య అనుచోట కూడ (6-1-4) వకారము కంటె పరముగనున్న యకారమునకు ద్విత్వము నారోపింపబడినది అకారముగాని వకారము గాని పూర్వమందుండవలెనని చెప్పుటచే, "కూశ్మాం చకభిః" (5-7-23) అను స్థలమున 'మ' కారమునకు ద్విత్వము వారింపబడెను. మకారమునకు పూర్వమందు 'శ' కారమున్నది. కాని అకార వకారములలో ఏదియు లేదు కదా. అట్లే "తన్మాదే తత్" (6-3-11-6) అను స్థలమున కూడ 'మ'కారమునకు ద్విత్వము వారింపబడినది. [2]

సూత్రము 3 స్పర్శ ఏవై కేషా మాచార్యాణామ్॥

త్రిభాష్య :- ఏకేషాం మతే లవకారపూర్వ స్పర్శ ఏవ ద్వివర్ణమాప్నోతి. అనేనావధారణేన సూత్రాన్తరారమ్భణేన చ బాష్కలసాదిమతే లవకారయోశ్చ ద్విత్వమస్తీతి గమ్యతే। ఇదమేవ సూత్రమిష్టమ్ న తు పూర్వమ్॥ పూర్వోక్తాన్యేవోదాహరణాని॥

స్పర్శః, ఏవ, ఏకేషామ్, ఆచార్యాణామ్॥

మణిప్రభ : ఈ సూత్రముచే పూర్వ సూత్రము నియమనము చేయబడు చున్నది.

ఏకేషామ్ ఆచార్యాణామ్=కొందరు లాక్షణికులమతమున, స్పర్శః ఏవ= స్పర్శ వర్ణము మాత్రమే (ద్విత్వము బొందును)

పూర్వ సూత్రమునందివ్వబడిన కల్వాన్, దావ్నే అను ఉదాహరణము లలో 1, 2 సూత్రములననుసరించి లకార వకారములకు, వకార నకారములకు కూడ ద్విత్వము వచ్చును. కాగ కల్ల్వ్వాన్, దావ్వ్నే అని అగును. కాని ప్రస్తుతపు ఆచార్యుని మతముననుసరించి, స్పర్శకు పూర్వమందున్న ల, వకా రములకు మాత్రము ద్విత్వము రాదు. కేవలము వకార నకారములకు మాత్రమే ద్విత్వము వచ్చును.

త్రిభాష్య రత్నకారుడగు సోమయార్యుడు పూర్వసూత్రము (2) కంటె ఈ సూత్రమే ఆదరణీయమని చెప్పిరి. అయితే ఈ విధమగు అభిప్రాయ వ్యక్తీకరణకు తగు ఆవశ్యకత లేదు అని మేము భావించుచున్నాము. [3]

సూత్రము 4 రేఫాత్పరం చ॥

త్రిభాష్య:- రేఫాత్పరం వ్యంజనం ద్వివర్ణమాపద్యతే। యథా అర్వ్వ ; అర్క్క ..; ఊర్గ్వ । స్వరపూర్వ ద్విత్వయోరాకర్షకః చకారః। నను వ్యంజన పరత్వాఽకర్షకః కిం న స్యాత్। నేతి బ్రూమః। నియమాఽభావాత్। తథా హి - అవసానే (14-15) ఊష్మస్వర పర (14-16) ఇత్యేతన్నిషేధ ద్వయేన రేఫా త్పరస్య వ్యంజనస్య వ్యంజనపరత్వాఽభావే స్వరపూర్వత్వేఽపి ద్విత్వమస్తీతి నిశ్చీయతే। అప్రసక్త ప్రతిషేధ్యానుపపత్తేః। స్వరపూర్వత్వా న్వాదేశేన కిం? త్ర్యంబక మిత్యాదౌ మా భూదితి। కిం చ "అచోరహాభ్యాంద్వే" (పా 8-4-46) ఇతి పాణినీయసూత్రేణాఽపి స్వరపూర్వత్వే సత్యేవ ద్విత్వం విధీ యతే। తస్యాయమర్థః-అచ ఉత్తరౌ యోరేఫ హకారౌ తాభ్యాముత్తరస్య యరోద్వే భవత ఇతి॥

కేచిదేవమూచుః- స్వరపూర్వాది శబ్దవత్ రేఫ పూర్వమితి వాచ్యే వా చో యుక్త్యస్వరమర్థాన్తరం సమర్థయతి। అహరిత్యాదౌ వైకృతరేఫా దుత్తరస్య న స్యాద్ద్విత్వమ్। ఇతి తదేతదధ్యయన విరుద్ధ పద్ధతిం అధ్యాస్తి। వయం తు వదామో వాచో యుక్త్య స్వర ప్రయోజనమ్-రేఫ పూర్వమిత్యుక్తే విరుద్ధ విగ్రహేణ సూత్రం సందిగ్ధం స్యాత్। రేఫాత్పూర్వం రేఫ పూర్వమితి। భవ త్వేష విగ్రహ ఇతిచేత్ అధ్యాయాది సూత్రేష్వేతద్గతమితి పౌనరుక్త్యమస్య సూత్రస్యాఽపద్యతే। నను పౌనరుక్త్య భయాదేవ విరుద్ధ విగ్రహః

విచారయామః। నేయం సరళావృత్తిః। ప్రక్షాళనాద్ధి పంకస్య దూరాదస్పర్శనం వరమితి న్యాయాత్ అత్ర విరుద్ధ శంకాలేశోఽపి నావకాశం లభతామితి వాచో యుక్త్యన్తరేణ సూత్రమాచార్యః ప్రోవాచ॥

రేఫాత్, పరమ్, చ॥

మణిప్రభ :– రేఫాత్=రేఫకంటె, పరం=పరముగ నున్నదానికి చ=కూడ. ఈ సూత్రమునందలి 'చ'కారము పూర్వ సూత్రముల నుండి స్వర పూర్వత్వ ద్విత్వములను సూత్రములోనికి అన్వాదేశము చేయును. కాగ "స్వర పూర్వాత్ రేఫాత్ పరం వ్యంజనం ద్విత్వమాపద్యతే" అని అగును.

స్వరమును పూర్వమందు కల్గిన రేఫకంటె పరముగ నున్న హల్లునకు ద్విత్వము వచ్చునని సూత్రభావము. ఉదా:– అర్చన్త్యర్కమర్కిణః (1 8-12-3) అనునది అర్చ్చన్త్యర్ క్కమర్ క్కిణః అని చకారమునకు కకారమునకు కూడ ద్విత్వము వచ్చును. అర్క్యేణవై (7-5-9-1)–అర్క్క్యేణవై అని అగును. ఊర్గ్వా అనునది (5-1-10-1) ఊర్గ్గ్వా అని అగును. ఇంతటితో లక్ష్య లక్షణ సమన్వయమయినది.

ఇపుడు సూత్రరచనపై కొంత చర్చ జరుగుచున్నది. సూత్రమందలి 'చ'కారము స్వరపూర్వత్వ ద్విత్వములనన్వాదేశించినట్లే, పూర్వ సూత్రముల నుండి "వ్యంజన పరత్వమును కూడ అన్వాదేశము చేయుదా అని సందేహము. చేయదు ఇచ్చట వ్యంజన పరత్వమును కూడ అన్వాదేశము చేసినచో తర్వాత చెప్పిన "అవసానే (14-15), ఊష్మా స్వరపరః (14-16) అను సూత్రములు వ్యర్థమగును. నిజమున కచట ఈయబడిన ఉదాహరణలలో రేఫకంటె పరమగు వ్యంజనముకంటె వ్యంజనము లేదు. కనుక ద్విత్వ నిషేధమనవసరము. కాని అచట నిషేధము చెప్పబడినది దానిని బట్టి ఇచట వ్యంజన పరత్వమును చకారమన్వాదేశము చేయుదని తెలియుచున్నది అప్రాప్తమగు కార్యమునకు నిషేధమనవసరము కద.

స్వర పూర్వత్వమునన్వాదేశము చేయుటచే "త్ర్యంబకమ్" అనుచోట రేఫకంటె పరమగు 'య'కారమునకు ద్విత్వము వారింపబడెను. ఇచట రేఫకు పూర్వము తకారమున్నది కాని స్వరము లేదు కద. స్వర పూర్వత్వ విషయ

ములో పాణిని సూత్రము "అచోరహాభ్యాం ద్వే" (8-4-46) అనునది కూడ ప్రమాణమే అగును. అచ్చుకంటె పరముగ నున్న రేఫకంటెగాని హకారము కంటెగాని పరముగ నున్న 'యర్' ప్రత్యాహార వర్ణములకు ద్విత్వము వైకల్పికముగ అగునని సూత్ర భావము.

ఇకనిపుడు సూత్రము "రేఫాత్ పరం" అని వ్యస్తముగ నెందుకు చెప్పబడినది. 'స్వర పూర్వం' అని చెప్పినట్లే రేఫ పూర్వమని చెప్పకపోవుటందు గల అంతరార్థమేమి? అను విషయమును సోమయార్యుడిట్లు వివరించుచున్నారు. ఈ విధముగు ఉక్త్యంతరముచే కృతకరేఫకంటె పరమగు వ్యంజనమునకు ద్విత్వము రాదని సూచింపబడెను. కృతకరేఫ అనగ సహజముగు రేఫగాక, విసర్గకాని, సకారముగాని రేఫగ మారుటచే వచ్చినది కనుకనే "...హర్దివానాం" (1-5-9-2) అనుచోట రేఫకంటె పరమగు దకారమునకు ద్విత్వము వారింపబడుచున్నదని కొందరాచార్యులు చెప్పిరట. అది త్రిభాష్యకారునికి అంగీకారము కాదయ్యెను. ఆయన మతములో స్పష్ట ప్రతిపత్తి కొరకే ఈ విధముగు ఉక్త్యంతర ప్రయోగము చేయబడెనట "రేఫ పూర్వం" అని చెప్పినచో రేఫాత్ పూర్వం అను పంచమీ తత్పురుషయా లేక రేఫః పూర్వం యస్మాదసౌ అని బహువ్రీహిగ అర్థము చెప్పుకొనవలెనా అని సందేహము కల్గును కనుక సందేహలేశము కూడ యుండరాదని స్పష్టముగ చెప్పిరట. కాని త్రిభాష్య రత్నకారుని వాదన పేలవముగ నున్నది.

సూత్రము 5 ద్వితీయ చతుర్థయోస్తు, వ్యంజనోత్తరయోః పూర్వః॥

త్రిభాష్య.— ద్వితీయ చతుర్థయోః స్వర పూర్వయోః వ్యంజనోత్తరయోః పూర్వాగమో భవతి। యథాక్రమేణ ద్వితీయస్య ప్రథమః, చతుర్థస్య తృతీయః॥ యథా— విఖ్య , మేఘ్యా ; తత్సవితుః ...; సాధ్యా. ॥ ద్వితీయ చతుర్థయోరితి కిమ్? అద్య , ఏవం పూర్వ ఇతి కిమ్? వషట్ ; వవ్రాజ.. ॥ ఏవం పరయోరితి కిమ్? శాఖా , మేఘా . , ప్రథమసూత్రేణ ప్రసక్తం ద్విత్వం నివర్తయతి 'తు' శబ్దః। అన్యే త్వన్యథా మన్యన్తే। పూర్వాగమస్య ద్విత్వం నివర్తయతీతి। నైతత్సారమ్। సవర్ణ సవర్గీయ పర (14-23) ఇత్యుత్తర నిషేధాదేవ తస్య తన్నివృత్తిః॥

అత్ర శిక్షాకారైః వ్యంజన పరయోః అపి వాచ్యే వాచో యుక్త్యన్తర పర్యాస్తరం సూచయతి। ... హిత ... ంహితా స ధారణం . రణమిత్తము క్తమ్। తత ఇహాన్వ్యతరస్యాం గమనిమిత్తత్వే ప్రాప్తే సాంహితా పదానాం నిత్యం ... ద్గ్రహణమేవ న్యాయ్యమ్। ఇతి కృత్వా పైకృత వ్యంజన పరత్వే సతి ... ద్విధానం భవతి। యథా అభ్యస్తాదిత్యాది॥ నాయం పక్షః। అధ్యయన విరోధాన్మూల సూత్రవిరోధాచ్చ। తథాహి మూలసూత్రే స్వర పూర్వత్వే వ్యంజనపరత్వే చ సతి విహితం ద్విత్వమత్ర నిష్పాద్యతే। నతు తత్ర వ్యం జనం విశేషితమ్। తదపవాదక తాః ద త్రాఽపి తద్విశేషో వక్తుమయుక్తః। శిక్షాది పరీక్షణాత్, అధ్యయనానురోధాచ్చ వాచో యుక్త్యన్తరాభిప్రాయోఽ స్మాభిరభిధీయతే। అపవాద్యాఽపవాదకయోః రనయోః నియమోనాస్తి। కిమితి? స్వర పూర్వత్వే సతి వ్యంజనపరమేవ వ్యంజనం ద్విత్వం భజతే। ద్వితీయ చతుర్థౌ చ వ్యంజన పరావేవ పూర్వాగమం భజత ఇతి। కింతు ప్రాచుర్యాభిప్రాయేణేదం సూత్రద్వయం ప్రవృత్తమ్। కథం నియమాఽ భావః। అన్యథా కుత్రచిత్ కార్యద్వయ దర్శనాత్। అక్తా. . అన్నవత ఇత్యాదౌ ద్విత్వమ్। ప్ర , అద్ధి ; ఇత్యాదౌ పూర్వాగమః। తా ; హ స్త ఇత్యత్ర తు ప్రాప్తం సత్యామపి నేదం కార్యం దృశ్యత ఇతి చ నియమా భావః। శిక్షాచైవం వక్ష్యతి—"

స్వరాత్పూర్వస్య వర్ణస్య క్వచిద్ద్విత్వం చ కథ్యతే।
న చ వర్ణ ద్వితీయస్య న చతుర్థే కదాచన॥

వ్యాఖ్యాతం చ వచనమే తద్విద్వద్భిః— "కుత్రచిత్ స్వరయోర్మధ్యే ద్విత్వం లక్ష్యానుసారతః పూర్వాగమస్తథా తత్రజ్ఞేయో వర్ణవిచక్షణైః।" ఏవం రూపమనియమం సూచయితుం వ్యంజనోత్తరో యోరిత్యన్తర స్వీకారః। వ్యంజనముత్తరం యాభ్యాం తౌ వ్యంజనోత్తరౌ। తయోః॥

ద్వితీయ చతుర్థయోః। తు। వ్యంజనోత్తరయోః। పూర్వః॥

మణిప్రభ :- పూర్వ సూత్రమునుండి ఈ సూత్రములోనికి స్వర పూర్వత్వ ము న్వాదేశము వచ్చును. కాగ స్వరమును పూర్వమందు కల్గినట్టి ద్వితీయ చతుర్థయోః=వర్గయందలి రెండవ నాల్గవ అక్షరమునకు క్రమముగ వానికి పూర్వః = పూర్వమందుండెడి వర్ణము, అనగ రెండవ వర్ణమునకు ప్రథమ

వర్ణము, చతుర్థ వర్ణమునకు తృతీయవర్ణము ఆగమముగ వచ్చును. అయితే ద్వితీయ చతుర్థ వర్ణములకంటె వ్యంజనము పరముగ నుండవలెను.

ఉదాహరణలు: విఖ్యాయ చక్షుషా (4-1-2-3) ఇచట ఖకారమునకు ముందుగ 'క' కారమాగమముగ వచ్చును. కాగ విక్ఖ్యాయ అని అగును. అగ్నే మేఘ్యా విద్యుతో (1-2-11-1) (మేగ్ఘ్యా.) తత్సవితుః ఇచట 14-12వ సూత్రముచే సకారమునకు పూర్వమందున్న తకారము థకారముగ మారును. తథ్సవితుః అపుడీ సూత్రముచే థకారమునకు పూర్వము తకారాగమము వచ్చును. తత్థ్సవితుః సాధ్యా (సాద్ధ్యా); (6-3-4-8) సూత్రమున, ద్వితీయ చతుర్థ వర్ణములకే అని చెప్పుటచే 'ఆద్యమ్' అను చోట పూర్వాగమము వారింపబడినది. స్వరపూర్వత్వమును చెప్పుటచే "వషట్ స్వాహా" అనుచోట 5-13 సూత్రముచే వచ్చు తకారము, 14-12వ సూత్రముచే థకారముగ మారినను, దీనికి పూర్వమందు 'ట'కారముండుటచే స్వరము లేకపోవుటచే, థకారమునకు పూర్వము తకారాగమము వారింపబడినది. అట్లే 'పడ్ఖ్యాం' అనుచోట ఖకారాగమము వారింపబడెను. సూత్రమున వ్యంజన పరత్వము చెప్పుటచే, మేఘాయతే స్వాహా (7-5-1-11) అనుచోట ఘకారమునకు పూర్వము 'గ'కారాగమము వారింపబడినది

ఇక సూత్రమునందలి "తు" శబ్దము ఇచట వ్యంజనమునకు 1వ సూత్రముచే వచ్చు ద్విత్వమును వారించును. ఈ 'తు' శబ్ద ప్రయోజనము గూర్చి కొంత అభిప్రాయ భేదము కలదు. కొందరి మతమునను సరించి, ఈ 'తు' శబ్దము ఈ సూత్రముచే ఆగమముగ వచ్చుచున్న ప్రథమ, తృతీయ వర్ణములకు ప్రథమ సూత్రముచే వచ్చు ద్విత్వమును వారించును. అయితే ఈ అభిప్రాయము సరికాదు. ఆగమములుగ వచ్చు వర్ణములకు చెప్పబోవు "సవర్ణ సవర్గీయ. (14-13) అను సూత్రముచే ద్విత్వము వారింపబడుచున్నది. కనుక 'తు' శబ్దము ద్వితీయ చతుర్థ వర్ణములకు, 1వ సూత్రముచే వచ్చు ద్విత్వమునే వారించును. ఇంతటితో లక్ష్య లక్షణ సమన్వయము పూర్తియైనది.

ఇక సూత్రమందు, వ్యంజన పరయోః అని కాక ఉత్తరయోః అని విశేష పద ప్రయోగంచే కల్గు ప్రయోజనము గూర్చి వివరించుచున్నారు

కొందరి మతము ప్రకారము ద్వితీయ, చతుర్థ వర్ణములకంటె పరముగనున్న వ్యంజనము కృతకము (సంధిజము) కారాదు. ఉదాహరణకు 'అభ్యస్థాత్' అనుచోట అభి + అస్థాత్ యణాదేశము చేయగ 'య' కారము వచ్చినది. కనుక ఈ విధమగు కృతక వ్యంజనము పరమందున్నచో ద్వితీయ చతుర్థ వర్ణములకు ప్రథమ తృతీయ వర్ణములాగమముగ రావని తెల్పుటకై 'ఉత్తరయోః' అను యుక్త్యంతరమును ప్రయోగించిరి.

అయితే త్రిభాష్య రత్నకారుడీ వాదన నంగీకరించడు. పై వాదన అధ్యయన విరోధము, మూలసూత్ర విరుద్ధము. పూర్వ సూత్రమందు (1) వ్యంజనమునకు విశేషణములేవియును లేవు. అట్టిచో ఇపుడిచట విశేషణము విధించుట యందు ఔచిత్యము లేదు. మరియు 1వ సూత్రము, 5వ సూత్రము పరస్పరము స్వతంత్రములని చెప్పుటకు మాత్రమే 'ఉత్తరయోః' అను యుక్త్యంతరము ప్రయోగింపబడెను. ఈ విషయమును స్వరాత్పూర్వస్య వర్ణస్య క్వచిద్ద్విత్వం చ కథ్యతే। న చ వర్గ ద్వితీయస్య న చతుర్థే కదాచన॥ — అని శిక్షాగ్రంథములు కూడ ధ్రువీకరించుచున్నవి. [5]

సూత్రము 6 రేఫ పూర్వయోశ్చ నిత్యమ్॥

త్రిభాష్య:– రేఫాత్పరంచ (14–4) ఇత్యస్యాపవాదకమేతత్। ద్వివచనేన ద్వితీయ చతుర్థౌ గృహ్యేతే। స విశేషణయో రేఫ పూర్వయో రనయోర్నిత్యం పూర్వాగమో భవతి। ఆగమాన్వాదేశకశ్చకారః॥ యథా, ఊర్ధ్వ ; అర్ఘ్య .. ; నిత్యమితి కిమ్? స్వరపరత్వేఽపి భవత్వేతదితి। అర్ధై , మూర్ఖా . ; గోఽర్ఘమ్॥

రేఫ పూర్వయోః। చ। నిత్యమ్॥

వివృతి :– ఈ సూత్రము నాల్గవ (14–4) సూత్రమున కపవాదము. ఇందలి 'చ' కారము పూర్వ సూత్రమునుండి ప్రథమ, తృతీయ వర్ణముల ఆగమమును ఈ సూత్రములోని కన్వాదేశము చేయును. రేఫ పూర్వయోః అను ద్వివచనముచే సాన్నిధ్య బలమువలన ద్వితీయ చతుర్థ వర్ణములు గ్రహింపబడును. పూర్వ సూత్రము నుండి స్వర పూర్వత్వము కూడ ఈ

నిఖా । దత్స్వధి ॥ ఉపసర్గ ఇతికిమ్? వ. । ఏతాన్యుపసర్గ పూర్వాణి। అన్వాన్యుచ్యన్తే। పిప్లు . । పాధ ఇతికిమ్? ఋతుభి ..। అతి. । సవిత్రి ..। ధామ .। పరమ ..। యద్ ..॥

ఉపసర్గ పాధ ఏషోఽత్యాతిధామ పరమభూతే పూర్వేషు।
చ ఖి భుజేషు। చ॥

మణిప్రభ : ఈ సూత్రమందలి "చ" పూర్వ సూత్రముల నుండి "పూర్వాగమః" అనుదానిని అన్వాదేశము చేయును. కాగ "ఉపసర్గను పూర్వమందు కల్గిన ఛ, ఖి; భుజ — అనువానికి పూర్వాగమము వచ్చును. అట్లే పాధ ఏషః, అతి, ఆతి, ధామ, పరమ, భూతే అనువానికంటె పరముగ నున్న ఛ, ఖి, భుజ వీనికి పూర్వాగమము వచ్చును." ఉదాహరణలు :

ఉపసర్గతో 1 అఛృణత్తి (అచ్ఛృణత్తి 5-1-7-4)
2 సమ అఖిదతే (... అక్ ఖిదతే 4-5-9-2)
3 ఆయుక్ష్మయా పరిభుజౌ ( పరిబ్భుజౌ 4-5 1-4)

సూత్రమందు 'భు' అనిగాక "భుజ" అని చెప్పుటచే విభు (చమే) ప్రభు (చమే) అనుచోట్ల "భ" వర్ణమునకు పూర్వాగమము వారింపబడినది.

'పి' అను ఉపసర్గతో — యాచవిచ్ఛందాః (5-2-11-1). సూత్రమందు "ఖ" అనిన చాలదా? 'ఖి' అని ఎందుకు? 'ఖి' అని చెప్పుటచే "నిఖాతాం మనుష్యాణాం" అనుచోట "ఖ" కు పూర్వాగమము వారింపబడినది. అట్లే దత్స్వధి ఖాదతి" అను స్థలమున కూడ ఖ-కు పూర్వాగమము వారింపబడెను.

సూత్రమందు "ఉపసర్గకంటె పరముగ నున్న" అని చెప్పుటచే స్ఛందా యా (.-2-11-1) అనుచోట ఛ-కు పూర్వాగమము వారింపబడెను. ఇకనిపుడు పాధఏ. మొదలగు పదములకు ఉదాహరణలు.

పాధ ఏషః — అప్యేతు పాధఏష చ్ఛాగః (4-6-8-1) ఏషకు పూర్వమందు పాధ అని చెప్పనిచో, ఋతుభిర్హ్యేష ఛందోభిః (7-5-15-2) అనుచోట ఛ-కు పూర్వాగమము ప్రసక్తమగును. కనుక దానిని వారించుటకు పాధ ఏషః అని చెప్పబడినది.

అతి — అతి చ్ఛందస ముపదధాతి (5-3-8-3).
అతి — సవిత్ర అతి చ్ఛందసాయ (7-5-14).
ధామ — ధామ చ్ఛ దివ ఖలుపై (2-4-10-2)
పరమ — పరమ చ్ఛదో వరే (4-6-2-1)
భూతే — యద్ భూతే చ్ఛదా ౦ సామాని (7-5-9-4) [8]

సూత్రము 9 అఘోషాదూష్మణః పరః ప్రథమోఽభినిధాన స్పర్శ పరాత్తస్య సస్థానః॥

త్రిభాష్య :- స్పర్శ పరాదఘోషా దూష్మణః పరః ప్రథమ ఆగమ స్తస్య స్పర్శస్య సస్థానః సమానస్థానోఽభి నిధానో భవతి। అభినిధీయత ఇత్యభి నిధానః। ఆరోపణీయ ఇత్యర్థః। వేదాన్తరే తస్యాఽభావాత్ అత్రారోపణీయ త్వమ్॥ యథా : యః ; అశ్మ , గ్రీష్మే . , అయస్మ ; యః . ॥ అఘోషాదితి కిమ్? శర ; ఊష్మణ ఇతికిమ్? రుక్మమ్ .। స్పర్శ పరాదితి కిమ్? తస్యై । సూత్రమిదమేవేష్టమ్। నతత్పర ద్వయమ్॥

అఘోషాత్। ఊష్మణః। పరః। ప్రథమః। అభినిధానః। స్పర్శపరాత్। తస్య। సస్థానః॥

మణివ్రత :- అఘోషయగు ఊష్మవర్ణము కంటె పరమగు స్పర్శ వర్ణము నకు, పూర్వమందు సస్థానీయ ప్రథమవర్ణము అభినిధానముగ నుంచబడును- అని సూత్ర భావము.

అఘోషలగు ఊష్మవర్ణములు శ, ష, స, జిహ్వామూలీయ ఉపధ్మానీయములు. వీనికంటె పరముగ నుండు స్పర్శవర్ణము (ఐదు వర్ణములలోని అక్షరము) నకు పూర్వమందు సస్థాన-సమాన స్థానము గల అనగ ఆ వర్గ యొక్క, ప్రథమః = ప్రథమ వర్ణము అభినిధానమగును. అభినిధానమనగ ఆరోపణీయమని భావము. మామూలు ధోరణిలో చెప్పాలంటె ఆగమముగ వచ్చునని అర్థము. ఉదాహరణలు : —

1 యః కామయేత (యఃక్కామయేత) (2-1-2-3)
2 అశ్మన్నూర్జమ్ (అశ్శ్ప్ప్ మన్నూర్జమ్) (4-6-11)

3 గ్రీష్మే (గ్రీష్మే మధ్యం దినే) (2-1-2-5)
4 అయస్మయమ్ — (అయస్మయమ్) (4-2-5-3)

అఘోష అని చెప్పుటచే, ఘోష, ఊష్మయగు హకారముకంటె
మగు స్పర్శ వర్ణములకు అభినిధానము లేదు. ఉదా :- శరద్వరా
ఇచట హకారము కంటె పరమగు దకారమున కభినిధానముండదు. ఉ
అని చెప్పుటచే 'రుక్మముప దధాతి' (5-2-7-1) అను స్థలమున 'క' అ
యైనను ఊష్మవర్ణము కాకపోవుటచే, తర్వాతనున్న "మ"-కు అభినిధ
వారింపబడెను.

"స్పర్శపరాత్" అని చెప్పుటచే "ఇష్వా చ వజ్రేణ చ" (ఓ-ా-
షకారముకంటె స్పర్శగాని 'వ'కారముండుటచే అచట అభినిధానము వ
బడెను. ఈ విధముగ లక్ష్య లక్షణ సమన్వయము, దళసార్థక్యము
పించబడెను.

ఇక సూత్రమందు ప్రథమ వర్ణము "అగమము" అని చెప్పక,
నిధానమని ప్రత్యేక సంజ్ఞ విధించి చెప్పుటచే, ఈ వర్ణము సామాన్య
అగమము కాక, ప్రత్యేకమగు గూఢోచ్చారణ కల్గియుండునని గ్రహించవ

ఈ సూత్రము దృష్ట్యా తర్వాత చెప్పబోవు 10, 11 (రెండు)
ములు ఆమోద యోగ్యములు కావని త్రిభాష్య రత్నకారులు చెప్పిరి.

సూత్రము 10 అఘోషే ప్లాక్షేః॥

**త్రిభాష్య :-** అఘోష ఏవ స్పర్శపరే సతి అఘోషా దూష్మణః పరః
మాగమో భవతీతి ప్లాక్షేః పక్షః। యథా — నిష్ ; యః , పశ్చా
నిష్. ; దోషా , యః ; అస్ , అఘోషేతి కిమ్? కూశ్మాన్...

అఘోషే। ప్లాక్షేః॥

**మణిప్రభ :-** ఈ సూత్రమందు, మత భేదమును చెప్పుచున్నారు. "ప్లా
అను ఆచార్యుని మతమునను సరించి "అఘోషయగు ఊష్మ కంటె అ
అగు స్పర్శ వర్ణము పరమగునపుడే ఆ స్పర్శ వర్ణము యొక్క సస్థా

ప్రథమ వర్ణము అభినిధానముగ వచ్చును పూర్వ సూత్రమందు అఘోష ఊష్మకంటె ఏ స్పర్శ వర్ణమున్నను సస్థానీయ ప్రథమ వర్ణము అభినిధానముగ వచ్చును-అని చెప్పబడెను. కాని ప్లాక్షి మతమున ననుసరించి అఘోషయగు స్పర్శవర్ణమే యుండవలెను. ఉదాహరణలు:

| | | | |
|---|---|---|---|
| 1 | యః కామయతే — | యఃక్కామయతే (యఃక్కా )। | (2-1-2-3) |
| 2 | పశ్చాత్ ప్రాచీమ్ — | పశ్చ్చాత్ ప్రాచీమ్ (పశ్చ్చా....)। | (5-3-7-3) |
| 3 | నిష్టపామి — | నిశ్తపామి—నిషిణ్టపామి। | (1-1-10-1) |
| 4 | దోషావస్తః — | దోషావస్త్ తః....। | (1-2-14-4) |
| 5 | యః పాప్మనా— | యఃప్ పాప్మనా....। | (2-1-13-2) |
| 6 | అప్సాత్రమ్ — | అప్ప్ పాత్రమ్....। | (2-5-9-3) |
| 7 | నిష్కేవల్యమ్ — | నిష్క్ కేవల్యమ్ ..। | (4-4-2-2) |

సూత్రము నందు "అఘోష స్పర్శ" అని చెప్పుటచే "కూశ్మాన్" (5-7-23) అనుచోట శకారము అఘోషయగు ఊష్మవర్ణమైనను 'మ'కారము అఘోషస్పర్శ కానందున అచట అభినిధానము వారింపబడినది. [10]

సూత్రము 11 ఉత్తమపరాత్తు ప్లాక్షాయణస్య

త్రిభాష్య:- ప్లాక్షాయణస్య తు పక్షే ఉత్తమ పరాదఘోషా దూష్మణ పరః ప్రథమాగమో భవతి। యథా— అక్ష్ణయా వ్యాఘారయతి; అశ్నాతి శ్రే.... ఉత్తమపరాదితికిమ్? నిష్...., యః కా ...; యః పా....; పశ్చాత్ తు శబ్దః ప్లాక్షేః పక్షం ప్రక్షిపతి॥

కేచిదేవమూచుః। అఘోషత్వమూష్మణః తు శబ్దో నివారయతి। తత్ర యం సూత్రార్థః। ఉత్తమపరాత్ ఘోషవతః ఊష్మణః పరః ప్రథమాగమో భవతి। యథా— అహ్నాం... , శరద్య.. , బ్రహ్మ.. , ఘోషవతః కిమ్? గ్రీష్...., అశ్ ..., అయ....॥

ఉత్తమపరాత్। తు। ప్లాక్షాయణస్య

మణిప్రభ:- ఈ సూత్రమందు ఆచార్య ప్లాక్షాయణుని అభిప్రాయమును చెప్పుచున్నారు. ఇతని మతము ననుసరించి అఘోషయగు ఊష్మ వర్ణమ

కంటె ఉత్తమ వర్ణము అనగ వర్గయొక్క పంచమాక్షరము పరముగ నున్న
ప్పుడే ఆ వర్గయొక్క ప్రథమ వర్ణమునకు సస్థానీయము అభినిధానముగ
వచ్చును. ఉదాహరణలు: 1 అక్ష్ట్ణయా వ్యాఘారయతి (5-2-7-5).
"అక్ష్ణయా" అను స్థలమున షకారము తర్వాత ణకారము (టవర్గ పంచమాక్ష
రము) ఉండుటచే ష, ణలకు మధ్య టకారము అభినిధానముగ వచ్చెను. ఇట్లే
2 అశ్నాతి — అశ్క్నాతి 1-6-4-3
3 తీర్థేస్నాతి — తీర్థే స్ త్ నాతి 6-1-1-2.

సూత్రమందు "ఉత్తమపరాత్" అని చెప్పుటచేతనే ప్లాక్షాయణమతాను
సారము ఈ క్రింది స్థలములలో అభినిధాన వ్యవస్థ వారింపబడినది. 1 నిష్కే
వల్యమ్ 2 యః కామయేత। పశ్చాత్॥ ఇక సూత్రమందలి "తు" శబ్దము
పూర్వము చెప్పిన ప్లాక్షి మతమును నిరసించును. ఈ విధముగ కొందరు
వ్యాఖ్యానించగ మరికొందరు ఈ క్రింది విధముగ పై సూత్రమును వివరించు
చున్నారు. సూత్రమందలి "తు" శబ్దము ఊష్మలకఘోషత్వమును వారిం
చును. అనగ ఘోషవత్తుయగు ఊష్మను (హ) చెప్పును. అపుడు "ఘోష
వత్తగు ఊష్మవర్ణముకంటె వర్గ పంచమ వర్ణము పరమైనచో, దాని సస్థానీయ
ప్రథమ వర్ణము అభినిధానముగ వచ్చును." అని సూత్రార్థమగును.

అనగ పూర్వమందు చెప్పిన సూత్రద్వయము (9, 10) తిరస్కరించ
బడినది. ఈ విధమగు వివరణకు ఉదాహరణలు:
అహ్నాం కేతుః — అహ్ త్ నాం కేతుః (2-4-14-1)
శరద్యపరాహ్ణే — శరద్య పరాహ్ ట్ ణే (2-1-2-5)

సూత్రమందు ఘోషవత్తుయగు "ఊష్మ" అని వివరించినచో ఈ క్రింది
స్థలములలో సవర్గీయ ప్రథమవర్ణ అభినిధానముండదు. గ్రీష్మే హేమంతః।
ఇచట మకారము ఉత్తమ వర్ణమైనను షకారము అఘోష అగుటచే నచట
మకార సస్థానీయ ప్రథమవర్ణాభి నిధానము రాలేదు. ఇట్లే "అశ్మా చ మే"
(4-7-5-1); అయస్మయం. . విచృత (4-2-5-3) అను స్థలములందు అభి
నిధానములు వారింపబడినవి.

సూత్రము 12 ప్రథమ ఊష్మపరో ద్వితీయమ్॥

త్రిభాష్యః– ఊష్మపరః ప్రథమస్పర్శః సవర్గీయం ద్విత్వ మాపద్యతే।

విన్. ; తత్ ...; ప్రతి.. ; తత్। ప్రథమ ఇతికిమ్॰ తాః. . ; ఊష్మపర ఇతి కిమ్? వాక్ ; అర్వా .. ఇత్యత్ర "ప్రథమపూర్వో హకారశ్చతుర్థం తస్య సస్థానం" (5-38) ఇతి హకారస్య చతుర్థావత్తిః, విశేష విహితత్వాత్। తతః తృతీయః "స్వర ఘోషవత్పరః" (8-3) తృతీయత్వమ్। ఇదమేవ సూత్రమిష్టమ్। ఊష్మపరో యస్మాత్ అసౌ వూష్మ పరః॥

ప్రథమః। ఊష్మపరః। ద్వితీయమ్॥

మణిప్రభ :– "ఊష్మ వర్ణమును పరముగ గల్గిన వర్గ ప్రథమాక్షరమునకు, ఆ వర్గయొక్క ద్వితీయ వర్ణము అగమముగ వచ్చును"— అని సూత్రార్థము.

ఉదాహరణలు :–

1 విరప్ శన్మదాదాయ — విరప్ఫ్ శన్మదాదాయ (1-1-9-3)
2 తత్షోడశీ — తత్థ్ షోడశీ (6-6-11-1)
3 ప్రత్యజ్ సోమః — ప్రత్యజ్ ఖ్ సోమః (1-8-21)
4 తత్సవితుః — తత్థ్ సవితుః (1-5-6-4)

సూత్రమందు ప్రథమ వర్ణమనుటచేతనే "తాః స రోహః" అను చోట ద్వితీయ వర్ణము వారింపబడెను. అట్లే ఊష్మపరః అనుటచే "వాక్ తే" అనుటచే 'క' కు ద్వితీయ వర్ణము వారింపబడెను. ఊష్మ పరము అనగ ఊష్మను పరమందు కల్గియుండుట.

సూత్రము 13 బాడబీకరస్య అసస్థానపరః॥

త్రిభాష్య :– బాడబీకరస్య మతే ఆత్మనోఽసస్థానోష్మ పరః ప్రథమః సవర్గీయం ద్వితీయ మాపద్యతే। సమానం స్థానం యస్య అసౌ సస్థానః। న సస్థానః। అసస్థానః। సః పరః యస్మాత్సః తథోక్తః। యథా— విస్ఫబో విరప్ ఫూశిన్। తథ్షోడశీ। అసస్థాన ఇతికిమ్? తత్సవితుః। నేదం సూత్రమిష్టమ్॥

బాడబీకరస్య। అసస్థాన పరః॥

మణిప్రభ :– ఈ సూత్రమున పూర్వ సూత్రము కంటె వైవిధ్యమున్నది.

ఈ సూత్రములో పరముగ ప్రథమ వర్ణము కంటె పరముగ ఊష్మ ర్ణముండవలెను. అయితే ఆ ఊష్మ వర్ణము ప్రథమవర్ణ సస్థానీయము వక్కరలేదు. కాని బాడబీకారుని మతములో ప్రథమ వర్ణము ఏ వర్గకు ందునో ఊష్మ వర్ణము ఆ వర్గకు చెందరాదు. అట్లైననే ఆ ప్రథమ వర్ణము స్థానీయ ద్వితీయ వర్ణముగ మారును. ఉదాహరణకు– విస్ఫృటో విరఫ్శిన్ ను చోట పకారముకంటె శకారము (ఊష్మ) ఉన్నది. ఇవి రెండును భిన్న స్థములకు చెందినవి కనుకనే పకారమునకు 'ఫ' కారము ఆదేశముగ వచ్చి ది. ఇట్లే తత్ షోడశీ— తథ్ షోడశీ అగును. సూత్రమందు అనస్థాన ని చెప్పుటచేతనే "తత్సవితుః" 1-5 6-4 అను చోట "త" కు థత్వము 'రింపబడెను. తకార సకారములు ఒకే వర్గకు చెందినవి కద. సస్థానమనగ కే ఉచ్చారణ స్థానము కల్గియుండుట సస్థానము కానిది అసస్థానము.

అయితే త్రిభాష్యరత్నకారులీ సూత్రమును తిరస్కరించిరి.

ూత్రము 4 అథ న॥

త్రిభాష్య :– "అథ" ఇత్యయమధికారః। ఉక్తస్య ద్విత్వవిధేః యథాసంభ ం నిషేధోఽధి క్రియతే ఇతివేదితవ్యమ్। ఇత ఉత్తరం యద్వక్ష్యామః॥

అథ। న॥

ుణివ్రిత.- ఈ సూత్రము అధికార సూత్రము. ఇంతవరకు ఊష్మను రముగ గల్గిన ప్రథమ వర్ణములకు ద్విత్వములుపదేశింపబడినవి. అయితే ద్విత్వ విధానము కొన్ని స్థలములందు నిషేధించబడినది. అట్టివానిని పుడు చెప్పుచున్నారు. కనుక ఆ సూత్రములలోనికి నిషేధవాచకమగు న" అనునది అధికారవాచిగ అన్వాదేశమగును.

ూత్రము 5 అపసానే ర – విసర్జనీయ జిహ్వామూలీయోపధ్మా నీయాః॥

త్రిభాష్య :– పదావసానే వర్తమానో పర్ణోరేఫో విసర్జనీయో జిహ్వామూలీయ ఉపధ్మానీయశ్చ ఇత్యేతే వర్ణాః ద్విత్వం నాపద్యన్తే। యథా— ఉర్క్।

రేఫాత్పరంచ (14-4) ఇతి ప్రాప్తిః। అవసాన వచనం విరామాభిప్రాయమ్ తస్మాన్న సంధానే నిషేధః। యథా— ఊర్క్ కచ...। నాత్రిమార్చ్ఛతి మనఃక్ష్కిమే। యఃకామయేత। యఃపాప్మ్మనా। స్వరపూర్వమ్ (14-1 ఇత్యనేనైవ ప్రాప్తిః। అవసాన ఇతి చతుర్వర్ణం పృథగేవ సూత్రం కేచి దూచుః। ఏకీకరణే దోష దర్శనాత్। కోఽసౌ దోషః? అవసానే వర్తమాన ర విసర్జనీయాదయ ఇత్యన్వయ సంపాదనం "అవగ్రహ (5 10) ఇతి పదిః చేత్; నైషదోషః। ర విసర్జనీయాదీనాం పదావసానే ద్విత్వప్రాప్తిః దూరోత్సా రితా ఇతి నేయమత్ర శంకా। కించ పృథక్కరణే సతి అవసానే కిం వా భ తీతి సాకాంక్షతయా వచనమనర్థకం స్యాత్। ఏకీకరణే తు రవిసర్జనీయ ఇతి వర్ణసాహచర్యా దవసానే వర్తమానో వర్ణ ఇతి చ లభ్యతే। తస్మాదేకీకరణమే రమణీయమ్॥

అవసానే। రవిసర్జనీయజిహ్వామూలీయోపధ్మానీయాః॥

మణిప్రభ :- పూర్వసూత్రమునుండి "ద్విత్వము లేదు" అనునది (న) ఈ సూత్రములోనికి వర్తించును. కాగ— "పదాన్తమందున్న వర్ణమునకు రేఫ, విసర్గ, జిహ్వామూలీయము, ఉపధ్మానీయము- వీనికి ద్విత్వము లేదు' అని సూత్రార్థము. సూత్రమందలి 'అవసాన' శబ్దముచే వ్యస్త పదమునే గ్రహించవలెను. వాక్యమందు సంధత్తమగు స్థలమున ఈ సూత్రము వర్తించదని గ్రహించవలెను. కనుకనే విరామ చిహ్నమును కల్గిన "ఊర్క్" అను పదమునందలి కకారమునకు ద్విత్వము నిషేధించబడినది. ఊర్క్ అని వాక్యమందు సంధత్తమగుచోట్ల 'ఊర్క్చమే' అనుదగ్గిర 'ఊర్క్కచ' అని ద్విత్వము వచ్చినది. ఇట్లే నాత్రిమార్చ్ఛతి (2-2-4) మనఃక్ష్కిమే (5-2-1) యఃకామయేత (2-1-2) యఃపాప్మ్మనా (2-3-13) అను స్థలము లందు ద్విత్వము 'స్వరపూర్వమ్' (14-1) అను సూత్రముచే ప్రవర్తించినది. ఇది త్రిభాష్యరత్నకారుని వివరణము.

అత గార్గ్య గోపాలయజ్వ ఈ సూత్రమును— "అవసానమందున్న వ్యంజనమునకు ద్విత్వముండదు. రేఫ విసర్జనీయజిహ్వామూలీయో పధ్మానీయములకెచటను ద్విత్వముండదు." అని చెప్పెను. [అవసానే వర్తమానా రేఫాదయః ఇత్యన్వయో నోపపద్యతే। విసర్జనీయ వ్యతిరిక్తానాం తత్రాఽ

ంటె ఉత్తమ వర్ణము అనగ వర్గయొక్క పంచమాక్షరము పరముగ నున్న
ప్పుడే ఆ వర్గయొక్క ప్రథమ వర్ణమునకు సస్థానీయము అభినిధానముగ
చ్చును. ఉదాహరణలు: 1 అక్ష్ట్ణయా వ్యాఘారయతి (5-2-7-5)
'అక్ష్ణయా" అను స్థలమున షకారము తర్వాత ణకారము (టవర్గ పంచమాక్ష
రము) ఉండుటచే ష, ణలకు మధ్య టకారము అభినిధానముగ వచ్చెను. ఇట్లే
అశ్నాతి — అశ్క్నాతి 1-6-4-3
తీర్థేస్నాతి — తీర్థే స్ త్ నాతి 6-1-1-2.

సూత్రమందు "ఉత్తమపరాత్" అని చెప్పుటచేతనే ప్లాక్షాయణమతాన
కారము ఈ క్రింది స్థలములలో అభినిధాన వ్యవస్థ వారింపబడినది. 1 నిష్కె
ల్యమ్ 2 యః కామయేత। పశ్చాత్॥ ఇక సూత్రమందలి "తు" శబ్దము
గ్యార్యము చెప్పిన ప్లాక్షి మతమును నిరసించును. ఈ విధముగ కొందర
వ్యాఖ్యానించగ మరికొందరు ఈ క్రింది విధముగ పై సూత్రమును వివరించు
చున్నారు. సూత్రమందలి "తు" శబ్దము ఊష్మలకఘోషత్వమును వారిం
చును. అనగ ఘోషవత్తుయగు ఊష్మను (హ) చెప్పును. అపుడు "ఘోష
త్తగు ఊష్మవర్ణముకంటె వర్గ పంచమ వర్ణము పరమైననే, దాని సస్థానీయ
ప్రథమ వర్ణము అభినిధానముగ వచ్చును." అని సూత్రార్థమగును.

అనగ పూర్వమందు చెప్పిన సూత్రద్వయము (9, 10) తిరస్కరింప
బడినది. ఈ విధమగు వివరణకు ఉదాహరణలు:

అహ్నాం కేతుః — అహ్క్ నాం కేతుః (2-4-14-1)
శరద్వవరాహ్ణే — శరద్వ వరాహ్ట్ణే (2-1-2-5)

సూత్రమందు ఘోషవత్తుయగు "ఊష్మ" అని వివరించినచో ఈ క్రింది
స్థలములలో సవర్గీయ ప్రథమవర్ణ అభినిధానముండదు. గ్రీష్మే హేమంతః
ఇచట మకారము ఉత్తమ వర్ణమైనను షకారము అఘోష అగుటచే నచట
పకార సస్థానీయ ప్రథమవర్ణాభి నిధానము రాలేదు. ఇట్లే "అశ్మా చ మే
4-7-5-1); అయస్మయం . విచృత (4-2-5-3) అను స్థలములందు అభి
నిధానములు వారింపబడినవి.

సూత్రము 12 ప్రథమ ఊష్మపరో ద్వితీయమ్॥

త్రిభాష్య:– ఊష్మపరః ప్రథమస్పర్శః సవర్గీయం ద్విత్వ మాపద్యతే

న్. . ; తత్ . .; ప్రతి. . .; తత్। ప్రథమ ఇతికిమ్? తాః. .; ఊష్మపర ఇతి
మ్? వాక్ . ; అర్వా . . ఇత్యత్ర "ప్రథమపూర్వో హకారశ్చతుర్థం తస్య
స్థానం" (5-38) ఇతి హకారస్య చతుర్థాపత్తిః, విశేష విహితత్వాత్। తతః
తృతీయః "స్వర ఘోషవత్పరః" (8-3) తృతీయత్వమ్। ఇదమేవ సూత్ర
ంష్టమ్। ఊష్మపరో యస్మాత్ అసౌ ఊష్మ పరః॥

ప్రథమః। ఊష్మపరః। ద్వితీయమ్॥

ంణివ్రిథ :- "ఊష్మ వర్ణమును పరముగ గల్గిన వర్గ ప్రథమాక్షరమునకు,
వర్గయొక్క ద్వితీయ వర్ణము ఆగమముగ వచ్చును"— అని సూత్రార్థము.
ఉదాహరణలు :-

| | |
|---|---|
| విరప్ శన్ను దాదాయ — | విరప్ఫ్ శన్ను దాదాయ (1-1-9-3) |
| తత్షోడశీ — | తత్థ్ షోడశీ (6-6-11-1) |
| ప్రత్యజ్ సోమః — | ప్రత్యజ్ ఖ్ సోమః (1-8-21) |
| తత్సవితుః — | తత్థ్ సవితుః (1-5-6-4) |

సూత్రమందు ప్రథమ వర్ణమనుటచేతనే "తాః స ్ రోహః" అను చోట
తృతీయ వర్ణము వారింపబడెను. అట్లే ఊష్మపరః అనుటచే "వాక్ తే"
అనుటచే 'క' కు ద్వితీయ వర్ణము వారింపబడెను. ఊష్మ పరము అనగ
ఊష్మను పరమందు కల్గియుండుట.

సూత్రము 13 బాడబీకరస్య అసస్థానపరః॥

త్రిభాష్య :- బాడబీకరస్య మతే అత్మనోఽసస్థానోష్మ పరః ప్రథమః సవ
ర్గీయం ద్వితీయ మాపద్యతే। సమానం స్థానం యస్య అసౌ సస్థానః। న
స్థానః। అసస్థానః। సః పరః యస్మాత్సః తథోక్తః। యథా — విప్సృపో
రప్ ఫూశిన్। తథ్షోడశీ। అసస్థాన ఇతికిమ్? తత్సవితుః। నేదం సూత్ర
ంష్టమ్॥

బాడబీకరస్య। అసస్థాన పరః॥

ంణివ్రిథ :- ఈ సూత్రమున పూర్వ సూత్రము కంటె వైవిధ్యమున్నది.

ఈ సూత్రములో పరముగ ప్రథమ వర్ణము కంటె పరముగ ఊష్మ వర్ణముండవలెను. అయితే ఆ ఊష్మ వర్ణము ప్రథమవర్ణ సస్థానీయము కానక్కరలేదు. కాని బాడబీకారుని మతములో ప్రథమ వర్ణము ఏ వర్గకు చెందునో ఊష్మ వర్ణము ఆ వర్గకు చెందరాదు. అట్లైననే ఆ ప్రథమ వర్ణము సస్థానీయ ద్వితీయ వర్ణముగ మారును. ఉదాహరణకు– విస్పృహో విరఫ్శిన్ అనుచోట పకారముకంటె శకారము (ఊష్మ) ఉన్నది. ఇవి రెండును భిన్న వర్గములకు చెందినవి కనుకనే పకారమునకు 'ఫ' కారము ఆదేశముగ వచ్చినది. ఇట్లే తత్ షోడశీ — తథ్ షోడశీ అగును. సూత్రమందు అనస్థానమని చెప్పుటచేతనే "తత్సపితుః" 1-5 6-4 అనుచోట "త" కు థత్వము వారింపబడెను. తకార సకారములు ఒకే వర్గకు చెందినవి కద. సస్థానమనగా ఒకే ఉచ్చారణ స్థానము కల్గియుండుట సస్థానము కానిది అసస్థానము.

అయితే త్రిభాష్యరత్నకారులీ సూత్రమను తిరస్కరించిరి.

సూత్రము 14 అథ న॥

త్రిభాష్య :– "అథ" ఇత్యయమధికారః। ఉక్తస్య ద్విత్వవిధేః యథాసంభవం నిషేధోఽధిక్రియతే ఇతివేదితవ్యమ్। ఇత ఉత్తరం యద్వక్ష్యామః।

అథ। న॥

మణిప్రభ :- ఈ సూత్రము అధికార సూత్రము. ఇంతవరకు ఊష్మన పరముగ గల్గిన ప్రథమ వర్ణములకు ద్విత్వములుపదేశింపబడినవి. అయితే ఆ ద్విత్వ విధానము కొన్ని స్థలములందు నిషేధించబడినది. అట్టివానిని ఇపుడు చెప్పుచున్నారు. కనుక ఆ సూత్రములలోనికి నిషేధవాచకముగ "న" అనునది అధికారవాచిగ అన్వాదేశమగును.

సూత్రము 15 అవసానే ర–విసర్జనీయ జిహ్వామూలీయోపధ్మానీయాః॥

త్రిభాష్య :– పదావసానే వర్తమానో వర్ణోరేఫో విసర్జనీయో జిహ్వామూలీయ ఉపధ్మానీయశ్చ ఇత్యేతే వర్ణాః ద్విత్వం నాపద్యన్తే। యథా— ఊర్క్

రేఫాత్పరంచ (14-4) ఇతి ప్రాప్తిః। అవసాన వచనం విరామాభిప్రాయమ్। తస్మాన్న సంధానే నిషేధః। యథా— ఊర్క్ చ.. .। నా ర్తిమార్చ్ఛతి। మనః క్షే మే। యః కామయేత। యః ప్రాప్వ్ప్వనా। స్వరపూర్వమ్ (14-1) ఇత్యనేనై వ ప్రాప్తిః। అవసాన ఇతి చతుర్వర్ణం పృథగేవ సూత్రం కేచి దూచుః। ఏకీకరణే దోష దర్శనాత్। కోఽసౌ దోషః॰ అవసానే వర్తమానా ర విసర్జనీయాదయ ఇత్యన్వయ సంపాదనం "అవగ్రహ (5 10) ఇతి వదతి చేత్; నైషదోషః। ర విసర్జనీయాదీనాం పదావసానే ద్విత్వప్రాప్తిః దూరోత్సా రితా ఇతి నేయమత్ర శంకా। కించ పృథక్కరణే సతి అవసానే కిం వా భవ తీతి సాకాంక్షతయా వచనమనర్థకం స్యాత్। ఏకీకరణే తు రవిసర్జనీయ ఇతి వర్ణసాహచర్యా దవసానే వర్తమానో వర్ణ ఇతి చ లభ్యతే। తస్మాదేకీకరణమేవ రమణీయమ్॥

అవసానే, రవిసర్జనీయజిహ్వామూలీయోపధ్మానీయాః॥

మణిప్రభ :- పూర్వసూత్రమునుండి "ద్విత్వము లేదు" అనునది (న) ఈ సూత్రములోనికి వర్తించును. కాగ— "పదాన్తమందున్న వర్ణమునకు, రేఫ, విసర్గ, జిహ్వామూలీయము, ఉపధ్మానీయము-వీనికి ద్విత్వము లేదు" అని సూత్రార్థము. సూత్రమందలి 'అవసాన' శబ్దముచే వ్యస్త పదమునే గ్రహించవలెను. వాక్యమందు సంధత్తమగు స్థలమున ఈ సూత్రము వర్తించదని గ్రహించవలెను. కనుకనే విరామ చిహ్నమును కల్గిన "ఊర్క్" అను పదమునందలి కకారమునకు ద్విత్వము నిషేధించబడినది. ఊర్క్ అని వాక్యమందు సంధత్తమగుచోట్ల 'ఊర్క్చమే' అనుదగ్గర 'ఊర్క్క్చ' అని ద్విత్వము వచ్చినది. ఇట్లే నార్తిమార్చ్ఛతి (2-2-4) మనఃక్షేమే (1-2-1) యః కామయేత (2-1-2) యః ప్రాప్వ్ప్వనా (2.3.18) అను స్థలము లందు ద్విత్వము 'స్వరపూర్వమ్' (14-1) అను సూత్రముచే ప్రవర్తించినది. ఇది త్రిభాష్యరత్నకారుని వివరణము.

ఇక గార్గ్య గోపాలయజ్వ ఈ సూత్రమును— "అవసానమందున్న వ్యంజనమునకు ద్విత్వముండదు. రేఫ విసర్జనీయజిహ్వామూలీయో పధ్మా నీయములకెచటను ద్విత్వముండదు." అని చెప్పెను. [అవసానే వర్తమాన రేఫాదయః ఇత్యన్వయో నోపపద్యతే। విసర్జనీయ వ్యతిరిక్తానాం తత్రాః

ంమృభావాత్, విసర్జనీయస్య చ తత్ర ద్విత్వ ప్రాప్త్యభావాత్। తస్మాదవసానే
ంద్యమానస్య వ్యఞ్జనస్య ద్విత్వం న భవతి। రేఫాదీనాం చతుర్ణాం సర్వత్ర
ర భవతీతి యోజనా। ఇది గార్గ్యగోపాల వ్యాఖ్య]. [15]

సూత్రము 16 ఊష్మా స్వరపరః॥

త్రిభాష్య :— స్వరపర ఊష్మా ద్విత్వం నాపద్యతే। స్వరః పరః యస్మాదసౌ
స్వరపరః। యథా— దర్శ । వర్షా. । బర్సం. ।బర్హి ..। రేఫాత్పరం
చ (14-4) ఇతిప్రాప్తిః। ఊష్మేతికిమ్? ఏభి. . ॥ స్వరపర ఇతికిమ్? పా .. ।
పర్ష్ । మృదం । అగ్ని ॥

ఊష్మా। స్వరపరః॥

మణిప్రభ : "స్వరమును పరమందు కల్గిన ఊష్మ వర్ణమునకు ద్విత్వము
లేదు." అని సూత్రార్థము.

ఈ సంహితయందు ఊష్మ వర్ణములు ఆరు గద. జిహ్వామూలీయోప
ధ్మానీయములు శ, ష, స, హ. అందు మొదటి రెండింటి గురించి పూర్వ
సూత్రమున చెప్పబడినది. కనుక ఇకనిపుడు మిగిలిన శ, ష, స, హ వర్ణ
ముల గురించి చెప్పుచున్నారు. శ, ష, స, హ వర్ణములలోనేదేని యొక్క
దానికంటె అచ్చు పరముగ నున్నచో, ఈ ఊష్మ వర్ణమునకు ద్విత్వమురాదు.

ఉదాహరణ :

దర్శపూర్ణమాసౌ — (2-2-5) [దర్ శ్అ . ]
వర్షాభవః — (7-2-10) [వర్ ష్ ఆ ]
బర్సం నహ్యతి — (2-5-7) [బర్ స్అ. ]
బర్హిషా — (1-7-4) [బర్ హ్ఇ ]

పై పదములలోని శషసహలకు రేఫాత్పరం చ (14-4) అను సూత్ర
ముచే ద్విత్వము రావలసియుండగ ఈ సూత్రముచే నిషేధించబడినది.
సూత్రమందు చెప్పిన ద్విత్వ నిషేధము స్వర పరమగు ఊష్మలకే చెల్లును
అట్టి స్వరము పరమందు లేనిచో ద్విత్వము ప్రాప్తించును. పార్శ్వే। వర్
షాభవః। మృదం-బర్స్స్వభిః॥ అగ్నిర్ హ్యస్య (5-1-5) అనునవి
ప్రత్యుదాహరణలు. [16]

సూత్రము 17 ప్రథమపరశ్చ ప్లాక్షి ప్లాక్షాయణయోః॥

త్రిభాష్య :- ప్లాక్షి ప్లాక్షాయణయోః పక్షే ప్రథమపర ఊష్మా ద్విత్వం నాపద్యతే। చకార ఊష్మాణమన్వాదిశతి। యథా— సుశ్చ. । అష్టౌ. । ప్రథమపర ఇతికిమ్ః తస్మా. । ప్రథమః పరో యస్మాదసౌ ప్రథమ పరః। చకారోఽత్ర యద్యప్యూష్మ మాత్రాకర్షకః, తథాపి శషసహేష్వేవ సమ్ప్రత్యయః। అన్యథా అవసానే (14-16) ఇతి సూత్రే జిహ్వామూలీయో పధ్మానీయయోః గ్రహణం వ్యర్థమ్। అనేనైవ నిషేధసిద్ధేః॥

ప్రథమపరః। చ। ప్లాక్షి ప్లాక్షాయణయోః॥

మణిప్రభ :- పూర్వసూత్రమందు, ఊష్మకంటె స్వరము పరముగనున్నచో, ఆ ఊష్మ వర్ణమునకు ద్విత్వము రాదని చెప్పబడెను. అట్లయినచో ఊష్మకంటె వ్యంజనము పరముగ నున్నచో ద్విత్వమగునా అని సందేహము. ఆ సందేహ నివృత్తికై ఈ సూత్రము చెప్పబడినది. "ఊష్మ వర్ణముకంటె, ప్రథమ సంజ్ఞ కల్గిన వ్యంజనము అనగ, క, చ, ట, త, ప— వీనిలో ఏ యొకటియైనను-పరమందున్నచో ఆ ఊష్మకు ద్విత్వము రాదు అని సూత్రార్థము. **ఉదాహరణలు :-**

**సుశ్చన్ద్ర దస్మ** .. (4-4-4) [సుశ్ చన్ద్ర]

**అష్టౌ కృత్వః** ... (6-4-5) [అష్ టౌ]

**ఈ** సూత్రములోని చకారము పూర్వ సూత్రమందలి "ఊష్మా" అను పదమునన్వాదేశము చేయును. ప్రథమ వర్ణమును-పరమందు కల్గియున్నది "ప్రథమ పరః" అగును. మరియు ఇచట ఊష్మపదముచే శ ష స హ వర్ణములే గ్రహించబడును. అట్లుకానిచో అవసానే. (5-15) సూత్రమున జిహ్వామూలీయోపధ్మానీయ స్మరణ వ్యర్థమగును అని చెప్పుటచే, ఈ సూత్రమందలి ప్లాక్షి ప్లాక్షాయణ పదములు గౌరవ వాచకములగునే కాని మతాంతరమును సూచించవని గ్రహించవలెను. అయితే వైదికాభరణకర్త ఈ విషయమును "ప్లాక్షి ప్లాక్షాయణ గ్రహణం పూజార్థమ్" అని స్పష్టముగ చెప్పెను. [17]

సూత్రము 18 ఊష్మాఽఘోషా హారీతస్య॥

త్రిభాష్య .– హరితస్య మతే అఘోష ఊష్మా ద్విత్వం నాపద్యతే। వైశ్యో । పుష్య । నాస్యా ॥ అఘోష ఇతికిమ్? మహ్యా ॥ ఊష్మ గ్రహణం పూర్వ సూత్రాఽనపేక్షార్థమ్। అత్రయద్యూష్మ గ్రహణం న క్రియేత, ఊష్మేత్యే తత్ స్వరపరత్వేన ప్రథమ పరత్వేనచ సమ్బద్ధమ్। తస్మాదిహాపి తత్సంబంధస్యైవ వాఘోషత్వ విశేషణం స్యాత్। అత స్తన్ని వృత్త్యర్థం ఊష్మేతి గ్రహణం కృతమ్। అతః సర్వావస్థ ఊష్మాఽత్ర నిషేధ భాక్॥

ఊష్మా। అఘోషః। హారీతస్య॥

మణిప్రభ :– ఊష్మ వర్ణమునకు ద్విత్వనిషేధ విషయము పూర్వసూత్రము అందు చెప్పబడినవి. ఇపుడీ సూత్రమందును అదియే విషయము చెప్పబడుచున్నది. కాని ఇది మతాంతరము. అనగ ఇది శాఖాంతరమునకు చెందినది, ఈ సూత్రమునుండి ఐదు సూత్రములలో "హారీతుని మతము చెప్పబడును. ఈతని మతమునననుసరించి "అఘోషయగు ఊష్మ వర్ణమున కెప్పుడును ద్విత్వము లేదు" అఘోషయగు ఊష్మ అనగ హకారమును మినహాయించి మిగిలిన ఊష్మ వర్ణములు, వానికి పరమందు స్వరమున్నను, వ్యంజనమున్నను ద్విత్వము రాదు. ఉదాహరణలు :–

పుష్యతి ప్రజయా పశుభిః .. (2–1–9)

నాస్యాఽపరూపమ్ (4–5–7)

ఘోషవత్తుయగు ఊష్మ (హకారము) కు ద్విత్వము వచ్చునని తెలుపుటకే అఘోషలకు లేదని చెప్పెను.

హకారమునకు — మహ్యామిమాన్ .. (3–1–9) [18]

సూత్రము 19 రేపపరశ్చ హకారః॥

త్రిభాష్య :– పూర్వమూష్మాఽఘోష ఇత్యుక్తే ఘోషోష్మణో నిత్యం ద్విత్వే ప్రాప్తే పిశినష్టిదానీం రేఫపరో హకారశ్చకారాత్ కృష్ణ హారీతమతే ద్విత్వం నాపద్యతే।యథా— దుదు । రేఫపర ఇతికిమ్? జుహ్వా । హకార ఇతికిమ్ శుక్రం । రేఫపరో యస్మాదసౌ రేఫపరః॥

రేఫపరః। చ। హకారః॥

వివరణ :- ఈ సూత్రమందలి చకారము పూర్వ సూత్రమునుండి 'హారీ స్య' అనుదానిని ఇందులోనికి అనువృత్తి చేయును. పూర్వసూత్రమందు ఘోషయగు ఊష్మగురించి చెప్పబడినది. ఇపుడీ సూత్రమందు ఘోష త్తగు ఊష్మగురించి చెప్పుచున్నారు. హారీతుని మతానుసారము ఘోష త్తగు ఊష్మవర్ణముకంటె రేఫ పరముగ నున్నచో అట్టి ఊష్మకు ద్విత్వము సిద్ధము. అనగ హకారమునకు ద్విత్వము రాదు అని సూత్రార్థము.
దాహరణలు :- దుద్రుహే అహ్నయః . (1-5-5) ద్విత్వము రేఫ పర ందున్ననే హకారమునకే వచ్చును. కనుక "జుహ్ హ్యేహ్యగ్నిః (1-1-12) క్రం తే అన్యత్॥ (4-1-11) అనునవి ప్రత్యుదాహరణలు. [19]

సూత్రము 20 టవర్గశ్చ తవర్గపరః॥

త్రిభాష్య :- చకారో హారీతాన్వాదేశకః। టవర్గస్తవర్గపరో న ద్విత్వ మాప ద్యతే। యథా — వష....। విడ్....। తవర్గపరో యస్మాదసౌ తవర్గపరః వర్గ ఇతికిమ్? వా క్తే ...। త త్తే....। ఏవం పర ఇతికిమ్? షట్ .. డ్....॥

టవర్గః। చ। తవర్గపరః॥

వివరణ :- ఈ సూత్రమునందలి చకారము పూర్వసూత్రమునుండి "హారీ స్య" అను పదమునన్వాదేశము చేయును కాగ హారీతుని మతమునను రించి "తవర్గాక్షరమును పరమందుగల్గిన టవర్గాక్షరమునకు ద్విత్వము రాదు ని సూత్రార్థము. ఉదాహరణలు — వషట్తే విష్ణో.... (2-2-12) విడ్ ణమ్.... (1-8-13) ఈ నిషేధము తవర్గాక్షరమును పరమందు కల్గిన టవర్గ క్షరమునకే చెందును. ఇతర వర్ణములకీ నిషేధము లేదు కనుకనే వాక్ త్తే 1-3-9) త త్తే.... (1-3-9), షట్ట్ కపాలమ్ (1-8-5); విడ్డ్సై మరు కః.... (6-2-5) అనునవి ప్రత్యుదాహరణలు. [20]

సూత్రము 21 లకవర్గౌ యవకార పరౌ॥
త్రిభాష్య :- హారీతః సాన్నిద్ధ్యాల్లభ్యతే। తన్మతే లకవర్గౌ న ఖ

యువకారపరౌ ద్విత్వమాప్నుతః। యదా లకారః కల్యా....। బైల్వో....
తవర్గోఽపి ...। కన్యే....। ఇషే. ..। యవకారౌ పరౌ యాభ్యాం తౌ తథోక్తౌ॥

లతవర్గౌ, యవకారపరౌ॥

మణిప్రభ :– ఈ సూత్రము కూడ హారీతుని మతానుసారమే చెప్పబడినది. 'హారీతస్య" అనునది సాన్నిధ్య బలముచే ఈ సూత్రములోనికి వచ్చును. కాగ "హారీతుని మతానుసారము లకార తవర్గాక్షరములకంటె యకారము కాని వకారము కాని పరమగుచున్నచో, ఆ పూర్వ వర్ణములకు ద్విత్వము రాదు" అని సూత్రార్థము. ఉదాహరణలు :

లకారమునకు కల్యాణీ (7–1–6)
బైల్వోయూపః. (2–1–8)
తవర్గాక్షరములు కన్యేవ తున్నా. (3–1–11)
ఇషే త్వా. (1 1-1). [21]

సూత్రము 22 పరశ్చ॥

త్రిభాష్య :– చకారో హారీతాకర్షకః। పర ఇత్యేక వచనేన వకారో గృహ్యతే। పూర్వసూత్రస్థ నిమిత్తయోః యః పరః సోఽపి ద్విత్వ మాపద్యతే, హరిత మతే॥ యథా— విభూ । గ్రావ్ । వకార ఇతికిమ్? కల్ । స్పర్శ ఏవైకేషామ్. (14–3) ఇత్యత్రావధారణ నిరాకరణాయాయ మారంభః। అథవా ద్విత్వేకృతే పరో ద్వితీయ వ్యాయో ద్విత్వవిధిర్నాస్తి। అనవస్థా ప్రసంగాత్। నను సవర్ణ సవర్గీ యః పరః (14–23) ఇతి పరసూత్రేణాపి పున ర్ద్విత్వ నిషేధః। పౌనరుక్త్య మాపహతి। మతభేదాన్నైషదోష ఇతి బ్రూమః॥ హరీతమతమేతత్। ఊష్మాఽఘోషో హారీతస్య (14–18) ఇత్యాది సూత్రపం చకమనిష్టమ్॥

పరః। చ॥

మణిప్రభ :– ఈ సూత్రము కూడ హారీతుని మతమునే చెప్పును. సూత్ర మందలి చకారము పూర్వ సూత్రము నుండి వకారమును మాత్రమె ఈ సూత్రములోనికి అన్వాదేశము చేయును. ఈ సూత్రముచే పూర్వ సూత్ర

ముందు చెప్పబడిన నిమిత్తములో (యకార, వకారములు) పరమైనతర్వాత నున్న లేక రెండవదియగు వకారమునకు ద్విత్వ నిషేధము చెప్పబడినది.

ఈ అధ్యాయమందలి ప్రథమ సూత్రముచే స్వర పూర్వత్వము, వ్యంజన పరత్వముగల వ్యంజనమునకు ద్విత్వము చెప్పబడినది. కాని ఆ ద్విత్వ ప్రాప్తి లకార, వకారములకు లేదని మూడవ సూత్రము (స్పర్శ ఏవ ఏకేషామ్) చెప్పినది. అయితే హరితుడు ఈ సూత్రమున వకారమునకె ద్విత్వ నిషేధము చెప్పుటచే మూడవ సూత్రమునకిది అపవాదమగుచున్నది. ఈ హరితుని మతములో లకారమునకు ద్విత్వము వచ్చును. ఉదాహరణలు :- విభూ గా ప్రేప్ణ (3-5-9) గాల్గ్ణః (8- -2)

సూత్రమున వకారమునకు ద్విత్వము లేదని చెప్పుటచే లకారమునకు (3వ సూత్రములోని) ద్విత్వము వచ్చునని తెలియవలెను. కనుకనే కల్ ల్పాన్ జుహోతి . 5-4-8 అనుచోట లకారమునకు ద్విత్వము వచ్చినది.

అయితే ఈ హరీతుడు చెప్పిన ఐదు సూత్రములు (18, 19, 20, 21, 22) ప్రాతిశాఖ్యకారున కంగీకారము కాదు. కనుకనె త్రిభాష్యకారుడు "సూత్రపంచక మనిష్టమ్" అని చెప్పెను. [22]

సూత్రము 23 సవర్ణసవర్గీయ పరః॥

త్రిభాష్య :- సవర్ణపరః సవర్గీయ పరశ్చ ద్విత్వం నాపద్యతే। సవర్ణత్వం నామ సారూప్యముచ్యతే। న తుల్యస్థాన కరణత్వామాత్రమ్। సవర్గీయః సమాన వర్గ సమ్భవీ। యథా—అత్త్వక్త్వాయ అత్తా హమీషి। పిప్పకాతే। సంయుత్తాః యల్లోహితమ్। త్వం వాత్రై ః॥ సవర్ణపరాణ్యేవమాదీని। సవర్గీయ పరాణ్యపి పదానిః। అజ్ఞ్కా న్య జోక్॥ ప్రాఙ్ఛముప। కాణ్డాత్కాండాత్॥ తంతే దుశ్చక్షాః। అమ్భస్థ॥

అనునాసిక పూర్వస్తు కకారోమధ్య ఆగమః।
గకారశ్చ తకారే చ ధకారే చ యథాక్రమమ్॥

ఇతివచనా దిదమప్యుదాహరణమ్ — ప్రాఙ్క్తో యజ్ఞః ప్రాఙ్క్తః। తాఙ్ క్షయాద్యుఙ్ గ్ధ్యమితి"॥ ఏవం పర ఇతికిం? వాఙ్మ ఆసన్। షణ్మాసః విదథాని మన్మహే। దామ్ మ్నా ఒపామ్భన్॥

సవర్ణ సవర్గీయ పరః॥

మణిప్రభ :- ఇప్పటివరకు చెప్పిన సూత్ర పంచకము అనిష్టమని నిర్ణయించి, ఇకనిపుడు స్వమతమగు సిద్ధాంత సూత్రమును చెప్పుచున్నాడు.

సవర్ణమును పరమందు కల్గియున్నను, సవర్గీయవర్ణమును పరమందు కల్గియున్నను, ఆ వర్ణమునకు ద్విత్వము రాదు. ఇచట సవర్ణమనగ సమాన జాతీయమగు వర్ణ వ్యక్త్యంతరము. అనగ కకారమునకు కకారము, సకారమునకు సకారము సవర్ణములు. ఈ విధముగ ఒకే వర్ణమునకదే వర్ణము సవర్ణమగును. ఇక సవర్గీయమనగ అదే వర్గకు చెందిన వర్ణాంతరము. సవర్గేభః సవర్గీయః। ఉదాహరణలు :- అత్వక్కాయ (7-5-12) ఇచట అత్వక్ కాయ అని ఉండగ కకారమునకధికముగ ద్విత్వము లేదు. అట్లే అత్తాహపీంషి (2-6-12) పిప్పకాతే (5-5-19) సంయత్తాః (1-5-1) ఇవి సవర్ణపదమునకు ఉదాహరణలు :

| | |
|---|---|
| అజ్ కౌ వ్య జ్ కో | (1-7-7) |
| ప్రాఙ్ప్రముఖ | (5-2-7) |
| కాణ్డాత్కాణ్డాత్ | (4-2-9) |
| తంతే దుశ్చక్షాః | (3-2-10) |
| అప్సుస్థ .. | (1-5-6) |

ఈ సందర్భంలో ఒక శిక్షాకారికను ఉదహరించారు. దానిననుసరించి అనునాసిక వర్ణముకంటె పరముగ తకారముగాని థకారముగాని యున్నచో ఈ రెండింటికి పృథ్యగ క్రమముగ కకారముగాని, గకారముగాని అగమముగ వచ్చును అని తెలియును.

సూత్రమందు సవర్ణ, సవర్గీయమని నిర్దేశించుటచే వాఙ్మ అసన్; షణ్మాసః, మ హ్నే హే ఇత్యాదులందు సవర్ణము కాని, సవర్గీయ వర్ణములు గాని పరముగ లేకపోవుటచే ద్విత్వ నిషేధము ప్రవర్తించదు. కనుక నచట ద్విత్వము వచ్చు నవకాశము కలదు. [28]

సూత్రము 24 నాను త్తమ ఉత్తమపరః॥

త్రిభాష్య :- నకారోఽయం ప్రతి ప్రసవార్థః। ఉత్తమపరోఽను త్తమో

ద్విత్వం నాపద్యత ఇతి న। యథా— యాచ్ యజ్। అట్. । స్ర్వ । పా. ..। అను త్తమ ఇతికిం? తమ్మా । ఉత్తమః పరో యస్మాదసౌ వుత్తమ పరః। సవర్ణ సవర్గీయ పరః (14–23) ఇతి ప్రాప్తావయ మారమ్భః॥

న। అను త్తమః। ఉత్తమపరః॥

మణిప్రభ :— పూర్వ సూత్రమందు సవర్గీయ వర్ణములు పరమగుచో ద్విత్వ నిషేధము చెప్పబడినది. ఇపుడీ సూత్రమందు దానికి అపవాదము చెప్పు చున్నారు. ఉత్తమః అనగ వర్గ పంచమాక్షరము. ఈ సూత్రములోనికి అధికార సూత్రము నుండి "న" అనునది వచ్చును. కాగ "న నఅను త్తమః ఉత్తమపరః" అని అగును. ఒక నకారము ద్విత్వమును నిషేధించగ, మరి యొక నకారము ఆ నిషేధమును ప్రతిషేధించును. కాగ ద్విత్వము సిద్ధించును. నిషేధమునకు నిషేధమును చెప్పుటకు ప్రతిపసవమని సాంకేతికపదము. కాగ "ఉత్తమ వర్ణమును పరమందు కల్గిన సవర్గీయ భిన్న వర్ణము ద్విత్వమును పొందును" అని సూత్రార్థము. ఉదాహరణలు :—

యాచ్ఛ్ఛా. (1-5-7)
యజ్జ్ఞే యజ్జ్ఞేనః (4-1-11)
అట్ట్ణారః (5-6-5)
స్ర్వత్ త్నవత్ (2-2- 2)
పాప్ ప్మానమ్ (1-4-41)

సవర్గీయ అను త్తమ వర్ణమని చెప్పుటచే "తమ్మాదీవాః" (3-3-2) అనుచోట మకారము కంటె మకారముండుటచే పూర్వ సూత్రము ప్రవర్తించి ద్విత్వ నిషేధము సిద్ధించెను.

ఇకనిపుడు కొన్ని మత భేదములను చెప్పుచున్నారు. [24]

సూత్రము 25 అథై కేషామాచార్యాణామ్॥

త్రిభాష్య :— అదేత్యయమధికారః। ఏకేషాం మతమధిక్రియత ఇత్యేతద్వేదితవ్యం ఇత ఉత్తరం యద్వక్ష్యామః॥

అథ। ఏకేషామ్। ఆచార్యాణామ్॥

మణిప్రభ :— ఇంతవరకు ద్విత్వ విధానము చెప్పబడినది. ఇకనిపుడీ

విషయమున కొందరాచార్యుల భిన్నాభిప్రాయములను చెప్పుచున్నారు అథ అనునది అధికార వచనము ఈ క్రింద చెప్పబడు సూత్రములు భిన్నమతము లకు చెందినవని సూత్ర భావము [2]

సూత్రము 28 లకారో హశవకారపరః॥

త్రిభాష్య – ఏకేషాం మతే హశవకారపరో లకారో ద్విత్వం నాపద్యతే। మల్హా । శత । తతో । ఏవంపర ఇతికిం? కల్మాషీ , కల్ల్యాటీ హకారశ్చ శకారశ్చ వకారశ్చ హశవకారాః తేపరే యస్మాత్సః తథోక్తః। అత్ర హశవరే కార్యమిష్టం, నతు వకారపరే। నాఽప వరసూత్రమిష్టమ్॥

లకారః। హశవకార పరః॥

మతిప్రభ – లకారమునకు ద్విత్వ విషయమున మత భేదమును చెప్పు చున్నారు లకారముకంటె హ, శ, వ ఈ మూడింటిలో ఏది పరముగనున్నను, లకారమునకు ద్విత్వము లేదు"— అని సూత్రార్థము ఉదాహరణలు

మల్హా ఆలభ న్త (2-1-2)
శతవల్శం విరోహ (1-1-2)
తతో బిల్వః (2-1-8)

ఏవం పరః అని ఎందుకు? లకారముకంటె ఏతద్భిన్న వర్ణములు పర మగుచో లకారమునకు ద్విత్వము వచ్చునని తెలియవలెను కల్మాషీ (5-1-1), కల్ల్యాటీ (7-1-6) ఇచట లకారముకంటె మకారము, యకారము లుండుటచే లకారమునకు ద్విత్వము సిద్ధించినది

ఇపుడు చెప్పినది మతాంతరము కద మరి సిద్ధాన్తమేమి అని ప్రశ్నిం చగా వ్యాఖ్యకారులిట్లనుచున్నారు లకారముకంటె హ, శకారములు మాత్రమె పరముగ నున్నచో ద్విత్వము లేదు కాని వకారము పరముందున్నచో ద్విత్వము సిద్ధించును ఇందుకు ప్రమాణము—

లకారస్య వకారేణ సంయోగే స్వరితోయది।
తదా సంయుక్త ఏవస్యాత్ అసంయుక్తస్తతోఽన్యథా॥

అను శిక్షా పాఠము అనగ "లకారముకంటె స్వరితమగు వకారమున్నచో ద్విత్వము వచ్చును" అని గార్గ్యగోపాలయజ్వ వివరించెను. [28]

సూత్రము 27 స్పర్శ స్పర్శపర ॥

త్రిభాష్య – ఏకేషాం మతే స్పర్శ పరః స్పర్శో న ద్విత్వ మాపద్యతే। యథా— వాగ్దే । అపా । అప్ । సప్ర । యమ । స్పర్శః పరో యస్మాదసౌ స్పర్శపరః॥

స్పర్శః। స్పర్శపరః॥

తుదీప్రభ – కొందరాచార్యుల మతమున స్పర్శవర్ణమును పరమందుకలిగిన స్పర్శ వరమునకు ద్విత్వము లేదు" అని సూత్రార్థము ఉదాహరణలు వాగ్దేవీ (1 7 10) అపామోజ్మానమ్ (4 6 6) అబ్జారః (5 6 5) సప్రత్నవత్ (2 2 12) యమప్నవానః (1 5 5) స్పర్శ వరమును పరముందు కలినది స్పర్శపరమగును అయితే ఈ సూత్రము ఆమోద యోగ్యము కాదని వ్యాఖ్యాకారులు తిరస్కరించిరి [27]

సూత్రము 28 పదాన్తే చ వ్యఞ్జనపర ప్రాకృత ॥

త్రిభాష్య – వ్యఞ్జనపర ఇతి స్పర్శవ్యతిరిక్త వ్యఞ్జన పర ఇత్యర్థః। అన్యథా స్పర్శానామేవ గ్రహణే పూర్వసూత్రేఽపి విశేషాన్నిమిత్త విశేషో వ్యర్థః। పదాన్తత్వం ప్రాకృతత్వం చ నిమిత్తినో విశేషః। నిమిత్త తు సర్వవ్యఞ్జనాత్మకత్వమితిచేత్ సత్యమ్। తథాఽపి స్వరభక్తౌ నిమిత్త విశేషస్య వైయర్థ్యమ్। స్పర్శపర ఇత్యత్ర సామాన్యేన నిమిత్త విశేషస్యాపి గతత్వాత్। తస్మాదన్తఃస్థాదయ ఏవ అత్ర వ్యఞ్జన శబ్దేనోచ్యన్తే। చకారః స్థాని స్పర్శాకర్షకః। పారిశేష్యాన్నకారస్యానుకర్షణమ్। తథాహి— అన్తస్థాది వ్యఞ్జనపరత్వే సత్యన్య స్పర్శానామప్రకృతానాం పదాన్తే స్థితిర్నాస్తి॥ సమ్రాట్" ఇత్యత్రాస్తీతి చేత్ నైవమ్॥ న స సామితి రాపరః (13 4) ఇత్యత్ర వైయర్థ్యాత్। ఇతి శబ్దో మకారస్య ద్విత్వ సద్భావం బోధయతీ త్యధ్యాయ నానురోధా దుపపాదితమ్। తస్మాన్నైష నిషేధ విషయః॥ నాఽపి బ్రహ్మణ్వన్తః । న జ్రశ్మిభిః ఇత్యాది విషయః। కుతః? ఇహ ప్రాకృత ఇతి విశేషణం వికృత సద్భావం కల్పయతి। అన్యథా స్వస్య వైయర్థ్యాత్। తచ్చ వికృతత్వం ణకారస్య ఙకారస్య అన్తస్థాది వరత్వే సతి క్వచిదపి పదాన్తే న దృశ్యతే। తస్మాత్ ప్రాకృత

ఇతి ప్రయోగ సాఫల్యాయ నకారస్యానుకర్షణం యుక్తమితి కిఞ్చ మాహిషేయేఽపి నకారస్యైవాను కర్షణం సిద్ధవత్కృత్య వం సూత్రయోజనా— ఏకేషాం మతే పదాన్తే ప్రాకృతః వ్యఞ్జనపరో ద్విత్వం నాపద్యతే। యథా జనాన్పాతయతి ఏతాన్ హోమాన్। పదాన్త ఇతి కిం? తాన్ రక్షధ్వం। వైష నను కథమత్ర వికృతత్వమ్?

రేఫాట్టవర్గా త్పూర్వశ్చ తవరాశ్చ పరశ్చ నః।
తవర్గస్థాన ఇత్యాహూ రతత్ సానోఽన్య ఉచ్యతే।

ఇతి వచనాదత్ర స్థానభేదకృతం వికృతత్వ మితి త్రి॰ వక్ష్యతి —

రేఫపూర్వో నకారో యః పదాన్తే యత్ర దృశ్య
విశేషం తత్ర జానీయాత్ ద్విత్వమిత్యభిధీయ॰

ఇతి। వ్యఞ్జన మస్మాత్పరమితి వ్యఞ్జనపరః। ప్రకృతిరితి స్వభ ప్రాకృతః॥

పదాన్తః। చ। వ్యఞ్జనపర। ప్రాకృ॰

మఱిపరిభ – ఈ సూత్రములోని అథ వ (14–14) సూత్రము "–ధ కేషామాచార్యాణామ్" (14 25) అను అధిక వర్తించును కాగ కొందరి ఆచార్యుల మతమునను సరించి రేఫముందు కల్గినట్టియు పదాన్తమందున్నట్టియు అవిక పరమునకు ద్విత్వము లేదు అని సూత్ర భావము సూత్రార్థము పూర్వసూత్రమునుండి ప్రాకృతః అనుదానిని ఈ అనువృత్తి చేయును

ఈ సూత్రమును వివరించుచు త్రిభాష్య రత్నకారుల చిన వైదికాభరణకర్తయు పరమందున్న వ్యంజనము ఀ ఈ) అను పదములను వివరించుటకు చాల ప్రయత్నము వీరిరువురుకంటెను ప్రాచీనుడగు మాహిషేయుడు మాత యథా తథముగనె వివరించెను ఆ వివరణమే యుక్తమై పండితుడు కూడ అభిప్రాయపడెను ఇకనిపుడు త్రిభాష్య రణమును చూతము

"వ్యంజనపరః" అనగ స్పర్శవ్యతిరిక్తమగు వ్యంజనమును పరమందు ల్గిన అని అర్థము పూర్వసూత్రమందు స్పర్శను పరమందు కల్గిన స్పర్శకు ్విత్వము రాదని చెప్పబడెను కనుక ఇచట మరల స్పర్శలను కూడ గ్రహించినచో పునరుక్త దోషము వచ్చును కనుక ఈ సూత్రమందలి వ్యం న పదము "స్పర్శవ్యతిరిక్త వ్యంజనములకే" పరిమితము

శంక – ఇచట నిమిత్తియగు స్పర్శ వర్ణమునకు పదాన్తమందున్న, ్రాకృతమగు" అను విశేషణములున్నవి కనుక నిమిత్తములు కూడ పూర్వ సూత్రమునందలి వానికంటె మరల వేరుగ నుండవచ్చును కద కనుక నిమి త్తములుగ మొత్తము వ్యంజనములనన్నిటిని గ్రహించవచ్చును గదః

సమాధానము – నిజమేకాని, ఇచట స్పర్శ వర్ణములను గ్రహించినను గహించకపోయినను విశేషము లేదు కనుక అనవసరముగు విశేషార్థమును వ్యంజన పదమునకు గ్రహించుట వృధాయగును కనుక స్పర్శవ్యతిరిక్త మగు వ్యంజనములనే వ్యంజనపదము యొక్క అర్థముగ గ్రహించుట విజ్ఞత అగును కాగ సూత్రమందలి వ్యంజన పదము "అంతస్థాది వ్యంజనములనె" చెప్పును

ఇక అంతస్థాది వ్యంజనములను పరముగకల్గిన అవికారియగు పదాన్త స్పర్శ అనగ కేవలము మకారము మాత్రమే యున్నది కాగ ఈ సూత్రము అంతస్థాది వ్యంజనములను పరముగ కల్గినట్టియు అవికారి అగునట్టి పదాన్త మకారమునకె పరిమితమగును

ఈ సూత్రము "సమ్రాట్" అను స్థలమున కూడ వర్తించును కదా ఇచట (సమ్రాట్) మకారము పదాన్త స్పర్శ అవికారి అంతస్థాది వ్యంజ నమును పరమందు కల్గియున్నది కద అని ప్రశ్న నిజమే కాని ఇచట మకారమునకు ద్విత్వ నిషేధము "న సంసామితి రావరః (13-4) అను సూత్రముచే గతార్థమగుచున్నది కనుక, మరల ఈ సూత్రమును ప్రవర్తింప చేసినచో ఆ పూర్వ సూత్రము వ్యర్థమగును కనుక ఇచట "సమ్రాట్" లక్ష్యము కాదని సమాధానము మరియు "బ్రహ్మణ్వన్తః" "న్యఙ్ రశ్మిభిః" అనునవి కూడ లక్ష్యములు కావు ఏలయన, సూత్రమున అవికారియగు స్పర్శ అని చెప్పబడినది అవికారి అను పద ప్రయోగముచే ఆ స్పర్శ వర్ణము

నకు ఇతరత్ర వికారము పొందునదై యుండవలెనని తెలియును. కాని పదాన్తమందున్న ణకార నకారములు ఎట్టి పరిస్థితియందును మార్పు చెందిన స్థలములు లేవు. కనుక అవికారి అగు స్పర్శ అనినచో ఈ అక్షరములు గ్రహింపబడవు. అవి ఎక్కడైనను వికారమొందినచో అపుడు అవికారి అని చెప్పుదుము. అసలు వికారమే చెందనివానికి అవికారి అను విశేషణము వర్తించదు కనుక "బ్రహ్మణ్వ స్త్వః న్యబ్జరశ్మిభిః" అనునవి ఈ సూత్రము నకు లక్ష్యములు కావు. కాగ ఈ సూత్రమునకు ఉదాహరణలు :

జనాన్ యాతయతి (3-5-11)
ఓమన్ వతీ (2-6-9)
ఏతాన్ హోతౄన్ (1-5-4)

ఇపుడు దళసార్థక్యమును చూపుచున్నారు. పదాన్తమందలి అని ఎందుకు? అట్లు చెప్పనిచో "అన్యాయ న్తి" అనుచోట కూడ నకారమునకు ద్విత్వ నిషేధము వచ్చును. కనుక అట్టి నిషేధమును వారించుటకై (అచట ద్విత్వము రావలెను) పదాన్తమని చెప్పబడినది. (అన్యాలో నకారము పదాన్తమందు లేదు కనుక ద్విత్వము 14-1 సూత్రముచె సిద్ధించును.)

అన్తస్థాది వ్యంజన పరమనుటచే "తాన్ కల్పయతి, ఇమాన్ భద్రాన్" అను స్థలములలో పదాన్త నకారమునకు ద్విత్వము వారింపబడెను. ఇక ప్రాకృతమగు (అవికారి) అని చెప్పుటచే "తాన్ రక్షధ్వం(1-2-7), వైష్ణవాన్ రక్షోహణః" (1-3-2) అను స్థలములలో పదాన్త నకారమునకు ద్విత్వ నిషేధము వారింపబడెను. ఇచట సందేహము, పై స్థలములలోని పదాన్త నకారము ప్రాకృతము కాదని (అవికారి కాదని అనగ వికారము చెందనిదని) ఎట్లు చెప్పగలము.

ఈ సందేహమును తీర్చుటకు త్రిభాష్య రత్నకారులు రెండు కారికల నుట్టంకించిరి.

1 రేఫపూర్వో నకారో యః పదాన్తో యత్ర దృశ్యతే।
విశేషం తత్ర జానీయాత్ ద్విత్వమిత్యభి ధీయతే॥

2 రేఫాద్ఋవర్ణాత్ పూర్వశ్చ టవర్గాచ్చ పరశ్చ వః।
టవర్గ స్థాన ఇత్యాహు రతత్ స్థానోఽన్య ఉచ్యతే॥

వీని సారాంశమేమనగ పదాన్తమందలి నకారముకంటె రేఫగాని ఋకారముగాని పరమందున్నచో ఆ నకారమునకు ద్విత్వము వచ్చును లేదా అది టవర్గస్థానీయముగ నుచ్చరించబడును. అని శిక్షా గ్రంథములలో చెప్పబడినది. కనుక "తాన్ రక్షధ్వం" ఇత్యాది స్థలములలోని పదాన్త నకారము ఉచ్చారణయందు స్థాన వికారము నొందెను. కనుక అట్టి నకారమును వారించుటకై సూత్రమున "ప్రాకృతః" అని చెప్పబడెను. ఈ విధముగ త్రిభాష్య రత్నకారులీ సూత్రమును వ్యాఖ్యానించిరి.

ఇక వైదికాభరణ కర్త గూడ ఇదే విధము ననుసరించెనని చెప్పవచ్చును. అయితే అతను ఈ సూత్రము కేవలము నకారమునకె గాక పదాన్తమందలి ఙకార ణకార, నకారములకు వర్తించునని చెప్పెను. "అర్వాఙ్ యజ్ఞః, ప్రత్యఙ్ హోతారమ్, వృషణ్వతీ మన్వాహ, ఆదిత్యాన్ యాదిషామహే, అస్మిన్ రాష్ట్రే, యస్మిన్నాయుః" ఇత్యాదుల నుదాహరణలుగ చూపెను. ఇతను కూడ శిక్షా గ్రంథములనుండి తన వివరణమున కనుకూలమగు కారికల నుదహరించెను.

1 నకారాన్తం పదం పూర్వమన్తస్థాసు పరాసు చ।
నకారాన్త స్థయో ర్మధ్యే తత్ర వర్ణనుసంయుతమ్॥

2 నకారాన్తం పదం పూర్వం వకారాద్ఋపరే యది।
విశేషం తత్ర విజానీ యా ద్ద్విత్వమిత్యభి ధీయతే॥

3 సంయుక్తౌ నవకారౌ చేదృకారః పరతో యది।
సంయుక్తత్వం తు జానీయాన్నోభయోర్వ్యక్తిరిష్యతే॥

ఇచట మూడవ కారికకు "అస్మాన్వృణక్తు, వాజిన్వృషా" అనునవి లక్ష్యములు.

త్రిభాష్య రత్నకారులు తమ వ్యాఖ్యానములో "మాహిషేయుడు కూడ పదాన్త నకారమునకే ఈ సూత్రము వర్తించునను భావముతో వివరించెను."—అని చెప్పిరి. కాని ఆ ధోరణి ఆ వ్యాఖ్యానములో కానరాదు. ఇచట మాహిషేయ వ్యాఖ్య ఇట్లున్నది.— "ఏకేషామాచార్యాణాం పదాన్తశ్చ వ్యఞ్జనపరః అవికారి ద్విత్వం నాపద్యతే। వ్యఞ్జనపర ఇతి కిం? ఊర్గన్నమూర్జే వాస్మై (5–4–8) ప్రాకృత ఇతి కిం? వాగ్గ్యే దేవేభ్యః (6–1–4); యద్ద్వ్యేహోతాధ్వర్యుః (1–2–8)॥"

పై వ్యాఖ్యలో త్రిభాష్య రత్నకారులు చెప్పిన రీతి కన్పించదు.

విమర్శ :– ఈ మువ్వురి వ్యాఖ్యలలో మాహిషేయ వ్యాఖ్య సరళముగను, యుక్తముగనున్నది. అథై కేషామాచార్యాణాం అను సూత్రముచే (25) క్రింద చెప్పిన మూడు సూత్రములు (26, 27, 28) భిన్న మతములకు చెంది నవి. కనుక ఇతని మతమున చెప్పిన సూత్రములో చెప్పిన పదములకు, ఇంకొక మతములో చెప్పిన సూత్రములోని పదములకు పునరుక్తి దోషము నాపాదించజాలవు. ఏ సూత్రము (అభిప్రాయము) నకాసూత్రము స్వతంత్రములే కాని, ఒకదానికొకటి అనుగతములు కావు. కనుక ప్రస్తుత సూత్రములోని "వ్యంజన పరః" అను పదము వ్యంజన సామాన్యమంతటికి వర్తించునే కాని, కేవలము స్పర్శ భిన్నములగు అంతస్థాది వ్యంజనములకు మాత్రమే వర్తించునని చెప్పుకోనక్కరలేదు. అయితే త్రిభాష్య రత్నకారులు వైదికాభరణ కర్తయు "వ్యంజనపరః" అనగ స్పర్శభిన్న అంతస్థాది వ్యంజనములు" అని చెప్పుచు దానిని సాధించుటకై మిక్కిలి శ్రమించిరి. ఇంతటి అకాండ తాండవము చేయనవసరము లేదు. కనుకనె మాహిషేయులు సరళముగ "ఏకేషామాచార్యాణాం" అని స్పష్టముగా చెప్పుటచే సోమయార్య, గార్గ్య గోపాలయజ్వల వితండ వాదనమనవసరమని ఋజువగుచున్నది. [28]

ఇంతటితో ఈ అధ్యాయ విషయములగు ద్విత్వవిధి ప్రతిషేధములు ముగిసినవి. "అథై కేషామాచార్యాణామ్" అను అధికార సూత్రముల పరిధి పూర్తియైనది. ఇక నీ యధ్యాయమందలి ఈ క్రింది సూత్రములందు వర్ణములలో విశిష్టములైన అచ్చుల స్వభావమును వివరించుచున్నారు.

సూత్రము 29 ఉదాత్తాత్పరోఽనుదాత్తః స్వరితమ్॥

త్రిభాష్య :– ప్రాతిహత, పాదవృత్త, తైరోవ్యంజన విషయమేతత్। ఉదాత్తాత్పరః అనుదాత్తః స్వరితమాపద్యతే। యథా— స ఇధా.. । అథా.. । ప్రఉ । తయా. । వర్ణ విభాగావస్థాయాం అనుదాత్తత్వే సత్యేవ పునస్తత్సంహితాయామేవ తల్లక్షణ స్వరితత్వం ప్రఉగమిత్యాదౌ విజ్ఞేయమ్॥

ఉదాత్తాత్, పరః, అనుదాత్తః, స్వరితమ్॥

మణిప్రభ :– ఉదాత్తానుదాత్త స్వరితములను స్వరములు అచ్చులయొక్క

లక్షణము. కనుకనె అచ్చులకు స్వరములని కూడ పేరు. "ఉదాత్తమగు అచ్చుకంటె అనుదాత్తము పరముగనున్నచో, ఆ అనుదాత్తము స్వరితముగ మారును"– అని సూత్రార్థము. అందు స్వరితము ప్రధానముగ స్వతంత్ర స్వరితము, సంధిజము అని రెండు రకములు. పద నిర్మాణమందు కాని, వాక్య నిర్మాణమందు కాని ఒకదాని ప్రక్కన, ఒకటిగనుండు ఉదాత్త అనుదాత్తములగు స్వరములందు కలుగు మార్పుల ఫలితముగ వచ్చిన స్వరితము సంధిజమనబడును. అట్టి స్వరితములలో ఈ సూత్రము ప్రస్తుతము పాదవృత్త, ప్రాతిహత, తైరో వ్యంజనములను స్వరితములకు సంబంధించినది. ఉదాహరణలు :–

స ఇధానః (4–4–4) అధాబ్రవీత్ (3-2-11) ప్రఉగముక్థమ్ (4–4–2); తయాదేవతా (4-2 9) వప్స్యసి (1–2–5)

కాగ ఉదాత్తమగు అచ్చుకంటె అనుదాత్తమగు అచ్చు అనునది స ఇధానః ప్రఉగమ్ అనువానిలో సరిపోవును. మిగిలిన పదములు చెప్పబోవు సూత్రమునకుదాహరణలు. [29]

సూత్రము 30 వ్యఞ్జనాన్తర్హితోఽపి॥

త్రిభాష్య :– వ్యంజనాన్తర్హితోఽప్యుదాత్తాత్పరోఽనుదాత్తః స్వరితమాపద్యతే। యథా— తద । యస్త్వా ..। ఇత్యాది॥ అన్తర్హితో వ్యవహిత ఇత్యర్థః॥

వ్యఞ్జనాన్తర్హితః। అపి॥

మణిప్రభ :– పూర్వ సూత్రమందు ఉదాత్తమగు అచ్చుకంటె అనుదాత్తమగు అచ్చు పరమగుచో అని చెప్పితిమి. అయితే ఇపుడీ సూత్రము అట్టి అచ్చులు ఒకటి లేక అధికమగు హల్లులను మధ్యయందు కల్గియున్నను, ఉదాత్తముకంటె పరమగు అనుదాత్తము స్వరితముగ మారును అని విశదీకరించుచున్నది. ఇందుకు ఉదాహరణలు ! తదగ్నే అనృణః . (3-3-8) యస్త్వా హృదా . (1–4–46)

కాగ పై రెండు సూత్రములవలను, ఉదాత్తానుదాత్తములగు అచ్చులు అవ్యవధానముగ పరమైనను హల్లును వ్యవధానముగ కల్గినను, ఆ అనుదాత్తము స్వరితముగ మారునని తెలినది. [30]

సూత్రము 31 నోదాత్త స్వరితపరః॥

త్రిభాష్య ।– ఉదాత్తపరః స్వరిత పరోవా ఉదాత్తాత్పరోఽనుదాత్తః స్వరితం నాపద్యతే। యథా— న ఇమం—। తస్మాత్త । కిరిణా । తస్మై ।
ఉదాత్తశ్చ స్వరితశ్చ ఉదాత్త స్వరితౌ। తౌపరౌ యస్మాత్ సః తథోక్తః॥

న, ఉదాత్త స్వరితపరః॥

మతిప్రభ – పూర్వసూత్రములందు అనుదాత్తము స్వరితముగ మారుటకు నియమము చెప్పబడినది అనగ ఉదాత్తముకంటె సవ్యవధానముగనో, అవ్యవధానముగనో పరమగు అనుదాత్తము స్వరితమగును ఇది సామాన్య సూత్రము అయితే ఈ అనుదాత్తము స్వరితముగ మార్పునొందకుండుటకు నియమములను ఈ సూత్రమున చెప్పుచున్నారు

"ఉదాత్తము కంటె పరమగు అనుదాత్తమునకు పరమందు మరల ఉదాత్తముగాని, స్వరితముగాని యున్నచో ఆ అనుదాత్తము అనుదాత్తముగనె ఉండును. స్వరితముగ మార్పు చెందదు "— అని సూత్ర భావము

ఉదాహరణలు – న ఇమం లోకమ్ (1–5–9)
తస్మాత్త ఆద్యాః (7–1–1)
కిరిణామన్య మానః (1–4–46)
తస్మై వృద్ధమ్ (6–5–6) [31]

సూత్రము 32 నాగ్ని వేశ్యాయనస్య॥

త్రిభాష్య – పూర్వ సూత్రస్య ప్రతిప్రసవార్థోఽయం నకారః। ఉదాత్తాత్పరోఽనుదాత్తః అగ్ని వేశ్యాయనస్య మతే ఉదాత్తపరః స్వరితపరో వా స్వరితం నాఽపద్యత ఇతి న, పూర్వోక్తాన్యేవోదాహరణాని॥

న, అగ్ని వేశ్యాయనస్య॥

మతిప్రభ – ఈ సూత్రము పైన చెప్పిన 31–వ సూత్రమున కపవాదము కాగ, అగ్ని వేశ్యాయనాచార్యుల మతమందు "ఉదాత్తము కంటె పరమగు

అనుదాత్తము తర్వాత ఉదాత్తము కాని, స్వరితము కాని వున్నను, ఆ అనుదాత్తము స్వరితముగ మార్పు చెందును— అని సూత్ర భావము అనగ ఈ ఆచార్యులవారు పై సూత్రము నంగీకరించ లేదన్నమాట [32]

సూత్రము 33 సర్వోనేత్యేకే సర్వోనేత్యేకే॥

త్రిభాష్య — న కేవలముదాత్తాత్పరః కింతు సర్వఏవ సప్తవిధ స్వరితోనాస్తీత్యేకే శాఖినోమన్యన్తే। తథాహి — వాజసనేయి బ్రాహ్మణే ద్వావేవ స్వరావుదాత్తశ్చానుదాత్తశ్చ। నేదం సూత్రద్వయమిష్టమ్॥

సర్వః। న। ఇతి। ఏకే (సర్వోనేత్యేకే)॥

మణిప్రభ — ఈ సూత్రముతో ఈ అధ్యాయము పూర్తియగును ఈ సూత్రమందు స్వర విషయకమగు మరియొక మతాంతరాభిప్రాయము చెప్పబడుచున్నది

సర్వః=సర్వవిధ స్వరితము, న=లేదు అని ఏకే=కొందరనుచున్నారు అనగ కొందరి మతమందు స్వరములు రెండేయున్నవి అవియే ఉదాత్తానుదాత్తములు స్వరితమను మూడవరకము లేనే లేదు ఈ విషయము వాజసనేయి బ్రాహ్మణమందు స్పష్టము చేయబడినది అనగ తైత్తిరీయ శాఖకు సంబంధించి ఉదాత్తానుదాత్త స్వరితములు మూడును కలవు ఇంకను స్వరితమందలి ప్రాతిహత, పాదవృత్త తైరోవ్యంజనాది ప్రభేదములు కూడ అంగీకరింపబడెను కాని శుక్ల యజుర్వేదీయములగు కొన్ని శాఖాంతరములలో రెండు స్వరములు మాత్రమే అంగీకరింపబడెను ఆ విషయము నిచట ప్రాసంగికముగ చెప్పబడినది

సూత్రమందలి ద్విరుక్తి అధ్యాయ పరిసమాప్తిని సూచించును [33]

కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ ప్రాతిశాఖ్యకు
త్రిభాష్య రత్నానుసారము వేదులోపనామక
సుబ్రహ్మణ్యముచే వ్రాయబడిన "మణిప్రభ"
అను ఆంధ్ర వివరణమున పదునాల్గవ అధ్యాయము
సమాప్తము

# అధ్యాయము–15

అనునాసికానుస్వార విధులు. సూత్రములు–9.

సూత్రము 1 నకారస్య రేఫోష్మయకార భావల్లుప్తే చ
మలోపాచ్చ పూర్వస్వరోఽనునాసికః॥

త్రిభాష్య :– నకారస్య రేఫభావా దూష్మభావాద్యకార భావాచ్చకారా త్పృష్ట యకారే లుప్తే సతి మలోపాచ్చ పూర్వస్వరోఽనునాసికో భవతి। సానునాసికో భవతీత్యర్థః। యథా రేఫ భావాత్— అగ్నీం ః .। యథా ఊష్మభావాత్— కర్తాం ః । త్రీం । యకార భావాద్యకారే లుప్తే యథా— మహాం ః ....। మకారలోపాద్యథా— ప్రత్యు .। సు ః .। ఇత్యాది॥ మకారస్య లోపో మలోపః తస్మాత్॥

నకారస్య। రేఫోష్మ యకారభావాత్। లుప్తే।
చ। మలోపాత్। చ। పూర్వస్వరః। అనునాసికః॥

మణిప్రభ :– ఈ అధ్యాయమందు అనునాసిక విధి, అనుస్వార విధులను వివరించుచున్నారు.

పదాన్త నకారము కొన్ని స్థలములందు రేఫగను (సూ 9-20) కొన్ని చోట్ల ఊష్మ వర్ణముగను (సూ. 5–20) వేరొకచోట యకారముగను (సూ. 6-14) మారును. మరియు పదాన్త యకారము లోపించును. కనుక పదాన్త నకారము ఈ విధమగు మార్పులను పొందునపుడు, ఆ నకారమునకు పూర్వ మందున్న స్వరమునకు (అచ్చునకు) అనునాసిక్యము వచ్చును. అనగ ఆ అచ్చును ముక్కుద్వార (సానునాసికముగ) పలుకవలెనని భావము. అట్లే కొన్ని స్థలములందు పదాన్త మకారము కూడ లోపించును (సూ. 13–1). అట్లు లోపించగ పూర్వమందున్న స్వరమునకు సానునాసిక్యము సిద్ధించును. ఈ మార్పులకు సంబంధించిన సూత్రములు పూర్వాధ్యాయములందు చెప్ప బడినవి.

ఇకనిపుడు ఉదాహరణలు :– పదాన్త నకారము

1 రేఫగ మారుట— అగ్నీన్ అప్సుషదః —అగ్నీం ః రప్సుషదః (5-3-2)
శత్రూన్ అవప.... శత్రూం ః రవపవ్యయన్తః (4-6-6)

2 ఊష్మగ మారుట— కర్ణాన్ చ అకర్ణాన్ చ— కర్ణాం ః శ్చాకర్ణాం ః శ్చ (1-8-9) త్రిన్ ఋచాన్— త్రీం ః స్త్రృచాన్ (2-5-10).

3 యకారముగ మారుట] మహాన్ ఇంద్రః— మహాయ్ ఇంద్రః
అయకారము లోపించుట] మహాం ః ఇన్ద్రః. (1-4-20)
న్యమిత్రాన్ ఓషతా .. న్యమిత్రాం ః ఓషతా (1-2-14)

4 పదాన్త మకారలోపము— ప్రత్యుష్టమ్ రక్షః— ప్రత్యుష్టం ః రక్షః (1-1-2)

ఈ విధముగ వికారలోపము నొందిన నకార మకారములకంటె పూర్వ మందున్న స్వరమునకు ను నాసిక్యము వచ్చును. సూత్రమున మలోప మనగ మకారముయొక్క లోపము అని అర్థము.

సూత్రము 2 నైకేషామ్॥

త్రిభాష్య:- ఏకేషాం మతే పూర్వసూత్రోక్తేషు నానునాసిక్యం భవతి। ఉక్తాన్యేవోదాహంణాని। ఇదమేవేష్టం, నతు పూర్వమ్॥

న। ఏకేషామ్॥

మణిప్రభ:- ఈ సూత్రమందు పూర్వసూత్రమందు చెప్పిన విషయములు తిరస్కరింపబడుచున్నవి. "పదాన్త నకారమునకు రేఫోష్మ యకార భావ లోపములు, మకారలోపము వచ్చును. కాని తత్పూర్వమందున్న అచ్చునకు అనునాసిక్యము మాత్రము రాదు".

ఇది కొంతమంది ఆచార్యుల మతము. తైత్తిరీయ శాఖయును ఈ భావమునే అంగీకరించును. పూర్వసూత్రమంగీకారము కాదు.

అయితే అనునాసిక్యమునంగీకరించకపోయినచో మరి ఆ పూర్వ స్వర మున కేమియగును?— అను ప్రశ్నకు సమాధానము ఈ క్రింద సూత్రమున చెప్పుచున్నారు.

సూత్రము 3 తత స్త్వను స్వారః॥

త్రిభాష్య:- తత ఇతి సర్వనామ్నా పరామృష్టాత్ పూర్వ స్వరాత్ పరోఽను స్వారాగమో భవతి॥ యథా— స్త్రీం ః రేకాదశాం ః ఇహ॥ పరామృష్ట

స్వరస్య అనునాసిక గుణం తు-శబ్దో నివర్తయతి॥ తస్మాదననునాసిక ప్రతిషేధ పక్ష ఏవాయమనుస్వారాగమః స్యాత్॥

తతః। తు। అనుస్వారః॥

మణిప్రభ :– ఈ సూత్రమందు తైత్తిరీయశాఖ యంగీకరించిన సిద్ధాన్తము చెప్పుచున్నారు.

తతః=దానికంటె అనగ పూర్వ సూత్రమందు చెప్పిన స్వరముకంటె, అనుస్వారః=అనుస్వారాగమముగ వచ్చును. సూత్రమందలి "తు" శబ్దము స్వరమునకననునాసిక్యమును నిషేధించును. కాగ పదాన్త నకారము మార్పు చెందిగ, ఆ పదాన్త యకారము, పదాన్తవకారములు లోపించగ, తత్పూర్వమందుండు స్వరముకంటె అనుస్వారమాగమముగ వచ్చును"– అని సూత్రార్థము. ఈ అనుస్వారాగమము, పూర్వ స్వరమునకు అనునాసిక్యమును అంగీకరించని పక్షముననె సిద్ధించును. కాగ అనునాసిక్యానుస్వారములు ఏక కాలమందు సిద్ధించవు. ఇక ఉదాహరణలు పూర్వమందు చెప్పినవానినె గ్రహించవచ్చును.

వనస్పతీꣳ రను (4-?-8), శుక్లాం శ్చ కృష్ణాꣳ శ్చ (2-3-1)
శత తర్హాꣳ స్తృం హన్తి (1-5-7) న్యమిత్రాꣳ ఓషతాత్
(1-2-14) [3]

సూత్రము 4 ప్రాదిషు చైకపద ఊష్మపరః॥

త్రిభాష్య :– అగమాన్వాదేశకః చకారః। ప్రాదిష్వేకపదే అఖండపదే ఊష్మపరోఽనుస్వారాగమో భవతి। యథా ప్రꣳసోమోద ఇవ। ప్రాదిష్వితి కిం? తాసాం త్రీణి చ। ఏకపద ఇతి కిం? తం మా సꣳసృజ। అఖండ విశేషణేన కిం? త్రిషాహస్రోపై। ఊష్మపర ఇతి కిం? మాయా మాయినామ్॥

ప్రాదిషు। చ। ఏకపదే। ఊష్మపరః॥

మణిప్రభ :– ప్రాదులనగ ప్ర, శో, హ, పా, శ — అను ఈ ఐదు వర్ణములు. సూత్రమందలి చకారము అనుస్వారమాగమమును అన్వాదేశము చేయును. కాగ "ఏకపదమందు (అఖండ పదమందు) ప్రాదులకంటె ఊష్మ

వర్ణము పరమగనున్నచో, అగ్రసాది వర్ణముకంటె పరముగ అనుస్వారము అగమముగ వచ్చును— అని సూత్రార్థము.

ఈ స్పాదుల గురించి 16-వ అధ్యాయమున కొన్ని విశేషములు చెప్ప బడినవి. ఈ ప్రస్తుత సూత్రము గ్రసాదులకు సంబంధించినంత వరకు సామాన్య సూత్రమని భావించవచ్చును.

గ్రసాదులు ఐదక్షరములున్నను, ఊష్మలు నాల్గున్నను, ఉదాహరణ మాత్రము "శో"కు ఒక్కదానికే, అదియును, సకారము పరమవగ అనుస్వారా గమము చూపెను. ఉదా: శోం సామోద ఇవ.. (3-1-11-5).

మాహిషేయ, వైదికాభరణ కర్తలు కూడ ఈ ఒక్క ఉదాహరణను మాత్రమె చూపిరి.

"ఇక "గ్రసాదులకు" అని ఎందుకు? ఈ నియమము లేనిచో "తాసాం త్రీణి" అనుచోట తాకంటె అనుస్వారము వచ్చును. అట్టివానిని వారించుటకై స్ప్రాదులకని నియమము చేసెను. ఏకపదె అని ఎందుకు? ఈ అనుస్వారాగ మము స్ప్రాది, ఊష్మ వర్ణములు ఏకపదమందున్నపుడే వచ్చును. ఈ నియ మము లేనిచో "తం మా సం సృజ" అనుచోట "సం" తర్వాత అనుస్వారము రావలసియుండును. సం, సృజ ఇవి రెండు భిన్న పదములు. అఖండ పదము అను విశేషణము వలన ప్రయోజనమేమి? "త్రిషాహస్రో వై" అను స్థలమున అనుస్వారాగమము వారింపబడినది ఊష్మపరమని ఎందుకు? అట్టి నియమము లేనిచో "మాయా మాయినాం" అను స్థలములందు కూడ అను స్వారాగమము వచ్చును.

[అయితే ఈ ప్రశ్న సమాధానములు సంతృప్తికరముగ లేవు. తాసాం... ఇది మాత్రము యుక్తముగనున్నది. మిగిలినవానిలో గ్రసాదులు లేవు. మరి ఈ ప్రశ్నలకా సమాధానములు ఎట్లు సరిపడునో ఋజువుగ బోధపడలేదు.] [4]

సూత్రము 5 నాన్తవికారాత్పూర్వః॥

త్రిభాష్య :— న ఖలు పదాన్త వికారాత్పూర్వస్మిన్ననుస్వారాగమో భవతి। యథా— బహిస్తే అస్తు। హిపుజగ (16-13) ఇతి ప్రాప్తిః। అన్తవికారావితి కిం? మా హిం ..॥ అన్తస్య వికారః అన్తవికారః॥ తస్మాదన్తవికారాత్॥

న। అన్తవికారాత్। పూర్వః॥

మణిప్రభ :– మనము ప్రస్తుతము అనుస్వారాగమము గురించి పరిశీలిస్తున్నాము. "పదాన్త వర్ణము ఏ కారణముచేనైనను మార్పు చెందినంత మాత్రమున, ఆ వర్ణమునాధారము చేసికొని తత్పూర్వమందున్న స్వరమునకు అనుస్వారమాగమముగ రాదు" అని ఈ సూత్రము హెచ్చరించుచున్నది.
ఉదా : బహిస్తే అస్తు॥ ఇచట "బహిః తే" అని ఉండగ అంత్యవర్ణమగు విసర్గ సకారముగ (సూ. 8–2) మారెను. కాగ "బహిస్ తే" అని యుండగ తర్వాత అధ్యాయమున చెప్పిన హిపుజగ ... (సూ. 16–13) సూత్రముచే సకారమునకు పూర్వమందు అనుస్వారాగమము రావలెను. కాని ఈ సకారము వికారము చెందిన అంత్యవర్ణము కనుక, ఈ ప్రస్తుత సూత్రముచే ఆ అనుస్వారము వారింపబడెను.

"అన్తవికారస్య" అని చెప్పుటచే మాహిం్ సీర్ద్విపాదం అను స్థలములో హి తర్వాతనున్న సకారమునకు పూర్వమందు అనుస్వార వచ్చినది. ఇచట సకారము వికారము చెందిన అంత్యరూపము కాదు. [5]

సూత్రము 6 అప్రగ్రహాః సమానాక్షరాణ్యనునాసికాన్యేకేషామ్॥

త్రిభాష్య :– యాని సమానాక్షరాణి అప్రగ్రహ సంజ్ఞాని తాని ఏకేషాం మతే భవన్త్యను నాసికాని। యథా— కులాయినీ వసుమతీ (4-3-4)॥ అప్రగ్రహా ఇతి కిం? అమీ ఇతి। తనూ ఇతి। సమానాక్షరాణీతి కిం? సో ఏ వైషై తస్య। ప్రగ్రహాక్షర శబ్దయోర్భిన్న లింగతయా పరస్పరాన్వయో ఘటతే॥ న ప్రగ్రహాః అప్రగ్రహాః॥

అప్రగ్రహాః। సమానాక్షరాణి; అనునాసికాని; ఏకేషామ్॥

మణిప్రభ :– ఈ సూత్రమందు మతాంతరముగ "అనునాసిక" గురించి చెప్పబడుచున్నది.

కొందరాచార్యుల మతమునసుసరించి, ప్రగ్రహ కానటువంటి పదముల యొక్క అంత్యములగు అ ఆ ఆ౩, ఇ ఈ ఈ౩ ఉ ఊ ఊ౩ వర్ణములకు

అనునాసిక్యము వచ్చును. ప్రగ్రహ సంజ్ఞ లేనివి అప్రగ్రహలు. సమానాక్షరములనగ అ ఆ ఆ-3, ఇ ఈ ఈ-3, ఉ ఊ ఊ-3 (సూ. 1-2)

అప్రగ్రహలకని నియమము చేయుటచే అమీ ఇతి, తనూ ఇతి, అను స్థలములలోని ఈ, ఊ లకు అనునాసిక్యము వారింపబడెను. "సమానాక్షరములకే" అని నియమము చేయుటచే "సో ఏవైష్యై తస్య" (2-2-9) అను స్థలములలో ఓకార ఐకారములకు అనునాసిక్యము వారింపబడెను. [6]

సూత్రము 7 పదం చ ప్లుతః శాఙ్ఖాయన కాణ్డమాయనయోః॥

త్రిభాష్య:— యత్ప్లుతవత్పదం, తచ్చపదకాలే శాంఖాయన, కాణ్డమాయనయోర్మతే అనునాసికం భవతి। యథా— త్వీ-3 ఇత్యబ్రవీత్। అస్తు హీ-3 ఇత్యబ్రూతామ్। పదమితి కిం? సంహితాయాం మాభూత్। చ శబ్దః పూర్వ సూత్రోక్త విధేయ సముచ్చయం కరోతి। అపరే త్వాహుః "ప్లుతైకస్వరం పదమితి అన్యన్మాభూత్। న ఛినత్తీ-3 ఇతి॥ న విభిత్యా-3 ఇతి॥ నేదం సూత్రద్వయమిష్టం॥

పదమ్। చ। ప్లుతమ్। శాఙ్ఖాయనకాణ్డమాయనయోః॥

మణిప్రభ:— శాంఖాయన, కాండమాయను లిరువురు యజుర్వేదమునకు చెందిన అవాంతర శాఖా ప్రవర్తకులు. ఈ సూత్రమున వీరి అభిప్రాయము చెప్పబడినది.

సంహితాపాఠమందు ప్లుతాంతమగు పదమును, పద పాఠములో చెప్పునపుడు, ఆ పదాంతమందున్న ప్లుతము అనునాసిక్యమును పొందును ఉదా: త్వీ-3 ఇత్యబ్రవీత్ (2-4-12). ఇది సంహితా పాఠము. పదపాఠమున త్వీం-3। ఇతి। అబ్రవీత్। అని ఉండును. అట్లే అస్తు హీ-3 ఇత్యబ్రూతామ్॥ అని సంహితా పాఠము. పద పాఠమున ప్లుతాంతమగు హీ-3 అనునది హీం-3 అని ఉండును.

ఈ సూత్రమందలి చకారము పూర్వ సూత్రమునుండి అనునాసిక్యము ననువృత్తి చేయును. ఈ సూత్రమును వివరించుటలో కొందరు వేరొక విధ

ముగ చెప్పుచున్నారు. అది ఎట్లన, "సంహితా పాఠమున ఏకాచ్కమగు ప్లుతాంత పదమునకు మాత్రమే పద పాఠమున అనునాసిక్యము వచ్చును". ఈ అభిప్రాయమునే పైన చూపిన ఉదాహరణలు ధ్రువపరచుచున్నవి. అట్టి ఈ వివరణమును అంగీకరించినచో "న భిన త్రీ-౩ ఇతి" (1-7-2) అనుదానిని పదపాఠములో చెప్పునపుడు చిం త్రీ-౩లోని తీ-౩ కంటె అనునాసిక్యము రాదు.

అయితే ఈ సూత్రము, వివరణము కూడ తైత్తిరీయమంత్ర, పద సంహితలకనుగుణముగ లేనందున ఆమోదయోగ్యములు కావు. [7]

సూత్రము 8 అకారస్తు సం హితాయామపి॥

త్రిభాష్య :– సాన్నిధ్యాదనునాసిక ప్లుతౌ గృహ్యేతే। తు శబ్దః ప్రాకృతాచార్యమత నివర్తకః। అత ఏవ సంహితాయా మసంహితాయాంచ అకారః పదాన్తః ప్లుతోఽనునాసికో భవతి। యద్యప్యకార ఇతి సామాన్యేనోక్తః, తథాపి "అన్వాదేశోఽన్త్యస్య" (1-58 సూ.) ఇతి వచనా దపి శబ్దోఽనునాసిక ధర్మతయా నిమిత్తినం పదాన్తమేవ అకార మన్వాదిశతి॥ యథా— సుశ్లో. । [illegible]ప । యశో । యద్ఘ్రా । ఇత్యన్యస్యాం శాఖాయామ్। అపి శబ్దః కిమర్థః। సత్య । అగ్నా-౩ । విచి । శాంఖాయన కాణ్డమాయనయోః అయం విధిః అకార ప్లుతే సమ్మతః॥

అకారః। తు। సం హితాయామ్। అపి॥

మణిప్రభ :– సూత్రమందలి తు శబ్దము పరమతమును నివర్తించును. సాన్నిధ్య బలముచే అనునాసిక, ప్లుతములు ఈ సూత్రములోనికి అనువృత్తి వచ్చును. అపి శబ్దము సముచ్చయ వాచకము. కాగ, ఈ సూత్రము తైత్తిరీయ శాఖీయులకు సమ్మతమని తెలియును.

"పదపాఠమందు ప్లుతమగు పదాన్త అకారము సంహితాపాఠమునందు కూడ అనునాసిక ధర్మమును కలిగి యుండును"— అని సూత్ర భావము. అపి శబ్ద సామర్థ్యముచే పదపాఠమందును, సంహితాపాఠమందును (ఉభయత్ర) ప్లుతమగు పదాన్త నకారము అనునాసిక ధర్మమును కలిగియుండు

నని గ్రహించవలెను. ఈ సిద్ధాంతము శాంఖాయన కాండమాయనాది యితర మతముల వారికి కూడ అంగీకారమే

ఉదా. సుశ్లోకా౩ సుమంగలా౩ (1-8-16) ఇది సంహిత. సు-శ్లోకా౩ ఇతి సు-మంగలా౩ ఇతి ఇది పదపాఠము ఇట్లే ఉపహూతా౩ (2-6-7) యశో మహా౩ (7 4 20) యద్ఘ్రా౩ ఈ ఉదాహరణ అన్యశాఖనుండి గ్రహించబడినది

విట్నీ పండితుడు ప్రకటించిన గ్రంథములో యద్ఘ్రా౩ అనునది లేదు. దీనికి బదులుగ బ్రహ్మా౩ అని చూపబడెను

సూత్రమందలి అం శబ్దమెందుకు? అం శబ్దము పదాంతత్వమును తెలియచేయును. అట్లుకానిచో పదాంతమందు అకారములేని సత్యరాజా౩న్ అగ్నా౩ ఇత్యాహ" మొదలగు పదములందు కూడ ఉభయత్ర అనునాసికము వచ్చును. కనుక దానిని వారించుటకై అం శబ్దము వాడబడెను

అకారము అని ఎందుకు? ఈ సూత్రము పదాంత అకారమునకే గాని ఇకార ఉకారములకు వర్తించదు — అను స్పష్ట ప్రతిపత్తి కొరకు అకారము చెప్పబడినది [8]

సూత్రము 9 సర్వమేకయమం పూర్వేషాం. సర్వమేకయమం పూర్వేషామ్॥

త్రిభాష్య:- సర్వం వర్ణజాతమేకయమం ఏకశ్రుతీతి పూర్వేషామ్మతమ్ యమో నామ స్వరః। ఉదాత్త ఇత్యర్థః। పూర్వేనామయాజ్ఞికాః। తేషాం యజ్ఞ కర్మణి సర్వమేక శ్రుతి భవతి। అన్యే మన్యన్తే పూర్వే నామకేచిచ్ఛాఖినః తేషాం సర్వమేక శ్రుతీతి। అథాపరే కథయన్తి-సర్వమేక స్వరమనునాసికం భవతీతి సమానాక్షర మాత్రా ఎజ్ఞామధిక్షేప్తుమ్। నేదం సూత్రమిష్టమ్॥

సర్వమ్। ఏకయమమ్। పూర్వేషామ్॥

మణిప్రభ - ఈ సూత్రమును భిన్న ప్రాంతములవారు భిన్న రీతులలో

వివరించిరనుకొందును కనుకనె సోమయార్యులు మూడురకముల వివరణను చేసిరి సూత్రమందలి పూర్వేషాం అను పదమునకు స్పష్టమగు అర్థమును నిశ్చయముగ చెప్పలేకపోయిరి

సూత్రమందు సర్వం = అన్ని స్వరములు (అచ్చులు) అనగ కేవలము సమానాక్షరములె కాక అచ్చులన్నియును ఎకయమ్ = ఒకే స్వరము అనగ ఉదాత్త స్వరముతోనె చెప్పబడునని యాజ్ఞికుల యొక్క మతము అనగ యజ్ఞయాగాది క్రియలందు స్వరభేదము వైవిధ్యము లేకుండ అన్నిటిని ఏకశ్రుతి యందే (ఉదాత్తముగనె) చెప్పవలెనని యాజ్ఞికుల అభిప్రాయము

అయితే కొందరి పూర్వేషాం అను పదమునకు భిన్న శాఖీయులని వివరణమిచ్చిరి మరికొందరు సంహితా పదపాఠముల రెండింటియందును స్వరములనన్నిటిని ఎకశ్రుతిలో సానునాసికముగ పలుకవలెనని భావించిరి ఈ విధముగ ఈ సూత్రమును పలువిధముల వ్యాఖ్యానించి చివరకు ఈ సూత్రము తైత్తిరీయశాఖ అంగీకరించదని త్రిభాష్యరత్నకారులు చెప్పిరి

ఇతను పూర్వేషాం అను పదమును యాజ్ఞికులని వివరించుటలో తత్పూర్వమందుండెడి మూడు భాష్యములవట్లే వివరించెనేమో తెలియదు కాని, అందులో ఒకటియగు మాహిషేయ భాష్యమిట్లున్నది— తా యజ్ఞకర్మణి బ్రాహ్మణాన ప్రభృతీనాం సర్వమేకయమం భవతి। తస్మాదేక శ్రుత్యైవ యజ్ఞకర్మసు మన్త్రా అభిధీయన్తే॥

ఇక వైదికాభరణ కర్తయగు గార్గ్యగోపాలయజ్వ పూర్వేషామ్ అను పదమును వేరొక విధముగ వివరించెను అతని మతము ననుసరించి పూర్వేషాం = వైయాకరణుల యొక్క అని అరము చెప్పెను అతని వ్యాఖ్యాభాగమిట్లున్నది — పూర్వే వై యాకరణాః॥ ఎతచ్ఛాస్త్రస్య మూలభూతం వ్యాకరణం కృతవన్తో హా తే। అథ పూర్వే విద్వాంస ఇతి విద్వదపేక్షం ప్రాథమ్యం తేషామ్। ప్రథమే హా వైయాకరణాః ఇతి ప్రసిద్ధిః। తేహా వేదా

ధ్యయవే ఏకశ్రుత్యం వికల్పయన్తి "విభాషా ఛన్దసి" (పా 1-2-36) ఇతి।
న తు పూర్వశబ్దేన యాజ్ఞికా ఉచ్యన్తే॥

ఈ యాజ్ఞికులకు "పూర్వే యాజ్ఞికాః" అను ప్రసిద్ధి లేదు గదా అంతే కాక యజ్ఞయాగాది కర్మలందు ఉదాత్తానుదాత్తాది స్వరములన్నియు విన్పించుచున్నవి కదా. కేవలమొక్క ఉదాత్తమె చెప్పబడుట లేదు ఈ విధముగ గోపాలయజ్వ పూర్వ భాష్యకారుల మతమును త్రోసిపుచ్చెను.

ఇక సూత్రమందలి "సర్వమేకయమం పూర్వేషాం" "సర్వమేకయమం పూర్వేషాం" అను ద్విరుక్తి ఈ అధ్యాయ సమాప్తిని సూచించును [9]

కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ ప్రాతిశాఖ్యకు
త్రిభాష్య రత్నానుసారము వేదులోవనామక
సుబ్రహ్మణ్యముచే వ్రాయబడిన "మణిప్రభ"
అను ఆంధ్ర వివరణమున పదునైదవ అధ్యాయము
సమాప్తము.

— o —

అనుస్వార విధి. సూత్రములు–30.

పూర్వాధ్యాయమందు పదాదివర్ణము లకంటె అనుస్వారాగమము ముగూర్చి కొంచెము చెప్పబడినది. ఇపుడీఅధ్యాయమందు పదమధ్యమందుండు ఊష్మ వర్ణమునకు పూర్వమందు అనుస్వారాగమ విధులను గూర్చి పూర్తిగ వివరింపబడును.

సూత్రము 1 అధ సకారపరాః॥

త్రిభాష్య :– అథ ఇత్యధికారః। ఇత ఉత్తరే గ్రహణవిశేషాః సకారపరాః ఇత్యేత దధికృతం వేదితవ్యమ్। సకారః పరో యేభ్యః తే సకారపరాః॥

అధ। సకారపరాః॥

మణిప్రభ :– 'అథ' అనునది అధికార వాచకము. ఈ అధ్యాయమున చెప్ప బోవు అనుస్వారము సకారమును పరమందు కల్గిన వర్ణముకంటె (తర్వాత) వచ్చును–అను భావము ఈ చెప్పబోవు సూత్రములలోనికి అన్వాదేశమగును. ఇది అధికార పద సార్థక్యత. సకారపరాః = సకారమును పరమందు గల్గిన వర్ణములు. [1]

సూత్రము 2 స్రిశోహపాశ పదాదయస్స్వరపరే॥

త్రిభాష్య :– స్ర, శో, హ, పా, శ—ఇత్యేతే గ్రహణవిశేషాః పదాదయః సకారపరాః, తస్మిన్సకారే స్వరపరే సత్యనుస్వారాగమం భజన్తే। యథా— వి స్రః । శో ... । ఓకారేణ కిం? అశా...। హ ః స..। హ్రస్వేన కిం? ప్రజా..। పా్రిః । దీర్ఘేణ కిం? అహా ...। యథా....। పదాధయ ఇతి కిం? అగ్ని..। సోమం.। దశా । స్వరపరే ఇతి కిం? తస్మా....। హ స్త్ర...। కపి । కేచిదత్ర సూత్రే హిగ్రహణ మంగీకుర్వతే। తద నుపపన్నమ్। పదా ద ఇు ఇతి నియమాత్। "అహి ః సౌయై" ఇత్యత్ర అనుస్వారాభావ ప్రసంగాత్। నను "హి ః సీః పరమే" ఇత్యేత దత్రోదాహరణ మితిచేత్ మైవమ్। హిపుశిగా (సూ 16–13) ఇత్యత్ర నియమాభావాత్। పదాదావపదాదౌచ హిగ్రహణస్య కార్యసిద్ధేః పునరత్ర గ్రహణం వ్యర్థమ్। స్వరః పరః యస్మా దసౌ స్వరపరః। తస్మిన్॥

ప్రశోహపాశ పదాదయః। స్వరపరే॥

మతిప్రభ :— పదాదియందున్న ప్ర, శో, హ, పా, శ — అను వర్ణములలో దేనికంటెనైనను అచ్చుతో కూడిన సకారము పరముగ నున్నచో ఆ ప్రాది వర్ణముకంటె అనుస్వారము ఆగమముగ వచ్చును — అని సూత్రార్థము.

ప్రశోహపాశ — ఈ ఐదు అక్షరములకు ప్రాదులు (ప్ర ఆదియందుగల సముదాయము) అని పేరు. దీనిలో ఏ ఒక్కటియైనను పదాదియందుండవలెను. అట్టి ప్రాది అక్షరముకంటె సకారము అచ్చుతో కూడి యుండవలెను. అపుడు ఈ ప్రాది వర్ణముకంటె అనుస్వారము ఆగమముగ వచ్చును — అని భావము. ఉదాహరణలు :—

ప్ర : విప్రఁ సయే దమేహే నాధ్వర్యుః . . (6-2-9) (ప్ర ఁ స)
శో : శోఁ సా మోద ఇవ (3-2-9) (శో ఁ సా)
హ : హఁ సశ్శుచిషద్. . (1-8-15) (హ ఁ సః)
పా : పాఁ సుర ఇరావతీ ... (1-2-13) (పా ఁ సుర)
శ : యదాసీ విశ్వఁ సతి .. (7-4-19) (శ ఁ సతి)

ఇకనిపుడు కొన్ని సందేహములు — సమాధానములు.

1 'శో' అని ఓకారమెందుకు? శకారమనిన చాలదా?

పదాదియందు శో అనియె యుండవలెను. లేనిచో "ఆశాసాన" (ఆ శాసాన) అనుచోట కూడ "శా" తర్వాత అనుస్వారము వచ్చును. అట్టివానిని వారించుటకై సూత్రమందు స్పష్టముగ "శో" అని చెప్పిరి.

2 'హ' అని హ్రస్వ నిర్దేశమెందుకు? హకారమనిన చాలదా?

పదాదియందున్న దీర్ఘ హకారము కంటె స్వరపర సకారము పరముగ నున్నను అనుస్వారము రారాదు. ఉదా : హాసిత్ (5-6-8) అను స్థలమున హా తర్వాత అనుస్వారము వారించబడినది. అందుకై హ్రస్వము విధింప బడినది.

3 'పా' అని దీర్ఘమెందుకు? హ్రస్వమున్ననేమి?

హ్రస్వపకారముకంటె అనుస్వారమును వారించుటకై దీర్ఘము విధింప బడినది. కనుకనె అహతం గమేవ సః (7-4-19) అను స్థలమున 'ప' తర్వాత అనుస్వారము వారింపబడినది.

4 సూత్రమున "పదాదయః" అని ప్రాదులకు విశేషణమెందులకు?

పదమధ్యమందుండు ప్రాదులకంటె స్వరపరసకారము పరముగనున్నను అనుస్వారమును వారించుటకై ఆ నియమము చెప్పబడినది. కనుకనె అగ్ని వాహసా (1-5-11), సోమం పిపాసేత్ (2-1-10) దహాశసః (1-2-14) అను స్థలములలో పదమధ్యమందున్న సాదులకంటె అనుస్వారాగమము వారింపబడినది.

"స్వరపరే" అని ఎందుకు? అనగ "స్వరమును పరమందు గలిగిన" అను విశేషణము సకారమునకెందుకని భావము. అట్టి నియమము లేనిచో.... విస్రస్యః (6-2-9); హస్తయోః (4-1-5); కవి శస్త్రాః (2-6-12) అను స్థలములలో కూడ ప్రాదులకంటె అనుస్వారము ప్రాప్తించును. కనుక అట్టి వానిని ప్రాదులకు సంబంధించినంతవరకు వారించుటకై "స్వరపరే" అని నియమము చేయబడెను.

ఇకనిపుడు ఒక వ్యర్థ సందేహమును ప్రదర్శించి ఖండించుచున్నారు త్రిభాష్యకారులు. సూత్రమందు "హ"తో పాటు "హి" ని కూడ అంగీకరించవలెనని కొందరు భావించవచ్చు. అట్లు అంగీకరించినచో అహి ౦ సాయై (5-2-8); హి ం సీ పరమే (4-2-10); ఇత్యాది స్థలములలో అనుస్వారమునకు సాధుత్వము సిద్ధించును — అని వారి భావము. కాని ఇది అసంగతము. హి ం సీః . అనుచోట హిపుజిగా .. (సూ 16-13) అను సూత్రముచే అనుస్వారము సిద్ధించును. మరియు అహింసాయై అను స్థలమున కూడ ఆ సూత్రముచేతనె కార్యము సిద్ధించుచుండగ, మరల "హి" అని సాదులలో ప్రత్యేకముగ గ్రహించుట వ్యర్థము. అప్యకారాది (1-52) అను సూత్రముచేగూడ అగును. కాని హిపుజా . . సూత్రము పదాది పదమధ్యములయందుండు హి, పు మొదలగువానికి వర్తించును, కనుక ఇట్టి సందేహమున కసలు స్థానమే లేదు. [2]

సూత్రము 3 వికృతేఽపి॥

త్రిభాష్య :- అపిశబ్దః స్వరాన్వాదేశకః। సకారాత్పరే తస్మిన్ స్వరే వికృతమాపన్నేఽపి వ్యంజనతాముపగతేఽపి స్యాదనుస్వార విధిః। యథా — అప హ ం స్యగ్నే॥

వికృతే। అపి॥

మణిప్రభ :- సూత్రమందలి అపి శబ్దము పూర్వ సూత్రమునుండి స్వరపరే అనుదానిని అన్వాదేశము చేయును. స్వరము వికారము చెందినను అనుస్వారము వచ్చును అనగ పూర్వ సూత్రమందు స్వంపరమగు సకారము చెప్పబడినది కద. అయితే ఇపుడు ఆ సకారముకంటె పరమగునుండు స్వరము సంధివశమున వేరగు హల్సర్ధముగ మారి, తర్వాత అచ్చు యున్నను పూర్వ సూత్రమందలి కార్యము సిద్ధించును — అని సూత్రభావము.

ఉదా: అపహ ః స్యగ్నే (4-7-13)॥ అప। హ ః సి। అగ్నే। అయితే సంహితా మొత్తమునందు ఈ యొక్క స్థలమే ఈ సూత్రమునకు లక్ష్యమగుచున్నదని "విట్నీ" పండితుడు చెప్పెను.

ఇచట మాహిషేయ వ్యాఖ్య : వికారమాపన్నేఽపి స్వరే అనుస్వారాగమో భవతి। యథా— రక్ష ః స్యవ హ ః స్యగ్నే।

వైదికాభరణ వ్యాఖ్య : నిమిత్తభూతాత్ పరే స్వరే సంహితావశాద్వికృతేఽపి సాదీనాం భవత్యనుస్వారాగమః। అపహ ః స్యగ్నే॥

దీనిని బట్టి ఆలోచించగ ఈ సూత్రము సాదులలోని "హ" కు మాత్రమే వర్తించుననిపించినది. [3]

సూత్రము 4 రాపూర్వశ్చ॥

త్రిభాష్య :- చ శబ్దః సాదిషు శకారమచ్వాదిశతి। ఏతదర్థమేవ స్వరవ్యత్యయేఽపి శకారగ్రహణం తత్రాన్తే కృతమ్। రాఇత్యేవం పూర్వః శకారః సకారపరోఽనుస్వారాగమం భజతే। యథా— నారాశ ః సీభ్యః। అపవాదార్థోఽయమారంభః॥

రాపూర్వః। చ॥

మణిప్రభ :- ఈ సూత్రము సాదులలో చివరదియగు "శ"-కు మాత్రమే వర్తించును. సూత్రమందలి చకారము "శ"ను మాత్రమే ఈ సూత్రములోనికి అనువృత్తి చేయును. మరియు రెండవ సూత్రము (16-2) పదాదియందు సాదులున్ననే వర్తించును. కాని ఈ సూత్రము "శ" కు సంబంధించి పదాది నియమమునకు అపవాదము. కాగ—

సా[illegible]దులలో నొకటియగు "శ" పదమధ్యమందున్నను, దానికి పూర్వమందు "రా" యుండి, పరమందు స్వరపరమగు సకారమున్నచో, ఆ "శ" కంటె అనుస్వారము ఆగమముగ వచ్చును— అని సూత్రార్థము.

ఉదా: నారాశం సీభ్యః (7-5-11). నారాశం సః (5-7-2)
"రా" పూర్వమందుండవలెనని నిర్దేశము చేయుటచే, విశస్య (5-7-2) అను స్థలమైన "శ"-కు అనుస్వారము వారింపబడెను [4]

సూత్రము 5 శం స్త్రానన్తోదాత్తే॥

త్రిభాష్యః:— శం స్త్రా ఇత్యేతస్మిన్ గ్రహణే అనన్తోదాత్తే సకారపరే భవత్యనుస్వారాగమః॥ ఉత శం స్త్రా [illegible]॥ అనన్తోదాత్త ఇతి కిం? "అశ్వస్య విశస్తా"। పరిశోహ . (16 [illegible]) [illegible] సఞ్చాల్యం సకారస్య స్వర పరత్వాభావేఽపి నాయం విధిః నిషిద్ధ[illegible] గ్రహణమ్। [illegible] ఉదాత్తోయస్యతత్ అనన్తోదాత్తమ్। న అన్తోదాత్తం [illegible] తస్మిన్॥

శం స్త్రా। అనన్తోదాత్తే॥

వివరణ — ఉత శం స్త్రా సువిప్రః (4-6-9) అను ఈ ఒకే యొక్క స్థల[illegible] సాధుత్వము చెప్పుటకై [illegible] ఒనుకనే "[illegible] [illegible] రము ఆగమ[illegible] [illegible] సున్న చాలును. స్వరపరమగు సకారమిక్కడలేదు. కాని వికృతేఽపి (16-3) అను సూత్రము ననుసరించి స్వరము [illegible] చెందిపసుకొనుటకు అవకాశము లేదు. మరియు అనన్తోదాత్తము కావలెనంటి అని చెప్పుటచే అశ్వస్య విశస్తా (4-6-9) అను స్థలమైన "విశస్తా"- లోని శ కంటె అనుస్వారాగమము వారింపబడినది ఇచట "విశస్తా" అంత్యోదాత్తము. [5]

సూత్రము 6 అశం సన్॥

త్రిభాష్యః — "అశం సన్" ఇత్యస్మిన్ గ్రహణే స్యాదను స్వారాగమః। యథా— అవిక్ష్వశం సన్। అపద ద్వర్థోయమారంభః॥

అశ ః సన్॥

మణిప్రభ :— ఈ సూత్రము కూడ "అశ ః సన్" అను ఒక్క పదమునకె వర్తించును. అశ ః సన్ అను పదములోని శ కంటె పరముగ "స" యున్నది కనుక శ–తర్వాత అనుస్వారాగమము వచ్చును. శ ః సన్ అను పదమున అనుస్వారాగమము ప్రసోహ... (16–2) సూత్రముచే సిద్ధించగ, అవ్యకారాది (1–52) సూత్రముచే "అశ ః సన్" అనుచోట కూడ అనుస్వారాగమము సిద్ధించుచుండగ, మరల ఈ సూత్రమెందుకని సందేహము. నిజమే కాని సూత్రము 16–2 పదాదియందలి సాదులకే వర్తించును. అశ ః సన్ అను చోట శ పదాదియందు లేదు. కనుక ఈ ప్రత్యేక సూత్రము చెప్పబడెను. అశ ః సన్ (6–6–11) [6]

సూత్రము 7 న శసనం విశసనేన॥

త్రిభాష్య:— శసనం, విశసనేన ఇత్యేతయోర్గ్రహణయోరనుస్వారాగమో న భవతి। శసనం వాజ్యర్వా। శనో విశసనేన। ప్రసోహ (16–2 సూ.) ఇతి ప్రాప్తిః॥

న। శసనమ్। విశసనేన॥

మణిప్రభ :— శసనమ్, విశసనేన అను ఈ పదములలోని పదాదియందలి శ–కంటె పరమందు స్వరమున్నను, అనుస్వారాగమము రాదు — అని సూత్ర భావము. ఈ సూత్రము ఈ రెండు పదములకె వర్తించును. [7]

సూత్రము 8 మాపదాదిరనుదాత్తః॥

త్రిభాష్య :— "మా"— ఇత్యయం వర్ణః పదాదిరనుదాత్తః సకారపరోఽనుస్వారాగమం భజతే। అత్ర నియమాభావాత్ సకారస్య పరత్వాఽభావేఽపి నిమిత్తత్వం భవత్యేవ। యథా— అహర్మా ః సేన, మా ః స్వచన్యాః। పదాదిరితి కిం? సిలిక మధ్యమానః। అనుదాత్త ఇతి కిం? మాసం దీక్షితః॥

మా। పదాదిః। అనుదాత్తః॥

మణిప్రభ :— పదమందు అనుదాత్తమగు "మా" ఆదియందుండి, తర్వాత

సకారమున్న చో, మా కంటె అనుస్వారాగమముగ వచ్చును— అని సూత్రార్థము. ఇచట సకారముకంటె స్వరముండవలెనను నియమము లేదు.
ఉదా : అహర్మాం సేన (5–7–20); మా ం స్పచన్యాః (4–6–9).

పదాది అని ఎందుకు? అనుదాత్తమగు "మా" పదమధ్యమందు సకారమును పరమందు కల్గియున్నను, అచట అనుస్వారాగమమును వారించుటకు "పదాదియందుండెడి మా" అని నియమము చేయబడెను. ఉదా : సిలికమధ్యమాసః (4-6-7), అనుదాత్తమని ఎందుకు? ఉదాత్తమగు "మా" పదాదియందు, సకారమును పరముగ కల్గియున్నను అనుస్వారమును వారించుటకు "అనుదాత్తః" అని చెప్పబడినది. ఉదా : మాసం దీక్షితః। (5-6-⁻). సకారపరమని చెప్పుటచే, శకారము పరముగ నున్న చో అనుస్వారాగమము రాదు. ఉదా : శరదే మాషశిలౌ (7-2-10) [8]

సూత్రము 9 పుమీపూర్వశ్చ నిత్యమ్॥

త్రిభాష్య :– చ శబ్దో మా ఇతి జ్ఞాపయతి। పు, మీ ఇత్యేవం పూర్వో మా ఇత్యయం వర్ణః సకారపరో నిత్యమను స్వారాగమం భజతే। ఉత్పుమా ం .. । మీమా ం ... । అనుదాత్తత్వ నియమనివర్తకో నిత్యశబ్దః॥

పుమీ పూర్వః। చ। నిత్యమ్॥

మణిప్రభ :– సూత్రమందలి చ శబ్దము పూర్వ సూత్రము నుండి "మా" అనుదానిని అన్వాదేశము చేయును. "నిత్యం" అని చెప్పుటచే "మా" కు ఉదాత్తాది స్వర నియమము లేదని తెలియును. కాగ "మా" అనుదానికి పూర్వమందు "పు" లేక "మీ" అనునది యుండి పరమందు సకారమున్న చో ఆ "మా" తర్వాత అనుస్వారము ఆగమముగ వచ్చునని సూత్రార్థము.
ఉదా : ఉత్పుష్మా ం స ం హరన్తి . (6–5–10), పుమా ం సమ్ హరన్తి। మీమా ం సన్తే కార్యే . (6–2–6).

"మా" — పదాదియందుండవలెనను నియమము లేదు. [9]

సూత్రము 10 సకాయపరశ్చ॥

త్రిభాష్య :– చ-శబ్దో 'మా' ఇతి జ్ఞాపయతి। మా ఇత్యయం వర్ణః సకాయ పరః అనుస్వారాగమం భజతే। యథా — అమా ం సకాయ స్వాహా। ఇతి॥

సకాయపరః। చ॥

మణిప్రభ :- సూత్రమందలి "చ" శబ్దము పూర్వ సూత్రమునుండి "మా" అనుదానిని అన్వాదేశము చేయును. ఇచటను "మా" పదాదియందుండ వలెనను నియమము లేదు. పదమధ్యమందుండు "మా" కంటె వచ్చు అను స్వారమునకు నిత్యత్వమును చెప్పుటకై ఈ సూత్రను చెప్పబడినది. కాగ "సకాయ" అనుదానిని పరమందు గల్గిన "మా" కంటె పరముగ అనుస్వార మాగమముగ వచ్చును".

ఉదా :- అమాꣳ సకాయ స్వాహా (7-5-12).

అష్టకారాదిః (సూ. 1-‾2) [illegible] సూత్ర [illegible] నిచట సాధుత్వము రాదనియు, అందుకనే ఈ సూత్ర [illegible] చెప్పబడెను [10]

సూత్రము 11 నావగ్ర [illegible]॥

త్రిభాష్య - సపదాదిరనుదాత్తః (13-11) [illegible] అవ గ్రహ పూర్వో మా ఇత్యయం వర్ణో [illegible] భజతే। యథా— పూర్ణమాసే వై। అర్ధమాసే దేవాః॥ అవగ్రహః పూర్వో యస్మాదసౌ అవగ్రహ పూర్వః॥

[illegible]

మణిప్రభ :- [illegible] అనుదాని అపవాదయగును. అవగ్రహము పూర్వమందు కలిగిన పదాదియందలి అను దాత్తమగు "మా"- కంటె అనుస్వారము రాదు-అని సూత్రభావము. [illegible] సమాసమందు రెండవ పదాదియందు అనుదాత్తమగు "మా" అనుపది [illegible] యందున్నను దానికి అనుస్వారము రాదని భావము.

ఉదా :- పూర్వమాసే (2-5-5)। అర్ధమాసే దేవాః (2-5-6);
(పూర్వ — మా సే) (అర్ధ — మా సే) [11]

సూత్రము 12 మాసి మాసు మాసో మాసామితి చ

త్రిభాష్య :- చకారో నిషేధార్థకః। మాసి, మాసు, మాసో, మాసామ్—

ఇత్యేతేషు గ్రహణేషు న స్యాదను స్వారాగమః। ఏషామపి "మాపధాదిః".. (సూ. 16–8) ఇతి ప్రాప్తిః। కేచిదత్ర "ప్రథమే మాసి వృష్ఠాని" ఇత్యుదాహరన్తి। తదసాధు। న పదే ద్విస్వరే నిత్యమ్ . (సూ. 16–17) ఇత్యనేన ఏవ నిషేధ సిద్ధేః। తస్మాదన్య శాఖాయాం బహుస్వరముదాహరణ మవధారణీయమ్। దశసు మాసూ త్తిష్ఠన్। షణ్మాసో దక్షిణేనై తి। మాసాం ప్రతిష్ఠిత్యై॥

మాసి। మాసు। మాసో। మాసామ్। ఇతి। చ॥

మణిప్రభ :– సూత్రమందలి చకారము పూర్వ సూత్రము నుండి నిషిధ వాచకమగు "న"— అను పదమును అచటకన్వాదేశము చేయును. కాగ మాసి, మాసు, మాసో, మాసామ్—అను ఈ పదములకు మాకంటె సకారము పరముగనున్నను, పదాదియందు అనుదాత్తము ఉన్నప్పటికిని, అనుస్వారాగమము రాదు— అని సూత్రార్థము.

పై పదములన్నియు "మా"–ను పదాదియందు గల్గిన ఆద్యనుదాత్తములు. కనుక సూ. 16–8చే నిచట అనుస్వారాగమము ప్రాప్తించుచుండగ ఈ సూత్రముచే నిషేధము చెప్పబడినది. ఉదాహరణములు :

| | | |
|---|---|---|
| మాసి | ప్రథమే మాసి వృష్ఠాని— | (7–5–3). |
| మాసు | దశసు మాసూ త్తిష్ఠన్— | (7–5–2). |
| మాసో | షణ్మాసో దక్షిణేనై తి — | (6–5–3). |
| మాసామ్ | మాసాం ప్రతిష్ఠిత్యై— | (7–5–2). |

పై ఉదాహరణలలో, "ప్రథమే మాసి వృష్ఠాని" అనుదానిని త్రిభాష్య రత్నకారులంగీకరించలేదు. ఇచట "న పదే ద్విస్వరే నిత్యమ్ (సూ. 16-17) అను సూత్రముచే అనుస్వారకు నిషేధము సిద్ధించును. కనుక బహు స్వరముగు పదమును శాఖాంతరములందు అన్వేషించవలెనని చెప్పిరి.

మాహిషేయ వ్యాఖ్యానము— "యథా— ప్రథమే మాసి వృష్ఠాని (7-5-3) ఇతి కేచిదుదాహరన్తి" అని మాత్రమేయున్నది. "అంతే కాని "తదసాధు" అని స్పష్టముగ చెప్పబడలేదు. అయితే ఈ భావము "కేచిత్" అను పదప్రయోగముచే తెలియునగును.

గార్గ్య గోపాలయజ్వ మాత్రము త్రిభాష్య రత్నకారుల వాదనను అంగీకరించలేదు. [12]

సూత్రము 13 హి పు జిగా జిఘా చ ꣳ సినేత ꣳ సయదాతా ꣳ సిత్కనీయా జ్యాయాద్రాఘీయా రఘీయా శ్రేయా హ్రసీయా ఘూయా ꣳ సో జక్షివా జఘ్నివా జిగివా జీగివా తస్థివా దాశ్వా దీదివా పపివా పీపివా విద్వా వివిశివా శుశ్రువా సస్పృవా॥

త్రిభాష్య :- జి, పు, జిగా... సస్పృవా ఇత్యేవం పూర్వః సకారపరోఽనుస్వారాగమో భవతి॥ యథా— హి . ।చిను ...। తేన. । పు ꣳ సః....। లోక.. ।త్వష్టా .। బ్రాహ్మ. । నే ఇతి కిం? ప్రయు....। గమే .। యదితి కిం? అత .। అన్వా. ।ఈదితి కిం? అను । కనీ । జ్యాయా.. । ద్రాఘీ । అథో...। ప్రశ్నే । అథ. ..। వసీ । ఘూయా ꣳ ..। విసర్గేణ కిం? అన్నా....। జక్షి । జఘ్ని । వాచం .। జీగి. । ఇతి శాఖాన్తరే। ద్యుమ్నా ...। దాశ్వా ꣳ ..। శుచ. । పపి. ।। పీపి. .। విద్వా ꣳ .. । అవి । అవ్యకారాది (1-52) ఇతి వచనాత్। ప్రతి । శుశ్రు ...। వాచ. ..॥

దాశ్వా వివిశివా శుశ్రువేత్యత్ర "సాదిషు చైకపదే" (15-4) ఇతి ప్రాప్త్యా శకారపరోఽనుస్వారాగమః కిం న స్యాత్? అథ "సకార పరాః" (16-1) ఇత్యుక్త్వా విశేషస్య సకారస్యానువృత్తేరితి వదామః। తర్హి హ్రసీయా, వసీయా, తస్థివా సస్పృవా, ఇత్యత్ర సకారపర ఏవాగమః కిం న స్యాత్? ఉచ్చారణ సామర్థ్యాదేవ ఇతి ప్రథమః పరిహారః। అథవా ఆతా ꣳ సిత్, కనీయా ꣳ సమిత్యాదిషు సర్వత్ర దీర్ఘానన్తరమేవానుస్వార స్థానమితి తత్సాహచర్యాదత్రాఽపి న స్యాదనుస్వారస్య హ్రస్వానన్తరం స్థాన మిత్యపరః పరిహారః॥

హి। పు। జిగా। జిఘా।చ ꣳ సినే। అత ꣳ సయత్। ఆతా ꣳ సిత్। కనీయా। జ్యాయా। ద్రాఘీయా। రఘీయా। శ్రేయా। హ్రసీయా। వసీయా। ఘూయా ꣳ సః। జక్షివా। జఘ్నివా। జగివా। జీగివా। తస్థివా। దాశ్వా। దీదివా। పపివా। పీపివా। విద్వా। వివిశివా। శుశ్రువా సస్పృవా॥

మణిప్రభ :- పదమువందు హి, పు, జిగా .. సస్పృవా వీనిని పూర్వమందు గల్గిన సకారమునకు పూర్వమందు అనుస్వారాగమముగ వచ్చును. కాని ఛ,

అతి, అశా, భూయా— అను ఈ నాల్గింటికి క్రమముగ సినే, సయత్, పీత్, సః అనునవి పరముగనున్నపుడే, ఈ వీని సకారమునకు పూర్వమందు అనుస్వారాగమము వచ్చును.

[ఈ నాల్గింటిని మినహాయించినచో, మిగిలినవి పద్యైకదేశవర్ణాను పూర్వియగును. కాన వీని తర్వాతనుండు సకారమునకే ప్రాధాన్యము. అంతే కాని పద స్వరూపమునకు నియతి లేదు. కాని ఛ, అత, అశా, భూ అను వానికి సంబంధించి పద స్వరూపము గూడ నిశ్చయము చేయబడినది. కాగ ఆ పదములందలి సకారమునకు మాత్రమే పూర్వమందనుస్వారము వచ్చును. అంతియె కాని భూయాంసి, భూయసః మొదలగు పదాన్తమందలి సకారమునకు అనుస్వారాగమము రాదని గ్రహించవలెను.]

ఉదాహరణలు :

1 హి హిఁ సీః పరమే (4-2-10); అహిఁ సాయై.... (5-2-8)
2 పు తేన పుఁ స్వతీః.... (1-5-8); పుఁ సః పుత్రాన్...., (4-6-8)
3 జిగా లోకమజిగాఁ సన్....। (5-5-5)
4 జిఘా త్వష్టారమజిఘాఁ సన్....। (6-5-8)
5 చఁ సినే బ్రాహ్మణాచ్ఛఁ సినే....। (1-8-18)

సకారము తర్వాత "ఇనే" అని ఎందుకు? "పర్యుయుచ్ఛస్యుభే" అను స్థలములలో సకారమునకు పూర్వమందు అనుస్వారమును వారించుటకు.

6 అతఁ సయత్ గభే ముష్టిమతఁ సయత్.... (7-4-19)

"యత్" అని స తర్వాత ఎందుకు? అత తర్వాత స అని యున్నను దానికి పరముగ యత్ ఉన్నపుడే స-కు అనుస్వారాగమము. యత్ లేనిచో అనుస్వారము రాదని స్పష్టపరచుటకై యత్ చేర్చబడినది.

ఉదా : అత సం వ శుష్కమ్.... (1-2-14).

7 అశాఁ సీత్ అన్వాశాఁ సీ త్వయి.... (4-7-13)

సకారము తర్వాత ఈత్ అని ఎందుకు? సకారము తర్వాత "ఈత్" ఉన్ననె అనుస్వారము వచ్చును. లేనిచో రాదు.

ఉదా : అను వాశ్రాస స్తవ.... (4-6-7).

8 కనీయా కనీయాఁ నో దేవాః (5-3-11)

9 జ్యాయా జ్యాయాఁ సో భ్రాతరః.... (2-?-6)
10 ద్రాఘీయా ద్రాఘీయాఁ సో భవతః.... (5-2-5)
11 రఘీయా అథో రఘీయాఁ సః.... (7-4-9)
12 శ్రేయా శ్రేయాఁ సమ్.... (2-4-1)
13 ప్రహసీయా అథ హ్రసీయాఁ సమాక్రమణమ్.... (6-6-4)
14 వసీయా వసీయాఁ సం భాగధేయేన.... (5-4-10)
15 భూయాఁ సో భూయాఁ సోఽన్యేభ్యః.... (7-1-1)

భూయాఁ సః అని విసర్గ ఎందుకు? స కంటె విసర్గ లేనిచో సకారమునకు పూర్వమందు అనుస్వారము రాదని గ్రహించవలెను.

ఉదా : అన్నాదో భూయాఁసమ్....॥

16 జక్షివా జక్షివాఁ సః.... (1-4-44)
17 జఘ్నివా జఘ్నివాఁ సర మృధః.... (2-5-3)
18 జిగివా వాజం జిగివాఁ సః (1-7-8)
19 జీగివా జీగివాఁ సస్సాఽఽమ ఇతి శాఖాన్తరే (బ్రాహ్మణం 2-8-6)
20 తస్థివా ద్యుమ్నా తస్థివాఁ సః.... (1-2- 4)
21 దాశ్వా దాశ్వాఁ సో దాశుషః (1-4-16)
22 దీదివా శుచయో దీదివాఁ సం. .. (2-512)
23 వపివా వపివాఁ సశ్చ . . (1-4-44)
24 పీపివా పీపివాఁ సఁ సరస్వతః . (3-11-11)
25 విద్వా విద్వాఁ సో వై (2-5-11)
అవిద్వాఁ సశ్చకుర్మ . . (4-7-15) (సూ 1-52)
26 వివిశివా వ్రవివిశివాఁ సమీమహే. .. (4-7-15)
27 శుశ్రువా శుశ్రువాఁ సః.. . (2-5-9)
28 ససృవా వాచఁ స సృవాఁ సః.... (1-7-8)

ఈ విధముగ లక్ష్య లక్షణ సమన్వయమును చూపి, త్రిభాష్య రత్నకారులు, అనుచితములగు శంకలకు సమాధానములను కూడ చూపిరి. కాని ఈ శంకా సమాధానములను వైదికాభరణకర్త అయుక్తములు, నిరవకాశములని గర్హించెను. ఈతని వాదన సమంజసముగనే యున్నది.

వైదికాభరణకారుల గర్హ ఇట్లున్నది— "కేచిత్తు ప్రహసీయా, వసీయా

ఇత్యాదిషూష్మవత్సు గ్రహణేషు అన్తర్వర్తిన ఊష్మణః ప్రాగనుస్వారాగమః కస్మాన్న భవతీ త్యాశంకాముద్భావ్య పరిహరన్తి, ఉచ్చారణ సామర్థ్యాద్దీర్ఘ పూర్వత సాహచర్యాద్వా అనుస్వారో న భవతీతి। స్థా ఖలు ఉచిత యోజనా వ భవతి। నిర్మూలైవా శంకా। అస్మదుక్తయోజనాయాం తదనుత్థానాత్। తథోచ్చారణ సామర్థ్యాదితి పరిహారో వ్యయుక్తః। నహ్యస్మిన్ శాస్త్రే నిపాత నామాకారత్వం సాధ్యతే, అపితు విధిరేవ।....। వచ దీర్ఘ సాహచర్యాదితి యుక్తః పరిహారః। హ్రస్వానామప్యస్మిన్ సూత్రే కార్యవిధానాత్। తస్మాద సచ్చోద్యం పరిహారశ్చ] [13]

సూత్రము 14 ఆకారేకారోకారాస్సిషిపరాః పదాన్తయోః॥

త్రిభాష్య :– సి, షి పరా, ఆకారేకారోకారా న్తయోః సిష్యోః పదాన్తయోః సతో రను స్వారాగమం భజన్తే। యథా— వయూ. । తమూ । దశ । జ్యోతీ. । అగ్న । అవ ॥ పదాన్తయోరితి కిం? తస్మా । ఘనీ । ఆకారేకారోకారా ఇతి దీర్ఘేణ కిం? యథా— జ్యోతి । ఆయుషి ॥ సిషీ త్యత్రేకారేణ కిం? ప్రజా । ఓష । తమూషు ॥

ఆకారేకారోకారాః। సిషిపరాః। పదాన్తయోః॥

మణిప్రభ :– పదాన్తమందలి "సి" లేక "షి"లకు పూర్వమందు ఆ/ఈ/ఊ కారములున్నచో, వీనికంటె పరముగ, (సి, షి లకు పూర్వమందు) అనుస్వారాగమము వచ్చును–అని సూత్రార్థము.

ఈ సూత్రము పదాన్తమందు సి–గాని, షి–గాని యున్ననే, వానికి పూర్వమందు ఆకారముగాని, ఈకారముగాని, ఊకారముగాని యున్ననే ప్రవర్తించును. ఉదాహరణములు :–

1 వయూ ం సి పత్వగస్థేన ॥ (5-7-23)
2 తమూ ం సి గూహతామ్....॥ (1-8-22)
3 దశహవీ ం షి ...॥ (7-5-14)
4 జ్యోతీ ం షి కురుతే. ॥ (5-4-1)
5 అగ్న ఆయూ ం షి... ॥ (1-3-14)
6 అవభృత యజూ ం షి. .॥ (6-6-3)

"పదాన్తమందున్న" (సి, షి లని) అని ఎందుకు? పదమధ్యయందుండు సి, షి లకు పూర్వమందు ఆ ఈ ఊ కారమున్నను అనుస్వారాగమము రాదు. ఉదా: తస్మాద్వాసిష్ఠో (3-5-2), మనీషిణో మనసా (4-6-2).

ఆ ఈ ఊ అని దీర్ఘాన్తములెందుకు? పదాన్తమందలి సి, షి లకు పూర్వమందు హ్రస్వములు (అ, ఇ, ఉ) ఉన్నను అనుస్వారము రాదు.

ఇదన్తములగు సి, షి అని చెప్పుటెందులకు? ఇదన్తములగు సకార, షకారములకు మాత్రమే ఈ సూత్రము వర్తించును. అకార, ఉకారాన్తములగు సకార, షకారములకీ సూత్రము వర్తించదు.

ఉదా. ప్రజాస్వేవ. (6-4-1); ఓషధీషు (3-5-5)
తనూషు బధం. (1-8-22) [14]

సూత్రము 15 వికృతేఽపి॥

త్రిభాష్య:- అపి శబ్దాన్వాదిష్టే సిషోరికారే వికృతేఽపి, యకారమాపన్నేఽపి భవత్యనుస్వారాగమః॥ యథా .. ఛందా । హవీ...। తపూ ..॥

వికృతే। అపి॥

మతిప్రభ:- అపి శబ్దము పూర్వసూత్రమునుండి సి, షి లలోని ఇకారమును అన్వాదేశము చేయును. కాగ "పూర్వసూత్రమందు చెప్పిన సి, షి-లలోని ఇకారము వికారము చెందినను, అనగ యకారముగ మారినను, పూర్వ సూత్రము ప్రవర్తించును— అని సూత్ర భావము. అనగ అనుస్వారాగమము సిద్ధించును. ఉదా:

1 ఛందాꣳ స్యుపదధాతి. (5-3 8), [ఛందాꣳ సి ఉపదధాతి]
2 హవీꣳ ష్యాసాదయేత్ . (1-6-16), [హవీꣳ షి ఆసాదయేత్]
3 తపూꣳ ష్యగ్నే జుహ్వా . . (1-2-14); [తపూꣳ షి అగ్నే ..] [15]

సూత్రము 16 అనాకారో హ్రస్వꣳ సాంకృత్యస్య॥

త్రిభాష్య:- ఆకారాదన్యః అనాకారః ఈకార ఊకారశ్చేత్యర్థః। తయోరేవ ప్రకృతత్వాత్। సాంకృత్యస్య మతే ఈకార ఊకారశ్చ హ్రస్వమాపద్యతే॥

హవిః షి... । యజుః షి.. । అనాకార ఇతి కిం? వయాః సి... ॥ నేదం సూత్రమిష్టమ్॥

అనాకారః। హ్రస్వమ్। సాంకృత్యస్య॥

మణిప్రభ :– పూర్వ సూత్రములందు చెప్పిన సి, షి లకు పూర్వమందున్న ఈకార, ఊకారముల నుచ్చరించుటలో మత భేదమును చూపుచున్నారు.

అకారము కానిది అనకారము. (న అకారః=అనకారః). అనగ ప్రకరణానుసారము ఈకార, ఊకారములని భావము. వీనిని హ్రస్వముగ పలుకవలెనని సాంకృత్య మతము. అనగ లేఖనమున హవీః షి అని దీర్ఘ ఈకారమున్నను, ఉచ్చారణమున మాత్రము హవిః షి అని హ్రస్వ ఇకారమును పల్కవలెనని సాంకృత్యాచార్యులభిప్రాయము. కాని ఈ సూత్రము గ్రహించయోగ్యము కాదు [16]

సూత్రము 17 న పదే ద్విస్వరే నిత్యమ్॥

త్రిభాష్య :– ద్విస్వరే పదే వర్తమానాః ఆకారేకారోకారాః పదాన్త సిషిపరాః నానుస్వరాగమం నిత్యం భజన్తే। యథా— స్తుతో..। యాసి । నిత్య శబ్దః ప్రాప్త్యన్తర నిషేధార్థః। విధశః పాసి । మాపదాది . (సూ. 16-8) ఇతి ప్రాప్తిః। ద్వౌస్వరౌ యస్మిన్విద్యేతే తత్ ద్వి స్వరం, తస్మిన్॥

న। పదే। ద్విస్వరే। నిత్యమ్॥

మణిప్రభ :– ద్విస్వర పదమందలి పదాన్త సి, షి లకు పూర్వమందుండు ఆ, ఈ, ఊ లకు పరముగ అనుస్వారాగమము ఎన్నడును రాదు — అని సూత్రార్థము.

ద్విస్వర పదమనగ రెండు అచ్చులను మాత్రమే గల్గిన పదము. ప్రకృతమున పదాన్తమందలి సి, షి లలో ఒకటి; వీనికి పూర్వమందు ఆ, ఈ, ఊ — లలో నొకటి యున్న అక్షరము. ఉదాహరణ :

స్తుతో యాసి 1-8-5 ; యాసిదూతః 3-5-5.

ఇచట "యా" తర్వాత అనుస్వారము పూర్వ సూత్రముచే (16-14) వచ్చుట

కపకాశమున్నను, యాసి అనునది ద్విస్వర పదము గనుక అనుస్వారాగమము ఈ సూత్రముచే నిషేధింపబడినది

సూత్రమున "నిత్యం" అనుటచే కేవలము సూ 16–14 చేతనేగాక, ఇతరములగు సూత్రములచే ఈ ద్విస్వర పదములలో అనుస్వారాగమమునకవకాశమున్నను, దానిని ఈ సూత్రము నిషేధించుచున్నది

ఉదాహరణ విధతః పాసి (1-3-14)। ఇచట ప్రకోపహపావ (సూ. 16–2) అను సూత్రముచే సి–కి పూర్వమందు అనుస్వారము వచ్చుటకవకాశమున్నను, అది ద్విస్వర పదమగుటచే ఈ సూత్రము ఆగమమును నిషేధించును ఇద్ధే వర్ధమే మాసి (7-5-3) ఇచటను అనుస్వారాగమము "సి" కి పూర్వమందు సూత్రము "మాపదాదిః" (16-8) అనుదానిచే వచ్చుట కవకాశమున్నను, ఈ సూత్రము నిషేధించును కనుకనే సూత్రమందు "ఎన్నడును రాదు"— అని చెప్పిరి

త్రిభాష్యకారుడు ఈ సూత్రమును అ, ఈ, ఊ ల కంటె అని చెప్పవలెను, శాస్త్రసమగ్ర సంహితలలో పూర్వాక్షరమున ఈకార, ఊకారములతో కూడి, సి, షి లను తరవాతయు గల్గిన ద్విస్వర పదములు లేవు కనుక ఈ సూత్రము అకారము కంటె వచ్చు అనుస్వారాగమమును నిషేధించుచు కనుకనే ఉదాహరణములన్నియు అకారముకంటె చూపబడినవి మరియు వైదికాభరణకర్త— "ద్విస్వరే పదే వర్తమానః అకారః"— అని స్పష్టముగ అకార విషయమువనే ఈ నిషేధము వర్తించునని చెప్పియున్నాడు [17]

సూత్రము 18 ఋజీషి, జిగాసి, జిఘాస్యజాసి, యజాసి, దదాసి, దధాసి, వర్తయాసి చ।।

త్రిభాష్యః— చకారో నిషేధాకర్షకః। ఋజీషి। జిగాసి ఇత్యేతేషు గ్రహణేషు నానుస్వారాగమః స్యాత్। అకారేకారోకారాః (16-14) ఇతి ప్రాప్తిః। బహుస్వరత్వాదేషు పూర్వ సూత్ర నిషేధో నసిధ్యతీత్యయ మారంభః। యథా— తేప । అద్భ్యా । ప్రతి । ఇతి శాఖాన్తరే। అత్వ । పవి । యాతి । దధా । అశ్వ ।।

ఋజీషి। జిగాసి। జిఘాసి। అజాసి। యజాసి। దదాసి। దధాసి వర్తయాసి॥

మణిప్రభ :– సూత్రమందలి "చ" పూర్వసూత్రము నుండి నిషేధార్థకమగు నకారమును ఈ సూత్రములోనికి అనువృత్తి చేయును. కాగ ఋజీషి, జిగాసి మొదలగు ఈ పదములలో సికి పూర్వమందున్న అకారేకారోకార ములకంటె (వాస్తవముగ అకారముకంటె) అనుస్వారము ఆగమముగ రాదు– అని సూత్రార్థము.

ఈ పదములు ద్విస్వర పదములు కావు. కనుక సూత్రము 16–14 ఇచట ప్రవర్తించదు. అందుచే ఇచట అనుస్వారాగమమునకు ప్రత్యేక సూత్రముచే నిషేధమును చెప్పిరి. ఉదాహరణములు :

| | |
|---|---|
| ఋజీషి | తేన ఙ్జీషి సర్వాణి . (3-2-2) |
| జిగాసి | అచ్ఛా జిగాసి . (4-2-4) |
| జిఘాసి | ప్రథమే జిఘాసి .. (శాఖాన్తరమునుండి గ్రహింపబడెను). |
| అజాసి | అ త్వమజాసి గర్భథమ్ ... (7-4-19) |
| యజాసి | హవిషా యజాస్యగ్నే.. . (3-5-11) |
| దదాసి | యాభిర్దదాసి దాశుషే (3-3-11) |
| దధాసి | దధాసి దాశుషే కవే (4-2-7) |
| వర్తయాసి | అశ్వమావర్తయాసి నః (7-4-20) [18] |

సూత్రము 19 దఃసనాభ్యో, దఃసోభిర్దః సం బృహదఃశో దఃశవా దఃష్ట్రాభ్యాం పరః॥

త్రిభాష్య :– దుఃసనాభ్యః దఃష్ట్రాభ్యాం విషుగ్రహణేషు పరః నైవ అనుస్వారాగమో భవతి। యథా— వైశ్వా . । పతో । ధిరితి తిరః ఊతి . । పురు.. । వృష । వతూ । దఃష్ట్రా....। దః సేత్యేతావత్తై వ్యాలమ్। కిం ఆఖిల పదపాఠేన? కుర్వతే. । ఇత్యాద్యౌ మా భూదితి। పర ఇతి కిం? వృష దః శ ఇత్యత్ర స్థాన ద్వయేఽపి "ప్రసాదిషుచైకపదే" (15-4) ఇతి ప్రాప్తా వత్యాం పూర్వత్ర మా భూదితి సను గ్రహణ సామర్థ్యాదేవ అనుస్వారాగమః పూర్వత్ర న భవతి। యథా— ప్రహసీయాః వసీయాః . (16-13) ఇత్యాదౌ గ్రహణ సామర్థ్యాదుపపాదితమ్। నైష దోషః। సాదిషు చైకపదే (15-4) ఇత్యత్ర ఊష్మసామాన్య ముక్తమ్। "అథ సకార పరాః" (16-1) ఇత్యత్ర

తు తద్విశేష ఉక్తః। సామాన్య విశేషయో ర్విశేషో బలీయానితి న్యాయః। తథా సతి బలవద్బాధనమేవ భూషణం న తు దుర్బలబాధన మితి తత్రైవ గ్రహణ సామర్థ్యం సమర్థనీయా, నత్వత్ర దుర్బలస్థానే। తథాహి లోకే అధికః పురుషో విరోధిన మధికమేవ బాధతే భూషత్వాత్; న తు కదాచిదల్ప మితి పరశబ్ద ప్రయోగ ఉపపద్యతే॥

దꣳ సనాభ్యః। దꣳ సోభిః। దꣳ సమ్। వృషదꣳ శః।
దꣳ శకా। దꣳ ష్ట్రాభ్యామ్। పరః॥

మణిప్రభ :– దꣳ సనాభ్యః, దꣳ సోభిః, దꣳ సం, దꣳ శకా దంష్ట్రాభ్యాం— ఈ శబ్దములలో ఊష్మ వర్ణమునకు (సకార, శకారములకు) పూర్వమందు అనుస్వారమాగమముగ వచ్చును. కాని "వృషదꣳ శ" శబ్దమునందు పరమందున్న ఊష్మకంటె (శకారముకంటె) పూర్వమందు అనుస్వారమాగమముగ వచ్చును. సూత్రమందలి "పరః" అను పదము వృషదꣳ శ శబ్దము నుద్దేశించియె చెప్పబడినది. అట్లు కానిచో షకారమునకు పూర్వమందు కూడ "ప్రాదిషు చైకపదే ఊష్మపరః" (15–4) అను సూత్రముచే అనుస్వారాగమము వచ్చును. కనుక దానిని వారించుటకై "పరః" అని ఊష్మకు విశేషణముగ వాడిరి. ఉదాహరణలు :

| | |
|---|---|
| దꣳ సనాభ్యః | వైశ్వానరస్య దꣳ సనాభ్యః (1-5-11) |
| దꣳ సోభిః | సజోషా వశ్వినా దꣳ సోభిః (5–6–4) |
| దꣳ సమ్ | పురుదꣳ సꣳ సనిమ్ .. (4–2–4) |
| వృషదꣳ శః | వృషదꣳ శస్తే (5-5-12) |
| దꣳ శకా | పశూన్దꣳ శకాః (5–2–8) |
| దꣳ ష్ట్రాభ్యామ్ | దꣳ ష్ట్రాభ్యాం మలిమ్లున్ (4-1-10) |

అగును. పై పదములన్నిటిలో "దꣳ స" అనునది సామాన్యముగ నున్నది కద. మరి దానినే గ్రహించి "దꣳ స" అను ఆనుపూర్విలో సకారమునకు పూర్వము అనుస్వార వచ్చునని చెప్పిన సరిపోవును కద. మరి పదము లన్నిటిని పేర్కొనుట ఎందుకు? నిజమే, కాని "వ" ను పూర్వమందు కలిగిన దకారము అనేక పదములలో కలదు. కాని వానియందెల్ల అనుస్వార రారాదని, ప్రతి పదపాఠము చేయబడినది.

ఉదా : కుర్వతేమే మోవదసతమ్ (1–6–3). [19]

సూత్రము 20 మః స్యై మః సత్యై యః సద్యః స న్వః సతే వః సగః॥

త్రిభాష్య :– మః స్యై, మః సత్యై . ఇత్యేతేషు గ్రహణేషు స్వాదను స్వారాగమః। యథా— వశూ । శూర ..। శోచి । ఇష .। అగ్నె । తిగ్మ । మ స్, య స్, వః స్। ఇత్యేతావత్యై వాలం, కిమఖిల పద పారేన? ఉత్త. । యస్య .। అద్య । ఇత్యాదౌ మా భూదితి॥

మః స్యై। మః సత్యై। యః సత్। యః సస్। వః సతే।
వః సగః॥

మణిప్రభ :– మః స్యై, మః సత్యై వః సగః— ఈ పదములలో ఊష్మకు పూర్వమందనుస్వారాగమముగ వచ్చును. ఉదాహరణలు :

1 మః స్యై వశూన్మాఖి మ స్యై (3-1-9)
2 మః సత్యై శూరమ సత్యై ఛన్దాి ఇన్ద్రస్య (7-4-15)
3 యః సత్ శోచిషా యః సద్విశ్వం న్యత్రిణమ్ (4-6-1)
4 యః సస్ ఇషవశ్చర్మ యః సస్ (4-6-6)
5 వః సతే అగ్నిర్నో వః సతే రయిమ్ (4-6-1)
6 వః సగః తిగ్మశృంగో న వః సగః (2-6-11)

పై పదములన్నిటిలోను మః స్, యః స్, వః స్ అనునది ఉన్నది కద. కనుక వానిని మాత్రమే చెప్పక, ప్రతిపద పాఠమెందులకు? చెప్పెద. వినుము, మ స్, యః స్, వః స్ అను అనుపూర్వి కల్గిన ప్రతి పదము నందు అనుస్వారము అగమముగ రారాదు. ఉదాహరణకు ఉత్తమస్యావద్యతి (6-3-10); యస్య భూయాః సః (3-1-7), అద్య వసు వసతి (2-5-3).

ఈ సూత్రమును వైదికాభరణకారులు వివరించిన విధానము చాల సరళముగ నున్నది. పరిశీలించుడు— "మ శబ్దః పరమనుస్వారముప గచ్ఛతి. స్యై, సత్యై, ఇత్యనయోః పరతః। య శబ్దః సత్, సస్ ఇత్యనయోః పరతః। వశబ్దః సతే, సగః ఇత్యనయోః పరతః॥" [20]

సూత్రము 21 ఉన్న వః శమ్॥

త్రిభాష్య :– ఉత్, న ఇత్యేవం పూర్వే "వః శమ్" ఇత్యస్మిన్గ్రహణే

స్యాదనుస్వారాగమః। యథా— ఉద్వం .। ప్రాచా .। ఏవం పూర్వ ఇతి కిం? భవతి ॥

ఉత్। న। వꣳశమ్॥

మణిప్రభ :- ఉత్, న, వీనిని పూర్వమందు గల్గిన "వశమ్" అను పదమందలి ఊష్మకు పూర్వమందు అనుస్వారము ఆగమముగ వచ్చును.

ఉదాహరణ: ఉద్వꣳశమివ యేమిరే (1-6-12).
ప్రాచీన వꣳశం కరోతి.. (6-1-1).

ఏవం పూర్వః (ఉత్‌గాని, న గాని పూర్వమందున్న) అను నియమమెందుకు? ఆ వర్ణములు లేనిచో వంశమందలి ఊష్మకు పూర్వమందు అనుస్వారము రాదు.

భవతి వశం వా ఏష చరతి.... (2-1-7).

ఇచట వైదికాభరణ వ్యాఖ్యాసరళిన్ని గమనింపుడు—

"ఉత్, న ఇత్యేతాభ్యాం ఉపబద్ధాభ్యాం పరో వశబ్దః పరమనుస్వారముపగచ్ఛతి శమిత్యస్మిన్పరతః। .। ఉన్నేతి కిం? ఉక్షవశ మాలభతే (2-1-7) ఇత్యత్రాపి స్యాత్। అతః శ ఇతి వక్తవ్యమితి। మకారాధిక్యం విస్పష్టార్థమ్॥ [21]

సూత్రము 22 అక్రꣳ స్తోత్క్రꣳ స్యతే, రꣳ స్యతే భ్రꣳ శతే, రꣳ హై్ౖయౌ చ॥

త్రిభాష్య :- అక్రꣳ స్త, ఉత్క్రꣳ స్యతే.. . ఇత్యేతేషు గ్రహణేషు స్యాదనుస్వారాగమః। యథా— క్యా .। ఉత్క్ర ..। ఉవ....। నా ..। పూష్ణో .। చకారస్య వ్యతిహారేణాన్వయాదుత్తర సూత్రేపప్రయోజనముచ్యతే॥

అక్రꣳ స్త। ఉత్క్రꣳ స్యతే। రꣳ స్యతే। భ్రꣳ శతే। రꣳ హై్ౖయౌ। చ॥

మణిప్రభ :- అక్ర, ఉత్క్ర, ర, భ్ర, ర అను వీనికి క్రమముగ స్త, స్యతే, స్యతే, శతే, హై్ౖయౌ అనునవి పరమందున్నపుడు, వీని ఊష్మకు పూర్వమందనుస్వారాగమముగ వచ్చును. ఉదాహరణలు :
ద్యాం వాజ్యక్రꣳ స్త.. (7-5-19)

ఉత్క్రః స్యతే స్వాహా.... (7-1-19)
ఉపరః స్యతే స్వాహా .. (7-1-19)
నాస్మాద్రాష్ట్రం భ్రః శతే.... (5-7-4)
పూష్ణో రః హైః . (1-3-10)

ఈ సూత్రమందలి చకార ప్రయోజనము తర్వాత సూత్రమున చెప్ప బడును. [22]

సూత్రము 23. ఐకార ఉఖ్యస్య నితాన్తః॥

త్రిభాష్య :– రః హైః ఇత్యస్మిన్గ్రహణే పూర్వసూత్రస్థ చకార సముచ్చితః ఐకారః నితాన్తః భవతి ఉఖ్యస్యమతే। నితాన్తః తీవ్రతర ప్రయత్న ఇత్యర్థః। నైతన్మతమిష్టమ్॥

ఐకారః ఉఖ్యస్య నితాన్తః॥

మణిప్రభ :– పూర్వసూత్రమందు చెప్పబడిన చకారమును వ్యతీహార రీతిలో అర్థము చేసికొనవలెను. అనగ ఆ చకారము నిజమునకీ సూత్రములో చెప్ప బడలేదు. కాని ఇచట చెప్పినట్లుగ భావించి, పూర్వ సూత్రము నుండి "రః హైః" అనుదానిని ఈ సూత్రములోనికి అన్వాదేశము చేయును—అని గ్రహించవలెను. కాగ—"రః హైఃలోని ఐకారమును తీవ్ర ప్రయత్నముతో పలుకవలెనని "ఉఖ్యాచార్య మతము". కాని ఈ అభిప్రాయమును తైత్తి రీయ శాఖీయులంగీకరించలేదు. తీవ్ర ప్రయత్నముతో ఐకారోచ్చారణము ఉఖ్య శాఖీయులు మాత్రమె చేయుదురు. [23]

సూత్రము 24. విరతి సఙ్ఖ్యాసు॥

త్రిభాష్య :– విః రి, త్రి, ఇత్యేవం పూర్వ ఊష్మవర్ణేనుస్వారాగమః స్యాత్, ఏభిర్యది సంఖ్యా ఉచ్యతే। అసు— సు శబ్దం వర్జయిత్వా। సు ఇతి సప్తమీ విభక్తిరుక్తా। యథా— అః కారః ప్రథమావిభక్త్యుపలక్షణమ్। విః శత్యై స్వాహా॥ యద్వి । చత్వా । త్రి. . । త్రి ॥ త్రిగ్రహణం విస్పష్టా ర్థమ్। యతో విరిసంఖ్యాస్విత్యేతా వత్యైవాలమ్। యథా వాఘూషపూర్వ... (సూ. 7-13) ఇత్యత్ర వకారో విస్పష్టార్థః। సంఖ్యేతి కిం? విశే....। స....। త్రి....। అస్వితి కిం? త్రిష్వా....॥

విః రిః త్రిః సంఖ్యాః అసు॥

మణిప్రభ :— ఈ సూత్రము సంఖ్యావాచక పదములలో అనుస్వారాగమము గూర్చి చెప్పెను. సూత్రమందలి "సు" అనునది సప్తమీ విభక్త్యన్తపదమునకు సంకేతము సు కానిది అసు. (న సు). అనగ "సప్తమీ విభక్త్యన్తం కాని సంఖ్యావాచక పదమందు, వి, రి, త్రి అను వర్ణములలో ఏదియున్నను దానినికంటె పరముగ అనుస్వారాగమము యగును— అని సూత్రార్థము.

ఉదాహరణలు .

వి  విꣳ శత్యై స్వాహా....। (7-2-17)
   యద్విꣳ శతిర్ద్వే....। (౬-3-3)
రి  చత్వారిꣳ శతే స్వాహా....। (7-2-17)
త్రి  త్రిꣳ శతే స్వాహా....। (7-2-17)
   త్రిꣳ శత్త్రయశ్చ ..। (1-4-11)

సూత్రమందలి "త్రి" గ్రహణమనవసరము. త్రిలో కూడ "రి" అనునది యున్నది కనుక విరిసంఖ్యాసు అనిన చాలును కదా? అని ప్రశ్న. నిజమే, కాని త్రి అనునది స్పష్టప్రతిపత్తి కొరకు చెప్పబడినది— అని సమాధానము.

"సంఖ్యావాచక పదమున" అని చెప్పుటచే, సంఖ్యావాచక పదములు కానట్టి పదములందు వి, రి, త్రి అనునవి ఉన్నను, వానికంటె పరముగ అనుస్వారము రాదని గ్రహించవలెను.

ఉదా: విశే జనాయ; సరిషః పాతు, త్రిష్టు భైవాస్మై .... మొదలగు స్థలములు.

సూత్రమందు "అసు" అని చెప్పుటచే, "త్రిష్వారోచనేదివః" (4-2-4) ఇత్యాది స్థలములందు త్రి కంటె అనుస్వారాగమము వారింపబడినది.

ఇది త్రిభాష్య రత్నకారుని వ్యాఖ్యాసరళి. అయితే, వైదికాభరణకర్త యగు గార్గ్య గోపాలయజ్వ దీనిని తీవ్రముగ నిరసించెను. పరమార్థమున సారాంశమొకటియేయైనను, దీనిని వివరించిన విధానముననే దోషారోపణము చేయబడినది. అతని వ్యాఖ్యను చూడుడు—

"సంఖ్యావాచిషు ప్రాతిపదికేషు అవయవత్వేన వర్తమానాః వి, రి, త్రి ఇత్యేతే శబ్దాః పరమనుస్వారముప గచ్ఛన్తి ఊష్మణి పరతః॥

ఇతని వివరణలో వి, రి, త్రి, సంఖ్యాసు అనియె పదచ్ఛేదము. "అసు" అనునది లేదు. కనుకనే ఇతడు— "అన్యేతు విరిత్రి, సంఖ్యా, అసు ఇతి పద విభాగమాశ్రిత్య సప్తమీ బహువచనస్య పర్యుదాసం వ్యాచక్షతే। తేషాం విరిత్రి శబ్దాః సంఖ్యావాచిన ఇతి సామానాధికరణ్య ముపగన్తవ్యమ్। తత్తు విరిశబ్ద యోర్వ్యాహతమ్। న హి ప్రాతిపదికైకదేశోఽర్థవాన్, యేన సంఖ్యావాచీస్యాత్। షు శబ్ద పర్యుదాసే "చికీర్షతే, అషు" ఇతి షకారమేవ బ్రూయాత్। త్రిషు ప్రవాదేఽతి ప్రసంగస్య నాస్తి పరిహారః। తథా త్రిగ్రహణానర్థక్యం చేతి హేయమేతత్॥ [24]

సూత్రము 25. శిఁ శుమారశ్శిఁ షత్సఁ శ్వాసఁ సాప్ర సఁ స్కృత్య సఁ సృష్ట సఁ స్కృతఁ సఁ శిత స్సఁ శితా కిఁ శిల (కిఁ శిలా)॥

త్రిభాష్య:- శిఁ శుమారః, శిఁ షత్ ఇత్యేతేషు గ్రహణేషు స్వాదను స్వారాగమః। యథా— సిన్ధో .। కిం .। ఈభ । సఁ సాప్ర । సఁ సృ । శరీ ..। తస్న । బ్రహ్మ । శరవ్యే । కింఁ శి ...॥ పర కిఁ శిలగ్రహణం పదైకదేశతయా బహూపాదనార్థమ్। కిఁ . . । నమః .। నను సఁ సృష్టేత్యత్ర షకార పరోఽనుస్వారాగమః కిం నస్యాత్? నైవమ్। అత సూత్రే సర్వత్ర పదాదివర్ణానన్తరమేవానుస్వార దర్శనాత్। తత్సాహచర్యాద్ అత్రాఽపి తథైవ విజ్ఞేయమ్। న వైపరీత్యేకారణమస్తి॥

శిఁ శుమారః। శిఁ షత్। సఁ శ్వా। సఁ సాప్ర। సఁ స్కృత్య సఁ సృష్ట। సఁ స్కృతమ్। సఁ శితః। సఁ శితా। కిఁ శిల। కిఁ శిలా॥

మణిప్రభ :- శిఁ శుమారః, శిఁ షత్ మొదలగు ఈ పదములలో ఆ యందున్న ఊష్మవర్ణముకంటె పరముగ అనుస్వారము ఆగమముగ వచ్చున. కిఁ శిల పదమునందు మాత్రము ఊష్మకు పూర్వమందు అనుస్వారమ వచ్చును— అని సూత్రార్థము. ఉదాహరణలు :

1 శిఁ శుమారః సిన్ధో శ్శిఁ శుమారః.. .। (౯–౫–11)
2 శిఁ షత్ కిం తత ఉచ్ఛిఁ షతీతి....। (౬-౬-౬)

| | | |
|---|---|---|
| 3 | సం శ్వా | ఉభయతస్సం శ్వాయి కుర్యాత్ । (2-6-8) |
| 4 | సం స్రా | సం స్రావభాగాస్స్థ ।। (1-1-13) |
| 5 | సం సృష్ట | సం సృష్టజత్ । (4-6-4) |
| 6 | సం స్కృత్య | శరీరమేవ సం స్కృత్య । (5-6-6) |
| 7 | సం స్కృతమ్ | తన్న సం స్కృతం । (1-4-43) |
| 8 | సం శితః | బ్రహ్మ సం శితో హ్యేషః ।। (2-5-9) |
| 9 | సం శితా | శరవ్యే బ్రహ్మ సం శితా । (4-6-4) |
| 10 | కిం శిల | కిం శిలవన్యయాతే ।। (5-5-9) |

త్రిభాష్య రత్నకారులు కింశిల, కింశిలా అని రెండు పదములను గ్రహించి, అందొకటి పదైకదేశమనియు, అందుచే అన్ని పదములను గ్రహించవగునని వివరించిరి. కాని గార్గ్య గోపాలయజ్వ ఆ వాదనను తిరస్కరించిరి. "కిం శిల" అను పదమొక్కటియే, అన్ని పదములను గ్రహించును. "కిం శిలః, కిం శిలాయ" ఇవి అన్నియు "కిం శిల" అనుదానివే సిద్ధించును. అతని వ్యాఖ్య — "అన్యేతు అత్రద్వౌ కిం శిలావదీ పఠన్తో వ్యాచక్షతే । తన్మందమ్। ఏకేనైవాకారాన్తేన పదైకదేశ గ్రహణేన సర్వత్ర కార్యసిద్ధేః। తస్మాత్పరిభాషా న భవతి యన్నిబంధనోఽయం ప్రలాపః। తస్మాన్నిరర్థకోఽత్ర ద్వితీయః॥ [25]

సూత్రము 26. సితృదృహకార పరః॥

త్రిభాష్య :– సి, తృ, దృ ఇత్యేవం పూర్వో హకార పరః స్యాదనుస్వారాగమః। యథా— సిం హె । శత । దృం హ ।॥ ఏవం పూర్వఇతి కిం? సప ।। అని । ఋకారేణైవాలం, కిం తకార దకారాభ్యాం? గృహా । ఏవం పరఇతి కిం? సిషా ।। తృషీ ।। న క్తం ।। హకారః పరో యస్మాదసౌ హకారపరః॥

సి। తృ। దృ। హకారపరః॥

మణిప్రభ :– పదమందు సి, తృ, దృ అను ఈ వర్ణములలో నేదేని ఒకదానికంటె హకారము పరముగ నున్నచో, ఆ హకారమునకు పూర్వమందనుస్వారమాగమముగ వచ్చును. ఉదాహరణలు :

సిం హో వయః । (4-3-5)

శతతర్హా : స్తృ ఁ హ న్తి (1-5-7)
దృ ఁ హస్వ మాహ్వాః . (1-1-3)
ఈ అనుస్వారాగమము, సి, తృ, దృ అను వర్ణములు పూర్వమందుండి, పర మందు హకారమున్న నే, సిద్ధించును. అట్లు లేనిచో ఈ ఆగమము రాదు.
ఉదాహరణలు :

సపత్న సాహీ స్వాహా (1-2-12)
అనతిదాహా యోవాకా (5-2-10)
గృహాణా మనసుర్త్యై (3-3-8)
సిషాస న్తీః (7-5-2), తృష్వీమను.... (7-5-2),
న క్తం దృశే దీప్యతే (1-6-4); [26]

సూత్రము 27. మ ఁ హిష్ఠస్య చ॥

త్రిభాష్య :- "మ ఁ హిష్ఠస్య" ఇత్యస్మిన్గ్రహణే చకారాత్పృష్ఠః హకారపరోఽనుస్వారాగమో భవతి। యథా— మ ఁ హిష్ఠస్య ప్రభృతస్య । చకారః కిమర్థః? అత్రైవ గ్రహణే షకారపరో మా భూదితి॥

మ ఁ హిష్ఠస్య। చ॥

మణిప్రభ :- "మ" అనుదానికంటె "హిష్ఠస్య" అనునది పరమందున్న చో ఆ మకారముకంటె పరముగ అనుస్వారమాగమముగ వచ్చును. సూత్రమం దలి చకారము పూర్వసూత్రమునుండి హకారమునిచట జ్ఞప్తికి తెచ్చును
ఉదాహరణ : మ ఁ హిష్ఠస్య ప్రభృతస్య । (4-2-8). [27]

సూత్రము 28. ఆదిర ఁ హతిర ఁ హోఽ ఁ హోర ఁ హోముగత్య ఁ హో అ ఁ హసోఽహసాఽ ఁ శమ ఁ శుభిర ఁ శభువాఽ ఁ శ్వ ఁ శూ అ ఁ శ వోఽ ఁ శుర ఁ శుమ ఁ శూన ఁ శునా అ ఁ శోర ఁ శాయో పా ఁ శ్వ ఁ శావవగ్రహే॥

త్రిభాష్య :- అ ఁ హతిః, అ ఁ హ . ఇత్యేతేష్వనుస్వారాగమో భవతి। యథా పరి । అ ఁ హో । సూత్రే సంహితాయామోత్వ స్యామ్నానాత్

"అꣳహ. " ఇత్యాదౌ న స్యాదయం విధిః। కిన్తు యస్మిన్విసర్జనీయో రేఫం నాపద్యతే, తస్యైవోపాదానమ్। అꣳహో । అꣳహో । నన్వయం చైక (చక్ర) బన్ధః, రేఫమప్రాప్తస్యాయం విధిః; విహితానుస్వారస్యైవ రేఫనిషేధ ఇతి। నైషదోషః। సిద్ధస్యైవానుస్వారస్య బోధనం, న తు విధిరితి। ఋతపా . .। అతీతి కి ꣳ। షడ । తేన్ । అꣳహ। అꣳహేత్యేతావతా సిద్ధేః కుతః సకల పదపాఠః। స రన । ఇత్యాది నిషేధార్థః। పరి । షట్ । త్వయా । భువేతి కిం? అꣳశేత్యేతావతా గ్రహణే తథా విధపద సద్భావాత్ "అꣳశం" ఇత్యత్ర న స్యాత్। తేనా । అన్వాకారాది (1-5।) ఇతి వచనాత్ అనꣳశు । ఇత్యప్యుదాహరణమ్। వృష్ణో .। ప్రాణా । అꣳశు . । యమా । అꣳశూ । అꣳశు । యోవా । అꣳశా । ఉపా ꣳ । తము. ..। అꣳశ్విత్యేతావతి గృహీతే ఇతరేషామపరిగ్రహః స్యాత్, తథా విధపద సద్భావాత్। అథోభయం గృహ్యతే పదమేకదేశశ్చ కిꣳశిల వత్॥ తథాపి పదైకదేశేషు "పశుం...." ఇత్యాదిషు ప్రాప్నుయాదనుస్వారాగమః। తచ్చానిష్టమ్। ఆదిరితి కిమ్। సర్వేషు స్థానేషు మా భూదితి॥ యథా— అꣳహసః ఇత్యాది॥

ఆదిః। అꣳహతిః। అꣳహః। అꣳహో। అꣳహోముక్। అత్యꣳహః। అꣳహసః। అꣳహసా। అꣳశం। అꣳశుభిః। అꣳశభువా। అꣳశు। అꣳశూ। అꣳశవః। అꣳశుః। అꣳశుం। అꣳశూన్। అꣳశునా। అꣳశోః। అꣳశాయ। ఉపాꣳశు। అꣳశౌ। అవగ్రహే॥

మణిప్రభ :— ఈ సూత్రముచే 21–పదములందు అనుస్వారము విధింపబడుచున్నది.

అꣳహతిః, అꣳహః . మొదలగు ఈ 21–పదముల అందలి ఆదిః= తొలియచ్చు (తనకంటె పరమందు) అనుస్వారమును ఆగమముగ పొందును. అనగ "ఈ పదములందలి తొలి అచ్చుకంటె పరమగు ఊష్మ వర్ణమునకు పూర్వమందు అనుస్వారమాగమముగ వచ్చు"నని సూత్రార్థము.

ఈ సూత్రమునందు చెప్పినవన్నియు పూర్తి పదములె. ప్రాతిపదికలు గాని, పదైకదేశములు గాని కావు. అందుచే ఈ సూత్రముచే విధింప

బడిన అనుస్వారము ఈ పదములకే వచ్చునుగాని, ఇతర విభక్తి రూపముల యొక్క పదైకదేశమునందు వర్తించదు. ఈ సూత్రమందు "అంహ" అను దానిని చెప్పి, మరల అంహః, అంహమ్, అంహనా ఇత్యాది విభక్త్యన్త పదములను చెప్పుటను బట్టి, ఆ విషయము తెలియుచున్నది. ఇంకను కొన్ని విషయములు ఆయా ఉదాహరణ స్థలములందు వివరింపబడును. ఇకనిపుడు ఉదాహరణను చూతము :

| | | |
|---|---|---|
| 1 అంహతిః | పరిద్వేషసో అంహతిః . | (2-6-11) |
| 2 అంహః | అంహోముచం వృషభం . | (1-6-12) |
| | నైనమంహో అశ్నోతి | (3-4-12) |
| 3 అంహోః | అంహోశ్చిద్యా | (1-4-22) |

సూత్రమందు అంహోః అని ఓకారాన్త పదమును చెప్పుటచే, ఈ ఓకారము విసర్గ రూపము కాదని తెలియును. అనగ "అహ" అను ఆనుపూర్వి కంటె యుండు విసర్గ, రేఫగ మారదో ఆ స్థలములందే ఈ సూత్రము వర్తించును. విసర్గ రేఫగ మారునట్టి స్థలములందీ యనస్వారము రాదని గ్రహించవలెను. ఉదాహరణకు అహర్దేవానాం . (అహః దేవానామ్) (1-5-9); అహరహః ఇత్యాదులు. ఈ విషయము వివరముగ తర్వాత చెప్పబడును.

| | | |
|---|---|---|
| 4 అంహోముక్ | అంహో ముగ్వా్యం ద్వికపాలః | (7-5-22) |
| 5 అత్యంహాః | ఋతపశ్వా త్యంహాః | (1-8-13) |

అహాః పూర్వమందు "అతి" అని యున్ననె అనుస్వారము వచ్చును. లేనిచో రాదు. ఉదాహరణకు షడహో భవన్తి (7-5-1) అను స్థలములందు "హాః"కు పూర్వమందనుస్వార రాలేదు. గమనింపుము.

| | | |
|---|---|---|
| 6 అంహసః | తేనో ముఞ్చత మంహసః | (4-7-15) |
| 7 అంహసా | అంహసా వా ఏష గృహీతః . . | (2-4-2) |

ఈ ఉదాహరణలను పరిశీలించగ సర్వత్ర "అహ" అను ప్రాతిపదికను గ్రహించి, సూత్రమందు విధించిన పరిపోవును గదః ప్రతిపద పాఠమనవసరము గదః అట్లు కాదు. "స రసమహావసన్తాయ" (7-2-10) అను స్థలముల లోని "అహః" లో అనుస్వారమును వారించుటకై ప్రతిపదపాఠము చెప్ప బడినది.

| | | |
|---|---|---|
| 8 అꣳశమ్ | పరిపశ్యామోꣳశమ్ . | (7-1-6) |
| 9 అꣳశుభిః | షడ్భిరꣳశుభిః పవయతి | (6-4-5) |
| 10 అꣳశభువా | త్వయాꣳశ భువా సోమం | (6-4-8) |

"భువా" అని ఎందుకు? కేవలము "అꣳశ" అని మాత్రమె గ్రహించినచో, అట్టి వ్యస్తపదము వేరొకటి యున్నందున ఆ పదమందే అనుస్వారము సిద్ధించును. మరియు "అꣳశమ్" ఇత్యాదులందు ప్రాప్తించకపోవును. మరియు "భువా" అనుదానిని పరమందు కలిగిన "అꣳశ" యందే అనుస్వారము సిద్ధించవలెను. కేవలము "అꣳశ" అనుచోట సిద్ధించరాదని గ్రహించవలెను. [భువేతి కిం? అవ క్రామన్నꣳశ స్తీః .1 (4-1-2). అంశేత్యకారాన్త పదగ్రహణ మశక్యం విజ్ఞాతుమితి అతివ్యాప్తి పరిహారాయ భువేత్యుపబన్ధః — అని వైదికాభరణ వివరణము.]

11 అꣳశు తేనాꣳశుమత్ (3-2-2)

అనాక్రారాదిః (1-5-3) అను సూత్రముచే అనꣳశుకుర్వన్తః (3-2-2) అనునది కూడ ఉదాహరణమే అగును.

| | | |
|---|---|---|
| 12 అꣳశూ | వృష్ణో హ్యేతావꣳశూ | (6-4-5) |
| 13 అꣳశవః | ప్రాణా వా అꣳశవః . | (6-4-4) |
| 14 అꣳశుః | అꣳశురꣳశుస్తే | (1-2-11) |
| 15 అꣳశుమ్ | యమాదిత్యా అꣳశుం. | (2-3-5) |
| 16 అꣳశూన్ | అꣳశూనవ గృహ్ణన్తి | (2-3-5) |
| 17 అꣳశునా | అꣳశునాతే అꣳశుః | (1-2-6) |
| 18 అꣳశోః | యోవా అꣳశోరాయతనమ్ . | (6-6-10) |
| 19 అꣳశాయ | అꣳశాయ స్వాహా భగాయ . | (1-8-13) |
| 20 ఉపాꣳశు | ఉపాꣳశు సవనో యదుపాꣳశు సవనం | (2-3-5) |
| 21 అꣳశౌ | తముపాꣳశౌ సమస్థాపయన్ | (6-4-6) |

సూత్రమందు అꣳశూ, అꣳశవః ఇత్యాది పదములనన్నిటిని గ్రహించుటకంటె అశు (అꣳశు) అని చెప్పుట చాలదా యని సందేహము. కేవలము "అꣳశు" అని మాత్రమే చెప్పినచో అట్టి స్వతంత్ర పదము ఒకటి యున్నది. కనుక దానిచే ఇతర పదములు గ్రహించబడవు. అందుకని ప్రతిపద పాఠము చేయబడినది.

మరియు 'అశ్' అను సామాన్య రూపముచే గ్రహించినచో అశ్యామ (1–3–14), అశ్నుతే (6-4-1), అశీమహి (5-7-2) ఇత్యాది స్థలములందు కూడ తొలి స్వరము కంటె ఊష్మ పరముగ నున్నది కనుక, అచటను అనుస్వారాగమముగ వచ్చును. ఇది ఇష్టము కాదు. కనుక నిట్టివానిని వారించుటకై ప్రతిపద పాఠము చేయబడినదని గుర్తించవలెను.

ఇక సూత్రమందు ఆదిః (తొలి స్వరముకంటె) అని చెప్పుటచే, అంహసోఽ ంహసా (1-6-12) ఇత్యాది స్థలములలో ద్వితీయ స్వరముకంటె (అనగ హకారముకంటె మున్న 'అ' తర్వాత) అనుస్వారాగమము నిషేధింపబడుచున్నది.

పాఠాంతర పరిశీలనము :

శ్రీ R రామశాస్త్రి, శ్రీ K రంగాచార్యవారిచే సంపాదింపబడి, "మోతీలాల్ బనారసీదాస్" సంస్థవారిచే 1985వ సంవత్సరమున ప్రకటించబడిన తైత్తిరీయప్రాతిశాఖ్య యందు ఈ సూత్రమున చివరి పదముగ "అవగ్రహే" అని యున్నది. కాని విట్నీ పండితునిచే పరిష్కరింపబడి, ఇదే సంస్థచే 1973-వ సంవత్సరమున ప్రకటించబడిన ఆంగ్ల గ్రంథమున "అవగ్రహే" అను పదమీ సూత్రమున లేదు. కాని దీని తర్వాతనున్న సూత్రముయొక్క మొదటి పదముగ "అవగ్రహే" అని యున్నది. అతను సంపాదించిన త్రిభాష్య రత్నకారుని వ్యాఖ్యయందీ పదము "ఆదిః" అని వివరింపబడినది.

కాని సంస్కృత లిపియందు 1985 నే ప్రకటించబడిన ఈ ప్రాతిశాఖ్య యందీ సూత్రమున (29-వ సూత్రమున) ఆదియందు "అవగ్రహే" అని లేదు. కనుక త్రిభాష్యరత్న వ్యాఖ్యయు లేదు.

వైదికాభరణకర్త సంపాదించిన తైత్తిరీయ ప్రాతిశాఖ్యయందలి యీ సూత్రమున (సూత్రము-28) చివరి పదముగ "అవగ్రహే" అని యున్నది. కనుక దానికి వారి వ్యాఖ్యయందు "అవగ్రహే" అని లేనిచో తేనాంశుమత్ (అంశుమత్), ఊపాంశుపాత్రే.... ఇత్యాది స్థలములలో అవగ్రహ యందున్న "అంశు"లో అనుస్వారము సిద్ధించదు. మరియు ఊపాంశు

యజతి,... (1-5-2); ఉపాం సౌ....(6-4-6) అను స్థలములందే అనుస్వార సిద్ధించును. కనుక అవగ్రహ స్థలములలో కూడ అనుస్వార సిద్ధికై సూత్రమున "అవగ్రహే" అని చెప్పవలెను — అని వివరించిరి. [28]

సూత్రము 29. అవగ్రహాదుదాత్తోఽం సేఽం సాయాం సాఖ్యాము సావితి॥

త్రిభాష్య :- అవగ్రహః ఆదిరిత్యర్థః। యది పదాదిరుదాత్తః స్యాత్తర్హి అం సే, అం సాయ, అం సాఖ్యాం, అం సా ఇత్యేతేషు స్యాదనుస్వారాగమః। ఇతి శబ్దః స్వరూప వాచీ। యథా దక్షి...। శిత్యం ....। అం సా ...। ఉత్త॥ అదిరుదాత్త ఇతి కిం? అసా....॥

అవగ్రహః। ఉదాత్తః। అం సే। అం సాయ। అం సాఖ్యామ్। అం సౌ ఇతి॥

మణిప్రభ :- అవగ్రహః=ప్రారంభమందున్న, ఉదాత్తః ఉదాత్తము; ఇతి అనునది "ఈ పదములకు" అని పద నిర్దేశము చేయును. కాగ

అసే, అసాయ, అసాఖ్యాం, అసౌ అను ఈ పదములలో తొలి యచ్చు (అకారము) ఉదాత్తమగుచో దానికంటె నున్న ఊష్మకు పూర్వమందు అనుస్వారంమాగమముగ వచ్చును — అని సూత్రార్థము. ఉదాహరణలు :

| | |
|---|---|
| అం సే | దక్షిణేఽం స ఉపదధాతి . (5-3-1) |
| అం సాయ | శిత్యం సాయ స్వాహా . (7-3-17) |
| అం సాఖ్యామ్ | అం సాఖ్యాం స్వాహా .. (7-3-16) |
| అం సౌ | ఉత్తరేఽం సావేవ ప్రతిదధాతి (5-3-1) |

సూత్రమున "అవగ్రహాదుదాత్తః" అని చెప్పుటచే అసావబ్రవీచ్చిత్ర విహితా (2-5-2), అసావాదిత్యః (2-1-4) అను స్థలములలో తొలి అక్షరము ఉదాత్తము కాదు కనుక, దానికంటె పరముగ నున్న ఊష్మకు పూర్వమందు అనుస్వారాగమము వారింపబడినది. సూత్రము "ఈ పదములకు"

అని నిర్దేశించుటచే పదైకదేశములందు అనగ జీవసే, అపేశసే ఇత్యాదులలో "సే" కంటె పూర్వమందు అనుస్వారము వారించబడినది. [29]

సూత్రము 30. నాసావా నాసావా॥

త్రిభాష్య :- అద్యుదాత్తే సత్యవ్యసావేత్యస్మిన్గ్రహణే న ఖలు స్యాదనుస్వారాగమః। బ్రూ యా... ॥

న। అసావా॥ (నాసావా).

మణిప్రభ :- "అసావా" అనునది ఆజ్–ను పరమందు గల్గిన అసౌ యొక్క రూపము. అసౌ + ఆ— అసావ్ + ఆ— అసావా. పూర్వసూత్రముల నుండి "ఆదిరుదాత్తః" అనుస్వారాగమః, ఊష్మపరః అనునవన్నియు అనువృత్తి వచ్చును. కాగ— "అసావా" అనునది ఆద్యుదాత్తమైనను ఊష్మకు పూర్వమందు అనుస్వారాగమము రాదు— అని సూత్రార్థము.
ఉదాహరణ : బ్రూయాదసావేహీత్యేవమ్ . (3-4-9).

ఆద్యుదాత్తమగు "అసౌ" శబ్దమునకు అనుస్వారాగమము పూర్వసూత్రముచే సిద్ధించుచున్నను, ఆజ్‌ను పరముందు కల్గియున్నచో ఆ అనుస్వారాగమము ఈ సూత్రముచే నిషేధింపబడినది. సంహిత మొత్తమంతట యందు నిదొక్కటియె ఉదాహరణము. నాసావా, నాసావా అను ద్విరుక్తి అధ్యాయ పరిసమాప్తిని సూచించును. [30]

కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ ప్రాతిశాఖ్యకు
త్రిభాష్య రత్నానుసారము వేదులోపనామక
సుబ్రహ్మణ్యముచే వ్రాయబడిన "మణిప్రభ"
అను ఆంధ్ర వివరణమున పదునారవ అధ్యాయము
సమాప్తము.

— o —

# అధ్యాయము–17

ఉచ్చారణ విధి. సూత్రములు–8.

సూత్రము 1. తీవ్రతరమానునాసిక్యమానుస్వారోత్తమేష్వితి శైత్యాయనః॥

త్రిభాష్య.– అనుస్వారశ్చ ఉత్తమాశ్చ అనుస్వారోత్తమాః। తేషు తీవ్రతరం భవతి ఆనునాసిక్యమితి శైత్యాయనః నామ మునిర్మన్యతే। తీవ్రాదధికం తీవ్రతరమ్। అనునాసికానాం భావః ఆనునాసిక్యమ్। నాసికా వివరణాదాను నాసిక్యమ్ (2-52) ఇత్యస్య విధేః ప్రయత్నదార్ఢ్య ముపదిశ్యతే। యథా— అగ్నిః ర । యం కామ । మఞ్చతే ..। మణినా । ఏతేష్వితి కిమ్? రుక్మ । తిగ్మ ..। సుశ్లో ॥

తీవ్రతరమ్। ఆనునాసిక్యమ్। అనుస్వారోత్తమేషు। ఇతి। శైత్యాయనః॥

మణిప్రభ :– తదేవం పదవర్ణానాం ప్రాయశో నిర్ణయః కృతః।
తదుచ్చారణ కల్పోఽత ఊర్ధ్వం ప్రాయేణ వర్ణ్యతే॥

అని వైదికాభరణ కర్త చెప్పెను. అనగ ఇంతవరకు సంహితయందలి పదముల యొక్కయు, అక్షరముల యొక్కయు నిర్ణయము విశేషముగ చెప్పబడినది. ఇక నీయధ్యాయము నుండి పూర్వోక్తములగు పద, వర్ణముల యొక్క ఉచ్చారణ విధి వివరింపబడును— అని భావము. కాగ ఇకనీ చెప్పబోవు అధ్యాయములందు సంహితయందలి మంత్ర పాఠ విధి–విధానములు తెలియచేయబడుచున్నవని గ్రహించవలెను.

అనునాసిక్యమనగ నాసికారంధ్రములనుండి ఉచ్చారణ ధ్వని వంపుట వర్ణము ధ్వని రూపము గద. అట్టి ధ్వని నోటిద్వార బయటకు పోవును కాని దానిని నాసికారంధ్రములగుండ బయటకు వంపుటను ఆనునాసిక్యమందురు. దానికి ప్రయత్నము సామాన్యము కంటె దృఢముగ నుండును. ధ్వని గూడ వేరుగ నుండును.

తీవ్రతరమనగ అధికమగు తీవ్రత. తర, తమ అనునవి ఆధిక్యతయందలి స్థాయిని తెల్పు ప్రత్యయములు. "తర" అనునది రెండింటి (రెండు

వస్తువుల) మధ్య మాత్రమే, అందలి ఒకదానియొక్క అధిక్యతను తెల్పును కాగ సామాన్యమగు దానికంటె కొంచము ఎక్కువగ నుండుటను తీవ్రతం మందురు.

వర్గపంచమాక్షరములకు "ఉత్తమాః" అని సంజ్ఞ. అనగ అనునాసి కాక్షరములు. కాగ—"అనుస్వారమును, అనునాసికాక్షరములను పలుకునపుడు బయల్వెడలునట్టి అనునాసిక్యము తీవ్రతరముగ నుండును" అని ఆచార్య శైత్యాయనుల సిద్ధాంతము." ఉదాహరణలు —

1 అగ్నిః రఫ్సుషదః। (5-3-1), 2 యం కామం కామయతే। (7-1-1) 3 వఞ్చతే పరివఞ్చతే స్థాయూనామ్ । (4-5-3); 4 మణినా రూపాణిద్వైః। (7-3-14).

అయితే, ఈ సూత్రము ఆమోదయోగ్యము కాదని వ్యాఖ్యాకారులు స్పష్టము చేసిరి. [ ]

సూత్రము 2. సమః సర్వత్రేతి కౌహళీపుత్రః॥

త్రిభాష్య :– సర్వత్ర అనునాసిక్య వర్ణేషు తీవ్రతరత్వం సమమితి కౌహళీ పుత్రో మన్యతే। యథా— సః రరాణ। సంయత్తాః। వ్యజ్ జగ్నిః। ఉప హూతాం-4 హో ఇత్యాహ। ఇత్యాది॥

సమమ్। సర్వత్ర। ఇతి। కౌహళీపుత్రః॥

మణిప్రభ :– పూర్వసూత్రమందు అనుస్వార, అనునాసిక వర్ణ విషయము చెప్పబడినది. అయితే అనునాసిక్యమునకు తీవ్రతర ప్రయత్నం ఆ వర్ణో చ్చారణమందే గాక, ఏ వర్ణమునునాసికా వివరము ద్వార ఉచ్చరించుటకు ప్రయత్నింతురో, అట్టి అన్ని వర్ణముల విషయమున ప్రయత్నము తీవ్ర తరముగ నుండునని కౌహళీ పుత్రుడను ఆచార్యుని అభిప్రాయము. ఈ ఆచార్యుని పేరు భిన్న మాతృకా గ్రంథములలో భిన్నముగ నున్నదని విట్నీ పండితుడు చెప్పెను. ఉదాహరణకు కౌహలీయపుత్రః। కోహలిపుత్రః॥

ఇక సూత్రమునకు లక్ష్యములుగ సః రరాణ (4 6-1); సః యత్తాః (1-5-1) మున్నగునవి చెప్పబడెను. [౭]

సూత్రము 3. అనుస్వారేఽణ్వీతి భారద్వాజః॥

త్రిభాష్య :- అణుః సూక్ష్మతమం, ఆనునాసిక్యం అనుస్వారే స్యాదితి భారద్వాజః మన్యతే। యథా— తను । అనుస్వారాదన్యత్ర శైత్యాయన విధిః ఉత్తమేషు తీవ్రతరత్వం యమాదిషు తీవ్రమాత్రమితి॥

అనుస్వారే। అణుః ఇతి। భారద్వాజః॥

మణిప్రభ :- అణువనగ సూక్ష్మతమమని అర్థము. అనగ మిక్కిలి తక్కువ. ఇక భారద్వాజుని మతమునందు "అనుస్వారోచ్చారణమందలి ఆనునాసిక్య ప్రయత్నము మిక్కిలి తక్కువగ (అత్యల్పముగ) నుండును". అనుస్వా। రము కాని స్థలములలో అనగ వర్గపంచమాక్షరములనుచ్చరించుటలో శైత్యాయనుని మతము సమ్మతమని త్రిభాష్య రత్నకారుల అభిప్రాయము. తీవ్రతరము— మధ్యమ ప్రయత్నము, తీవ్ర ప్రయత్నమును ప్రాథమిక ప్రయత్నమందురు. తీవ్రతర ప్రయత్నమును మధ్యమ ప్రయత్నమందురు. తీవ్రతమ ప్రయత్నమును ఉత్తమ (రూక్ష) ప్రయత్నమందురు. ఇక ఉదాహరణలు : తనువా జయత్వ ం నత్వా. ।। (4-6-6) [3]

సూత్రము 4. నకారస్య రేఫోష్మయకార భావాల్లుప్తే చ మలోపా
చ్చోత్తర ముత్తరం తీవ్రతరమితి స్థవిరః కౌణ్డిన్యః॥

త్రిభాష్య .- 'నకారస్య' 'రేఫోష్మ యకారభావాత్', 'చకారాత్కృష్ట యకారే' "లుప్తే" సతి, మలోపాచ్చ ఉత్తరముత్తరం ఆనునాసిక్యం ఆనుపూర్వ్యేణ తీవ్రతరం స్యాదితి స్థవిరః కౌణ్డిన్యః మన్యతే। యథా— సత్రీ ం రేకాదశాన్ ...; ఇత్యత్ర ఆనునాసిక్యం సంయోగమాత్రవత్। శుక్లా ం ఇత్యత్ర తు సంశ్లిష్టమ్। మహా ం ... ఇత్యత్ర తీవ్రతరమ్। స ం ఇత్యత్ర తీవ్రతమ మిత్యాను పూర్వ్యేణ విజ్ఞేయమ్। అన్యత్ర శైత్యాయన విధిః॥

నకారస్య। రేఫోష్మ యకారభావాత్। లుప్తే। చ। మలోపాత్॥
చ। ఉత్తరమ్। ఉత్తరమ్। తీవ్రతరమ్। ఇతి। స్థవిరః। కౌణ్డిన్యః

మణిప్రభ :- ఆనునాసిక్యము వచ్చెడి మరికొన్ని స్థలములందలి ప్రయత్న

మును గూర్చి ఈ సూత్రము వివరించుచున్నది. అధ్యాయము 15 న ప్రథమ సూత్రమందు "పదాన్త నకారము రేఫోష్మ యకారములుగ మారును, అట్టి యకారము లోపించినను, పదాన్త మకారము లోపించినను వీనికి పూర్వమందున్న స్వరమునకు అనునాసిక్యము వచ్చు" నని చెప్పబడినది. అట్టివానికి క్రమముగ ముందుదానికంటె తర్వాతనున్న దానియందు స్థానీయానునాసిక్య ప్రయత్నము అదే అనుపూర్విలో క్రమముగ, తీవ్ర, తీవ్రతర, తీవ్రతమాది ఆధిక్యతను కలిగియుండునని సూత్రార్థము. ఇక ఉదాహరణములు :—

1 సత్రీఁ రేకాదశాన్ (?-2 11)॥ ఇచట త్రీన్‌లోని నకారము రేఫగ మారగ, పూర్వ స్వరమునకు కల్గు అనునాసిక్యము సంయోగ్రమాత్రము వంటిది. అనగ అతి స్వల్పము.

2 శుక్లాఁ శ్చ కృష్ణాఁ శ్చ (2-3-1)॥ ఇచట ఊష్మకు పూర్వమందున్న స్వరమందలి అనునాసిక్యము సంక్లిష్టమాత్రము. తీవ్రమని భావము.

3 మహాఁ ఇన్ద్రః (1-4-20)॥ ఇచట యకారము లోపించగ, పూర్వమందున్న "హా" యందలి స్వరమునకు వచ్చు అనునాసిక్యము తీవ్రతరముగ నుండును.

4 సఁ శితమ్ . (4-1-10)॥ ఇచట మకారము లోపించగ, స–లోని స్వరమునందలి అనునాసిక్యము తీవ్రతమము అని గ్రహించవలెను.

ఈ స్థలముల కంటె ఇతరత్ర వచ్చు అనునాసిక్యము సమస్థాయిలో నుండునని వైదికాభరణ కర్త, స్థవిర కౌణ్డిన్య మతముగ చెప్పెను. అట్టి ఇతర స్థలములు —

యు త్తన్న విస్రఁ సయేత్ (6-2-9).
శో ఁ సోమోద ఇవ (3-2-9).

ఇవి మాహిషేయ భాష్యమందిచ్చిన ఉదాహరణములు. [4]

సూత్రము 5. వ్యఞ్జనకాలశ్చ స్వరస్యాత్రాధికః॥

త్రిభాష్య :– చకారః స్థవిరకౌణ్డిన్యమన్వాదిశతి। అత్ర–అనుస్వార విధానే, స్వరస్య–సానునాసిక స్వరస్య, వ్యఞ్జనకాలః హ్రస్వార్ధకాలః అధికః స్యాదితి స్థవిరః కౌణ్డిన్యో మన్యతే। యథా— యుఞ్జాథాఁ . । ఇత్యాది। అత్రేతి

స్వరస్యేతి కిం? ప్రాదిషూత్తమేషు ఉత్తమలాభావే చైతదధిక కాల విధానం మా భూదితి॥

వ్యఞ్జనకాలః। చ। స్వరస్య। అత్ర। అధికః॥

మణిప్రభ :— అనునాసిక్యమును కలిగిన స్వరము యొక్క ఉచ్చారణ కాల మిచట చర్చింపబడుచున్నది. సాధారణముగ స్వరము (హ్రస్వము) ఏక మాత్రాకాలికము. దీర్ఘము ద్విమాత్రాకాలికము. ఈ సూత్రమందలి "చ" పూర్వసూత్రమునుండి "స్థవిరః కౌణ్డిన్యః" అనుదానిని అన్వాదేశముచేయును. కాగ— "స్థవిర కౌణ్డిన్యుని మతమునననుసరించి అనునాసిక్యమును పొందిన స్వరము ఉచ్చారణయందు ఇంకొక అర్ధమాత్రా కాలమును అధికముగ కలిగి యుండును. ఆ స్వరము హ్రస్వమైనచో ఉచ్చారణ కాలము ఒకటిన్నర మాత్రలు; దీర్ఘమగుచో ఉచ్చారణ కాలము రెండున్నర మాత్రలు, ప్లుత మగుచో మూడున్నర మాత్రలు" అని భావము. [5]

సూత్రము 6. స్వార విక్రమయోర్దృఢ ప్రయత్నతరః పౌష్కర సాదేః॥

త్రిభాష్య :— స్వారే విక్రమే చ ప్రయోగః పౌష్కరసాదేః మతే దృఢ ప్రయత్నతరః భవతి। స్వారః స్వరిత ఇత్యర్థః। విక్రమోనామ అనుదాత్త విశేషః। యథా— యోऽస్య । ఆస్యే । స్వార విక్రమయోరితి కిం? గాంవావ .। దృఢః ప్రయత్నః యస్యాసౌ దృఢప్రయత్నః॥ అతిశయేన దృఢ ప్రయత్నః దృఢ ప్రయత్నతరః॥

స్వారవిక్రమయోః। దృడ ప్రయత్నతరః। పౌష్కరసాదేః॥

మణిప్రభ :— కొన్ని వర్ణముల నుచ్చరించుట యందు, చేయువలసిన ప్రయత్న స్వభావమును, పౌష్కరసాదుల మతమునననుసరించి యెట్లుండునో ఈ సూత్రమున చెప్పుచున్నారు—

స్వారః = ఒక విధమగు స్వరితము, విక్రమః = ఒక విధమగు అను దాత్తము. దీని స్వరూపము అధ్యాయము 19-1వ సూత్రమున చెప్పబడును. కాగ— "అట్టి స్వరితమును, విక్రమమును (అట్టి అనుదాత్తమును) ఉచ్చరిం

చుటకు మిక్కిలి గట్టి ప్రయత్నము (దృఢతర ప్రయత్నము) చేయవలసి యుండునని ఆచార్య పౌష్కరసి మొదలగువారి అభిప్రాయము" ఉదాహరణలు :

స్వారః— యోఽస్య స్వోఽగ్నిః (5-7-9)
న దివ్యగ్నిశ్చేతవ్య ఇతి... (5-2-7)
విక్రమః — ఆస్యే హలిః ప్రియమ్.. (3-3-11)
యోనిశ్చికత్యం యచ్చికర్యాత్... (5-6-9)

దృఢమగు ప్రయత్నమును కల్గిన వర్ణము దృఢ ప్రయత్నః॥ ఆ దృఢ ప్రయత్నమునధికముగ కల్గినది దృఢ ప్రయత్నతరః॥ [6]

సూత్రము 7. ప్రయత్నవిశేషాత్సర్వవర్ణానామితి శైత్యాయనః॥

త్రిభాష్య :– సర్వ వర్ణానాం ప్రయోగస్స్వోచిత ప్రయత్న విశేషాత్ దృఢ ప్రయత్నతరో భవతీతి శైత్యాయనః మన్యతే। యథా— ఇషేత్వా.. ॥ ఇత్యాది। నైతాని సప్తసూత్రాణీష్టాని॥

ప్రయత్నవిశేషాత్। సర్వవర్ణానామ్। ఇతి। శైత్యాయనః॥

మణిప్రభ :– ఉచ్చారణయందు వర్ణ వైవిధ్యము, హృదయము నుండి వెలువడు శబ్దము వతవగు స్థానమున బట్టియు, అట్లు భిన్న స్థానములందు ఆ శబ్దము పడుటకు మనము చేయు కరణ ప్రయత్నములపై ఆధారపడి యుండును. కనుక ఇపుడు శైత్యాయనాచార్యులు "సర్వ వర్ణములను దృఢముగనో, దృఢ తరముగనో, దృఢ తమముగనో ప్రయోగించుట ఆయా ప్రయత్న విశేషములపై ఆధారపడి యుండును"– అని వివరించుచున్నారు.

నిజమునకు పూర్వమందలి ఆరు సూత్రములలో చెప్పినదానికిని, ఇపుడు చెప్పినదానికిని ఎక్కువ భేదము లేదు. కాని వారు (పూర్వసూత్రము లందు) కొన్ని వర్ణముల విషయమును చెప్పిరి. ఇతడు అన్ని వర్ణములకు అనువగు ప్రయత్నదార్ఢ్యము చేయవలెనని చెప్పెను. ఉదాహరణ :

ఇషేత్వా (1-1-1). [7]

తైత్తిరీయ సంహితా విషయమున నీ యేడు సూత్రములును అనర్థక ములె అని త్రిభాష్యరత్న, వైదికాభరణ వ్యాఖ్యాకారులు చెప్పిరి. అయితే మాహిషేయుడు మాత్రము అట్టి అభిప్రాయమును ఏ సూత్ర విషయమునను చెప్పలేదు.

సూత్రము 8. నాతివ్యక్తం న చావ్యక్తమేవం వర్ణానుదీరయేత్।
పయః పూర్ణమివా మత్రం హరన్ధీరో యథామతి॥
ఇత్యాత్రేయః ఇత్యాత్రేయః॥

త్రిభాష్య :- అతివ్యక్తం అతిస్పష్టం, అవ్యక్తం అస్పష్టం చ యథా నే భవతి ఏవం వర్ణాన్ ఉదీరయేత్ ఉచ్చారయేదిత్యర్థః। పయః పూర్ణమివా మత్రం క్షీరపూరిత భాజనం హరన్నివ యథామతి, మతిమనతి క్రమ్య వర్త మానః ధీరః అధ్యేతా భవేత్ ఇత్యాత్రేయః మన్యతే॥

న। అతివ్యక్తమ్। న। చ। అవ్యక్తమ్। ఏవమ్। వర్ణాన్। ఉదీర యేత్। పయః పూర్ణమ్। ఇవ। అమత్రమ్। హరన్। ధీరః। యథామతి। ఇతి। ఆత్రేయ। (ఇత్యాత్రేయః)॥

మణిప్రభ :- పూర్వ సూత్రములందు చెప్పిన అనేక మతములను పరిశీ లించి సిద్ధాంతముగ ఈ కారిక చెప్పబడినది. ఇందలి "ఆత్రేయ" పదము పూజావాచకమే గాని, మతాంతరమును చెప్పునది కాదు వర్ణోచ్చారణయం దలి ప్రయత్న విశేషములను గూర్చి శైత్యాయన, కౌహలీపుత్ర, భారద్వాజ, స్థవిర కౌణ్డిన్య, పౌష్కరసాదులు వాదులాడుకొనుచుండగ, ఈ ఆత్రేయుడు మధ్యస్థునిగ వారి వారి వాదనలన్నిటిని పరిశీలించి, తుదకు తీర్పుగ నీ సూత్రమును శ్లోక రూపమున చెప్పెను. కాగ— "వర్ణముల నుచ్చరించు వ్యక్తి, అత్యంత స్పష్టముగను, మిక్కిలి అస్పష్టముగను కూడ వర్ణములను పలుకరాదు. అతడు జాగ్రత్తగ పరిశీలించుకొని, ఆయా సందర్భములను బట్టి వర్ణములను స్పష్టముగను, నిర్దుష్టముగను పలుకుటకెంత ప్రయత్న ము అవసరమగునో, అంతమాత్రపు ప్రయత్నమునే చేయవలెను. సంహిత యందు వర్ణోచ్చారణమున స్పష్టత, నిర్దుష్టతలు ప్రధానము. ప్రయత్న దార్ఢ్యాదార్ఢ్య భావములు గణనకు రావు.

పాత్ర నిండుగ పాలతోనున్న గిన్నెను తీసుకొనిపోవు వ్యక్తి, మిక్కిలి త్వరగ గాని, అతి మందముగగాని నడచుటను గణన చేయడు. అతడు పాలు తొణకకుండ పూర్ణపాత్రను గృహమున చేర్చుటకెంత వేగము వల యునో, అంతమాత్రపు వేగముతోనె పయనించును. అట్లే మానవుడు వేదా ధ్యయనమందు వలయునంత ప్రయత్నదార్ఢ్యతతో వర్ణోచ్చారణ చేయవలెను.

అయితే ఒక విషయమును గమనించవలెను. ఒకరు చేయు తీవ్ర తీవ్రతరాది ప్రయత్నములు వేరొకరికి అల్పాల్పతర ప్రయత్నములుగ నుం డును కద. మరి మధ్యమ ప్రయత్నము మొదలగునవి ఎట్లు పొసగును? నిజమె కాని, ఎవరి ఉచ్చారణయందు వారికి తీవ్ర–తీవ్రతర, తీవ్రతమము లుండును గద. గనుక వారివారి ఉచ్చారణలయందే ప్రయత్న భేదమును స్పష్టముగ ననుసరించవలెనె కాని, ఇంకొకరి ప్రయత్నములతో వీరి ప్రయ త్నములను పోల్చరాదు దీనినే గార్గ్య గోపాలుడు తన వ్యాఖ్యానమున స్పష్టపరచెను. [అత్రేదముచ్యతే। యథామతీతి। యథా ప్రయోక్తుర్మతిర్భ వతి॥ అయమేవ పక్షః సాంప్రతికః ప్రయత్న ఇతి తథా స ప్రయోక్తా స్వ శక్త్యనురూపం ప్రయుఞ్జీత। న తు పరశక్త్యపేక్షయా సాంప్రతికావధారణం సంభవతి"— ఇతి గార్గ్య గోపాల వ్యాఖ్యా].

ఇక, సూత్రమందలి ఇత్యాత్రేయః ఇత్యాత్రేయః అను ద్విరుక్తి అధ్యాయ పరిసమాప్తిని సూచించును. [8]

కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ ప్రాతిశాఖ్యకు
త్రిభాష్య రత్నానుసారము వేదులోపనామక
సుబ్రహ్మణ్యముచే వ్రాయబడిన "మణిప్రభ"
అను ఆంధ్ర వివరణమున పదునేడవ అధ్యాయము
సమాప్తము.



## అధ్యాయము–18

ప్రణవోచ్చారణ విధి. సూత్రములు–7.

ఈ అధ్యాయమున ప్రణవమునుచ్చరించు విధమున గల మతభేదము లను చెప్పుచున్నారు.

సూత్రము 1. ఓంకారం తు ప్రణవ ఏకేఽర్ధ తృతీయమాత్రం బ్రువతే॥

త్రిభాష్య :– ప్రణవే ఓకారమ్। అర్ధతృతీయమాత్రం ఏకే బ్రువతే। ఏకే ఆచార్యాః అర్ధ తృతీయమాత్రమాహుః ఇత్యర్థః। అర్ధం తృతీయం యయో స్తే అర్ధ తృతీయే। అర్ధతృతీయేమాత్రే యస్యాసౌ అర్ధతృతీయమాత్రః। యథా— సముద్రో । యేభ్య.. । ఓం । ఓం ॥ కాలనిర్ణయేప్యేవం వర్ణితమ్—

స్వాధ్యాయారమ్భ శేషస్య ప్రణవస్య స్వరస్య చ।
అధ్యాయస్యానువాకస్యా న్తే స్యాదర్ధతృతీయతా॥ ఇతి॥

తు శబ్దస్య ప్రయోజన ముచ్యతే– "సన్ధ్యక్షరాణాం వేదం చ ప్రణవం చా న్తరా తథా। ఇతి కాలనిర్ణయే; సన్ధ్యక్షరాణాం హ్రస్వా న సన్తి ఇతి॥ పాణినీయేఽపి; ఓకారమాత్రస్య దీర్ఘ కాలో నిరూపితః। ఇహ తు ప్రణవస్థత్వ విశేషణాదసౌ కాలో నిషిధ్యతే।

వేదస్య ప్రణవే తు స్యాత్ సమకాల ద్విమాత్రతా। ఇతి ప్రణవ విశేషే కాలవిశేషః ప్రత్యేతవ్యః॥

ఓకారమ్। తు। ప్రణవే। ఏకే। అర్ధతృతీయమాత్రమ్। బ్రువతే॥

మణిప్రభ :– వేదాధ్యయనమును ప్రారంభించునపుడు ప్రారంభమున "ఓమ్" అని పల్కి, ప్రారంభించవలెను. అట్టి ఓంకారమునకే ప్రణవమని పేరు. "ప్రణూయతే ప్రస్తూయతే ప్రారభ్యతేఽనేన వేదః ఇతి ప్రణవః ఓంకారః" అని వ్యుత్పత్తి।

అట్టి ఓంకారమునందలి "ఓకారము సార్ధ ద్విమాత్రికము" అని కొందరి అభిప్రాయము. అనగ అట్టి ఓకారమునకు ఉచ్చారణ కాలము రెండున్నర మాత్రలు, సాధారణముగ సన్ధ్యక్షరములు దీర్ఘములు కద దీర్ఘోచ్చారణ

కాలము ద్విమాత్రికము. కాని ప్రణవమందలి ఓకారమునకు కాలము రెండు న్నర మాత్రలు. సూత్రమున ఏకే అని చెప్పుటచే అది సిద్ధాంతము కాద నియు, మతాంతరమనియు, ఇది అంగీకారము కాదనియు తెలియును.

ఉదాహరణలు : సముద్రో బన్ధుః ఓమ్.... (7-5-25).
యేభ్యశ్చైన బ్రాహుః ఓమ్ . (3-12-9).
ఓం ఇషే త్వా.... (1-1-1).
ఓం బ్రహ్మ సన్ధత్తమ్ . . (తై . బ్రా. 1-1-1).

గమనిక : సాధారణముగ వేదాధ్యయన ప్రారంభమున చేయు ప్రణ వము త్రిమాత్రా కాలికమగును. అధ్యయన పరిసమాప్తి యందు గాని, మధ్యలో అధ్యాయాన్తము, అనువాకాన్తమును సూచించుటకు చేయు ఓంకా రము సార్ధ ద్విమాత్రికమై యుండుట, తైత్తిరీయ మూలశాఖా సంప్రదా యము.

ఇక సూత్రమందలి తు శబ్దము "సామాన్యముగ ఓకారమునకు గల ద్విమాత్రా కాలమును నిషేధించును." మరియు త్రిభాష్య రత్నకారులు చెప్పిన కాల నిర్ణయమును గ్రంథము, ప్రస్తుతము మనకు లభించు, మాధ వాచార్య కృతమగు కాల నిర్ణయ గ్రంథముకన్న భిన్నమైనది. అది ప్రస్తుతమలభ్యము.

వైదికాభరణకారులు— "బహుశః ఈ సూత్రము వేదాధ్యయన పరి సమాప్తిని (విరతా నిమిత్తస్య = సమాప్తి నిమిత్తస్య) సూచించు విషయ మున, ప్రణవము ద్విమాత్రికమగునా, త్రిమాత్రికమగునా అని సందేహించి, అది సార్ధ ద్విమాత్రికమని చెప్పుకొనుట యుక్తముగ భావించి, ఈ సూత్ర మును చెప్పిరి— అని భావించెను. [1]

సూత్రము 2. ఉదాత్తానుదాత్త స్వరితానాం,
కస్మింశ్చిదితి శైత్యాయనః॥

త్రిభాష్య :- ఉదాత్తానుదాత్త స్వరితానాం మధ్యే "కస్మింశ్చిత్స్వరే" ప్రణవః ప్రయోక్తవ్య ఇతి శైత్యాయనః మన్యతే। యథా— ఓమ్॥

దాత్తానుదాత్త స్వరితానామ్। కస్మింశ్చిత్। ఇతి। శైత్యాయనః॥

సతిప్రశ - పూర్వసూత్రమున ఓంకారమునుచ్చరించుటందలి కాలపరిమితి గూర్చి చెప్పబడినది ఇకనిపుడు అందలి స్వరము విచారింపబడును

ఆచార్య శైత్యాయనులు – "వేదాధ్యయనమందు చెప్పబడు ప్రణవమును ఉదాత్తానుదాత్త స్వరితములను మూడింటియందు, ఏ స్వరముతో నైనను పలుకవచ్చును"— అని అభిప్రాయపడిరి

ఉదా ఓమ్। ఓమ్। ఓమ్॥ [౭]

సూత్రము ౮ ధృతః ప్రచయః కౌణ్డిన్యస్య॥

త్రిభాష్య '– కౌణ్డిన్యస్య మతే ప్రణవో ధృత ప్రచయో భవతి। చతుర్థస్వరో "ధృత ప్రచయః" ఇతి కథ్యతే। నను— "ప్రచయ పూర్వశ్చ కౌణ్డిన్యస్య (19-2)" ఇతివత్ ప్రచయ ఇత్యేతావతైవాలమ్। కిం ధృత శబ్దేన? మైవమ్। పదద్వయే నాప్యనేన నామధేయ మేవాభిధీయతే। తథాహి — అర్థభేదాఽభావేపి ప్రయోగ భేదోఽస్తీతి ప్రయోగ చాతుర్యమాచార్యాః ప్రకటయన్తి। తథా భీమసేనో భీమః, సత్యభామా సత్యా, పిధాన మపిధానం, దీపః ప్రదీపః ఇత్యాది॥

ధృతః। ప్రచాయః। కౌడిన్యస్య॥

మతిప్రశ – స్వర విషయమున ఆచార్య కౌణ్డిన్యుని అభిప్రాయము నిచట చెప్పుచున్నారు

కౌణ్డిన్యుని మతమునననుసరించి ఓకారము ధృతప్రచయ స్వరముతో పలుకవలెను— అని సూత్రార్థము

ప్రచయమనగ— "సంహితయందు స్వరితముకంటె పరమగు ఉదాత్త శ్రుతి గల్గిన అనుదాత్తము" (సూ 21-10)— అని చెప్పబడినది దానినే వివరించగ క్రుష్టాది సప్త స్వరములలో "తృతీయ" మని అందురు ఇది సార్థక సంజ్ఞ క్రుష్ట ప్రథమ ద్వితీయములు ఉత్క్షిప్తములు అనగ ఉచ్చ స్థానీయములు ఉదాత్తములు చతుర్థమన్ద్రాతి స్వార్యములు అపక్షిప్తములు

క నీచ స్థానీయములు అనుదాత్తములు ఇక మధ్యదియగు "తృతీ ము" ఉత్క్షేపణాపక్షేపణలు లేనట్టిది ధృతము అయితే స్వర విషయ న ఇది ఉదాత్త శ్రుతి గల్గియుండును

ఇకనిట్లగుచో ధృతమన్నను, ప్రచయమన్నను సమానమే కద మరి దయ పద ప్రయోగ మెందులకు? నిజమే కాని ప్రయోగ చాతుర్యమును దర్శించుటకే ఆచార్య కాత్యాయనులు అట్లు సూత్రీకరించిరని త్రిభాష్య కారుల వివరణము [3]

సూత్రము 4 మధ్యమేన స వాక్ప్రయోగః ॥

త్రిభాష్య – ప్రయుజ్యత ఇతి ప్రయోగః। "మధ్యమేన ఉచ్చనీచ సమా ర విలక్షణేన ప్రయత్నేన ప్రణవః ప్రయోక్తవ్యః। అత్ర క్వచన వాచస్థానే ప్రయోగః భవతి। "సః ఇతి కౌణ్డిన్యాభిమతః పూర్వోక్తో గృహ్యతే। వాచి ప్రయోగః వాక్ప్రయోగః॥

మధ్యమేన। సః। వాక్ప్రయోగ ॥

మణిప్రభ – ప్రయోగింపబడునది కనుక ప్రయోగము వాక్కునందలి ప్రయోగము వాక్ప్రయోగము అట్టి వాక్ప్రయోగము నందు వచ్చునట్టి ఓం కారమునెట్లు పలుకవలెనన్న ప్రశ్నకు సమాధానముగ మధ్యమేన అని చెప్ప బడినది సూత్రమందలి సః అనునది పూర్వసూత్రమందు కౌణ్డిన్యుని మత ములో చెప్పిన "ధృత ప్రచయః అనుదానిని సూచించును కాగ "వాక్ప్ర యోగమందలి ఓంకారమును మధ్యమ స్వరమగు ధృత ప్రచయముతో—అనగ ఉదాత్తానుదాత్తములకు మధ్యదియగు స్వరముతో—పలుకవలెనని భావము [4]

సూత్రము 6 స్వరితః ప్లాక్షి ప్లాక్షాయణయోః॥

త్రిభాష్య – ప్లాక్షి ప్లాక్షాయణయోః పక్షే ప్రణవః స్వరితః భవతి। నైత త్స్వాత్రి చతుష్టయ మిష్టమ్॥

స్వరితః। ప్లాక్షి ప్లాక్షాయణయోః॥

మణిప్రభ – ప్రణవమందలి ఓకారమును "స్వరిత" స్వరముతో పలుకవలె

నని ఆచార్య ప్లాక్షి, ఆచార్య ప్లాక్షాయణులు చెప్పిరి. వారి మతమున ప్రణవము స్వరితముగ పలుకబడును.

ఇంతవరకు చెప్పిన నాల్గు సూత్రములు (2, 3, 4, 5) తైత్తిరీయ మూలశాఖకు సమ్మతములు గావని త్రిభాష్యకారులనుచున్నారు. [5]

సూత్రము 6. ఉదాత్తో వాల్మీకేః॥

త్రిభాష్య :— వాల్మీకేః మతే ప్రణవః ఉదాత్తః భవతి॥

ఉదాత్తః। వాల్మీకేః॥

మణిప్రభ :— ప్రణవమగు ఓంకారమందలి ఓకారమున ఉదాత్త స్వరముతో పలుకవలెనని వాల్మీకి ఋషి చెప్పుచున్నారు.

ఈ విధముగ నింతవరకు ప్రణవమందలి ఓకారోచ్చారణయందలి స్వర విషయమున శైత్యాయన, కౌణ్డిన్య, ప్లాక్షి, ప్లాక్షాయణ వాల్మీకుల యొక్క అభిప్రాయములు చెప్పబడినవి. [6]

సూత్రము 7. యథా ప్రయోగం వా సర్వేషాం,
యదా ప్రయోగం వా సర్వేషామ్॥

త్రిభాష్య :— యథా ప్రయోగ శబ్దేన ఉదాత్తోఽభిధీయత ఇతి మాహిషేయ పక్షః। ప్రణవం యథా ప్రయోగం వా కుర్యాదితి సర్వేషాం ఋషీణాం మతమ్। వరరుచి పక్షస్తు వక్ష్యతే— "అధ్యేష్యమాణం" "యథా ప్రయోగం" "యథావిధ స్వరం తథా విధేన వా స్వరేణ ప్రణవః ప్రయోక్తవ్యః ఇతి సర్వేషాం మతమితి" యథా— "ఇషేత్వా" ఇత్యనేనాధ్యేష్యమాణేన అనుదాత్తేన ప్రణవోఽప్యనుదాత్తః। అప ఉన్దన్తు ఇత్యుదాత్తే నోదాత్తః। వృద్ధమితి స్వరితేన స్వరితః। నేదం సూత్రమిష్టమ్॥

యథా। ప్రయోగమ్। వా। సర్వేషామ్॥

మణిప్రభ :— ఈ సూత్రమును వేర్వేరు వ్యాఖ్యాతలు వేర్వేరుగ వివరించిరి.

మాహిషేయ వ్యాఖ్యాకారులు "యథా ప్రయోగమ్"=ఉదాత్తస్వరము అని చెప్పిరి. అనగ ప్రణవోచ్చారణము ఉదాత్త స్వరముతోనే చేయవలెను.

ఆచార్య వరరుచి పక్షము ఇట్లున్నది — ప్రారంభింపబోవు సంహితా భాగమున ఆదియందేస్వరముండునో, ఆ స్వరముతోనే ప్రణవము నుచ్చరించ వలెను. అనగ ఆ అధ్యాయము లేక అనువాక ప్రారంభ పదమునకు ఆది యందే స్వరముండునో (ఉదాహరణకు అప ఉద్ధన్తు (1-2-1) — ఇచట అ ఉదాత్తము) ఆ అధ్యాయమును లేక ఆ అనువాకమును ప్రారంభించుటకు పూర్వము చేయబడు ప్రణవోచ్చారణమును ఆ స్వరముతోనే చేయవలెను. అట్లే ఇషేత్వా (1-1-1) ఇచట "ఇ" అనుదాత్తము. కనుక ప్రారంభమున చేయు ప్రణవను కూడ అనుదాత్తమేయగును. అట్లే వృద్ధమ్ (5-1-2) అనుదానిలో ఆదియందు స్వరితము కలదు. కనుక ఇచట చేయు ప్రణవము స్వరిత స్వరముతో చెప్పబడవలెను.

గార్గ్యగోపాలుడు: ఆయా శాఖలకు సంబంధించిన గురువులు వారి వారి సంప్రదాయమునను సరించి, ఎట్లు ప్రణవోచ్చారణ చేసి అధ్యాపనము చేసిరో, ఆయా శాఖీయులు ఆ విధమగు స్వరముతోనే ప్రణవోచ్చారణ చేయ వలయుననునది సర్వ ఋషి మతముగ వివరించిరి.

[తత్తచ్ఛాఖాధ్యాయన పూర్వైః శిష్టతమాః యేన యేన స్వరేణ ఆరమ్భార్థమోంకారం ప్రయుజ్యతే, తేన తేనై వాధ్యాపిత వ్యప స్తయా ప్రయో క్తవ్య ఇతి సర్వేషామాచార్యాణాం మతమ్॥— వైదికాభరణ వ్యాఖ్య].

త్రిభాష్య రత్నకారులు వారి అభిప్రాయమును స్పష్టముగ చెప్పక పోయినను, తన వ్యాఖ్యానమున వరరుచి కంటె అర్వాచీనుడగు మాహిషేయ వ్యాఖ్యను పూర్వముందుదహరించుట చేతను, వరరుచి పక్షస్తు— అని "తు" ప్రయోగముచేతను, ఆతడు మాహిషేయు న్యాఖ్య నాదరించు చుండెనని స్పష్టము.

వీనినన్నిటిని పరిశీలించగ, సంహితాపాఠ ప్రవచన సమయమునందు ప్రణవమునే స్వరముతో పలుకవలెనన్న విషయమున ఏకాభిప్రాయము లేదని తెలియుచున్నది.

వీనినన్నిటిని పర్యాలోచన చేయగ వైదికాభరణ కర్త నిర్ణయమే యుక్తముగనున్నది.

యథా ప్రయోగం। "ఉపదేశం నామ అద్యోచ్చారణమనతి క్రమ్య" అని వివరణము. కనుక వైదికాభరణ కర్త వ్యాఖ్యయే ఉత్తమము. మేమును ఆ వ్యాఖ్యతో నేకీభవించుచుంటిమి.

సూత్రమందలి "వా" ఏవార్థమును చెప్పును మరియు "యథా ప్రయోగం వా సర్వేషామ్" అను ద్విరుక్తి అధ్యాయ పరిసమాప్తిని సూచించును. [7]

కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ ప్రాతిశాఖ్యకు
త్రిభాష్య రత్నానుసారము వేదులోపనామక
సుబ్రహ్మణ్యముచే వ్రాయబడిన "మణిప్రభ"
అను ఆంధ్ర వివరణమున పదునెనిమిదవ అధ్యాయము
సమాప్తము.



# అధ్యాయము–19

విక్రమ కంపములు : సూత్రములు–5.

ఈ అధ్యాయమున మొదటి రెండు సూత్రములందు విక్రమసంజ్ఞ వివరించబడుచున్నది. మిగిలిన మూడు సూత్రములందు "కంప స్వరము" గూర్చి చెప్పబడును.

సూత్రము 1. స్వరితయోర్మధ్యే యత్ర నీచః స్యాదుదాత్తయో ర్వాఽన్యతరతో వోదాత్తస్వరితయోః స విక్రమః॥

త్రిభాష్య :– యత్రస్థలే స్వరితయోర్మధ్యే "ఉదాత్త యోర్వాఽన్యతరతో వా" ఇతి స్వరితోదాత్తయోర్వేత్యర్థః। ఉదాత్తస్వరితయోర్వా మధ్యే 'నీచం' యదక్షరం స విక్రమ సంజ్ఞః భవతి। స్వరితయోర్మధ్యే యథా—యోఽస్య . । ఉదాత్తయోర్యథా— వోఢవే । స్వరితోదాత్తయోర్యథా– ధన్వా । ఉదాత్త స్వరితయోర్యథా— తస్య .। విక్రమ సంజ్ఞాయాః ప్రయోజనం "స్వార విక్రమయోర్పృథ ప్రయత్నతరః" (17–6) ఇతి॥

స్వరితయోః, మధ్యే, యత్ర, నీచమ్, స్యాత్, ఉదాత్తయోః, వా, అన్యతరతః, వా, ఉదాత్తస్వరితయోః, సః, విక్రమః॥

మణిప్రభ :– నీచమునగ అనుదాత్తమగు అక్షరము. కాగ, రెండు స్వరితాక్షరముల మధ్యనుండు అనుదాత్తమగు అక్షరము విక్రమమనబడును. అట్లే రెండుదాత్తముల మధ్యనుగాని, లేక ఉదాత్త స్వరితముల మధ్యగాని, లేక స్వరితోదాత్తముల మధ్యను గాని యుండు అనుదాత్తమగు వర్ణము విక్రమమనఁబడును.

ఉదాహరణలు : యోఽస్యసోఽగ్ని స్తమపి (5–7–9).
ఇచట "స్య" అనునది విక్రమము ఇది రెండు స్వరితముల (యో, సో) మధ్యనున్న అనుదాత్తము (విక్రమము) నకుదాహరణ : వోఢవే (1-6-2) ఇచట "ఢ" విక్రమము.

స్వరితోదాత్తముల మధ్యనున్న విక్రమమునకుదాహరణ :—

ధన్వనాగాః (4-6-6), ఇచట "న్వ" విక్రమము. ఉదాత్త స్వరితముల మధ్యనున్న విక్రమము.

తస్య క్వ సువర్ణో (౨-౬-౫). ఇచట "స్య" విక్రమము.
ఇక విక్రమ సంజ్ఞా ప్రయోజనము: స్వారవిక్రమయోర్ద్రఢ ప్రయత్నతరః (17-6),— అను సూత్రమున విక్రమ వర్ణోచ్చారణయందు దృఢతరమగు ప్రయత్నము చూపవలెనని చెప్పబడినది. [1]

సూత్రము ౨. ప్రచయ పూర్వశ్చ కౌణ్డిన్యస్య॥

త్రిభాష్య:– చ శబ్దో విక్రమ ఇతి జ్ఞాపయతి। కౌణ్డిన్యస్య నుతే ఉదాత్త పరః స్వరితపరో వా ప్రచయ పూర్వశ్చ విక్రమో ఎజ్ఞేయః। ఉదాత్తపరో యథా— పర్యవదతాం యా। స్వరితపరో యథా— ఉపరిష్టాల్లక్ష్మ। ప్రచయః పూర్వో యస్మాదసౌ ప్రచయపూర్వః॥

ప్రచయ పూర్వః। చ। కౌణిన్యస్య॥

మణిప్రభ:– విక్రమసంజ్ఞను విధించుటలో మత భేదమును ఈ సూత్రమందు చెప్పుచున్నారు. సూత్రమందలి చకారము పూర్వ సూత్రమునుండి విక్రమః అనుదానిని ఇచటకనువృత్తి చేయును. అట్లే సూత్ర సామర్థ్యముచే ఉదాత్త పరము, స్వరితపరము, నిచయ అనువానిని ఇచట అధ్యాహారము చేసుకొన వలెను. ఈ విధముగ— "పూర్వమందు ప్రచయమును కలిగి, పరమందు ఉదాత్తమును కాని, స్వరితమును కాని కలిగియున్న అనుదాత్తమునకు విక్రమ సంజ్ఞ వచ్చునని కౌణ్డిన్యాచార్యుల మతము. అనగ వీరి మతమున అనుదాత్తమునకు పూర్వమందు ఉదాత్తము కాని, స్వరితము కాని యుండ వలెనను నియమము లేదు. వీరి మతమున విక్రమమునకు పూర్వమందు ప్రచయ సంజ్ఞ గల్గిన వర్ణముండవలెను.

ప్రచయమనునది (సూ. ౨౨-10, 11) ౨౨వ అధ్యాయమున 1౦-వ సూత్రమున "స్వరితాత్సంహితాయామనుదాత్తానాం ప్రచయ ఉదాత్త శ్రుతిః" అని చెప్పెను. కాగ సంహితా పాఠమున స్వరితముకంటె పరమం దుండు అనుదాత్తమునకు ప్రచయమని పేరు.

ఇక వీరి మతమున విక్రమమునకుదాహరణలు:
ప్రచయ పూర్వము, ఉదాత్తపరము పర్యవదతాం యా (1-7-౨).

ప్రచయపూర్వము స్వరితపరము: ఉపరిష్టాల్లక్ష్మా యాజ్యా. . (2-6-2)
ప్రచయమును పూర్వమందు గల్గినది ప్రచయపూర్వము.
స్వరితమును పరమందు గల్గినది స్వరితపరము.
ఉదాత్తమును పరమందు కల్గినది ఉదాత్తపరము అని చెప్పబడినది [2]

సూత్రము 3. ద్వియమ ఏకే ద్వియమపరే తా అణుమాత్రాః॥

త్రిభాష్య :— యమ శబ్దః స్వరిత పర్యాయః। ద్వౌయమౌ యత్రదేశే నైరన్తర్యేణ వర్తేతే, స "ద్వియమః", తస్మిన్, ద్వియమః పరో యస్మాదసౌ ద్వియమపరః। తస్మింశ్చ త్రియమే సతి యాః స్వరిత ప్రకృతయః తాః సర్వా అన్తతః అణుమాత్రాః అభినిహితా భవన్తీతి ఏకే మన్యన్తే॥ ద్వియమే యథా— తేఽన్న న్యోన్యమ్। ద్వియమపరే యథా— సోఽన్న సోఽన్నభక్ష్య మిమృత॥ అన్తతః ఇతి కథం ప్రతీయతే। పదాన్తే చ తథా కమ్పా అన్తతో నిహతాణుకాః। ఇతి వచనాదితి బ్రూమః॥ నిహతం తు "స్వరిత యోర్మధ్యే యత్ర నీచమ్" (19 1) ఇత్యేతత్సాన్నిధ్యాల్లభ్యతే। శిక్షాచైవం వక్షతి— "నిత్యోఽభి నిహతశ్చైవ క్షైప్రః ప్రశ్లిష్ట ఏవచ। ఏతే స్వరాః ప్రకమ్పన్తే యత్రోచ్చ స్వరితోదయాః॥ శేషస్యోదాత్తతా వాస్యాత్, స్వారతా వా వ్యవస్థయా॥ ఇతి॥ వ్యవస్థా శబ్దేనానేన ద్వివిధః కమ్ప ఉక్తః। సంహితాయాం స్వరిత కమ్పః ఇతర వేదభాగే ఉదాత్త కమ్ప ఇతి యే కమ్పాః ప్రసిద్ధాః తేష్వే తల్లక్షణం న తు కమ్ప విధాయకమ్। అన్యథా— "యోఽపాం పుష్పమ్" ఇత్యాదౌ కమ్పః ప్రసజ్యేత। నేదం సూత్రమిష్టమ్॥

ద్వియమే। ఏకే। ద్వియమపరే। తాః। అణుమాత్రాః॥

మణిప్రభ :— త్రిభాష్య రత్నకారుని మతానుసారము "యమః" అనునది స్వరితమునకు పర్యాయపదము. కాగ ద్వియమౌ=రెండు స్వరితములు, ఆ రెండు స్వరితములును అవ్యవధానముగ (అనగ ఒకదాని ప్రక్క నొకటి) యుండునట్టి పదము ద్వియమము. అట్టిదానియందును, అట్టి ద్వియమ పదమును పరముగ గల్గిన స్వరితము "ద్వియమపర" మగును. దానియందును ఉన్నట్టి తాః=అవి. అనగ స్వరిత ప్రకృతికములగు ఉదాత్తానుదాత్త స్వరములు, అణుమాత్రాః=అణుమాత్రముగ, అనగ హ్రస్వము నుచ్చరించు

టకు పట్టు మాత్రా కాలమున నాల్గవ భాగము కాలమునే నిహతములగునని ఏకే=కొందరు ఆచార్యులు భావించుచున్నారు.

ఆ స్వరితములందలి స్వరితప్రకృతికములన్నియు వాని అంతమందు అనగ చివరి భాగమున నిహతములగును. ఇచట ఒక విషయమును గుర్తించవలెను. ద్వియమమందు పూర్వమందున్న స్వరితమునందలి ప్రకృతికము లందే నిహతత్వము కల్గును. త్రియమ విషయమున పూర్వమందున్న రెండు స్వరితములందున్న ప్రకృతికములకును నిహతత్వము ప్రవర్తించును.

అయితే ఈ ప్రకృతికముల చివరి భాగమునందే నిహతత్వము అణు మాత్రముగ నుండునని ఎట్లు తెలియును? సమాధానము :- "పదాన్తే చ తథా కమ్పా అన్తతో నిహతాణుకాః" అను శిక్షా వాక్యమె ప్రమాణము.

ఈ సూత్రములోని "నిహతత్వము" అనునది పూర్వ సూత్రమునుండి సాన్నిధ్య బలముచే లభించుచున్నది. ఈ నిహతత్వమునే "కమ్పి" మందురు కాగ

ద్వియమమందు పూర్వ స్వరితమందును, త్రియమమందు ముందున్న రెండు స్వరితములందును, స్వరిత ప్రకృతికములకు అణుమాత్రమగు నిహతత్వము సిద్ధించునని కొందరాచార్యుల సిద్ధాంతము" — అని సూత్ర భావము.

ఉదాహరణలు : ద్వియమమందు : తేఽన్యోన్యమ్। (6-1-5)

త్రియమమందు : సోఽన్నో౽న్న భ్యమ్రియత। (6-1-1)

స్వరితములు సప్త విధములుగ నున్నవి కద, ఎట్టి స్వరితములకీ కంపము వచ్చును? అని ప్రశ్నించగ, నిత్య, అభినిహిత, క్షైప్ర ప్రశ్లిష్టములను నాల్గు స్వరితముల విషయముననే ఈ కంపము వర్తించును.

అన్యత్ర స్వరితమందుగాని, ఉదాత్తమందుగాని కంపనము ఉండ వచ్చును. ఈ భావమే "వ్యవస్థయా" అను పదముచే తెలియుచున్నది సంహితయందు స్వరితకంపమనియు, ఇతర వేదభాగమందు ఉదాత్త కంప మనియు ప్రసిద్ధము.

అయితే ఈ సూత్రము ఆమోదయోగ్యము కాదని తిరస్కరింపబడినది.

ఈ వివరణమంతయు త్రిభాష్య రత్నకారుని వ్యాఖ్యాలభ్యము. కాని గార్గ్య గోపాలయజ్వ వ్యాఖ్య వేరుగనున్నది. గమనింపుడు :

వైదికాభరణ వ్యాఖ్యానమునుసరించి యమః = స్వరము. ద్వియమః = రెండు స్వరములను కల్గినది. అనగ ఉదాత్తానుదాత్తములను గల్గినది స్వరితమగును. ఉదాత్తానుదాత్త సమాహారమే స్వరితము కద. కనుక ద్వియమమనగ స్వరితము. ఇట్లే వ్యాఖ్యయంతయు యున్నది.

[యమ శబ్దస్స్వర వాచీ। ద్వౌయమౌ సమాహృతౌ యస్మిన్స ఖలు స్వరితస్వరో ద్వియమ ఉచ్యతే। తస్మిన్ స్వరితపరే ఏకే ఆచార్యాః శిక్షాకారాః నీచమిచ్ఛన్తి। తత్కిం కృత్స్నస్య పూర్వ స్వరితస్య నీచత్వమిష్యతే। నేత్యుచ్యతే। తా అణుమాత్రాః, తాశ్చ నీచప్రకృత యోఽణుపరిమాణా భవన్తి। అణుర్నామ హ్రస్వకాలస్య చతుర్థోంశః।

హ్రస్వ స్వరూపం విజ్ఞేయం చతుర్భిరణుభిస్తథా॥ ఇతి శిక్షాకార వచనాత్। తథా చ స్వరితాత్పూర్వస్య స్వరితస్యాన్తే పదమాత్రం నీచం భవతీతి సిద్ధమ్॥— ఇతి గార్గ్య గోపాలః]. [3]

సూత్రము 4. తస్యామేవ ప్రకృతౌ॥

త్రిభాష్య :– ద్వియమస్థలే పూర్వస్యామేవ "తస్యాం" స్వరిత ప్రకృతావణుమాత్రయాఽపి నిహతత్వం భవతి। ద్వి రుమపరే తు స్థలే పూర్వయోరేవ ప్రకృత్యోరణుమాత్రయా నిహతత్వం భవతి। న తు తాః సర్వా అణుకార్య భాజ ఇత్యేవకారో బోధయతి। ఏవమేవ కౌహలేయ అహ— ద్వయోః పూర్వోఽణు మాత్రికస్త్రిషు పూర్వావణుమాత్రికా వుత్తరః ప్రకృత్యేతి॥

తస్యామ్। ఏవ। ప్రకృతౌ॥

మణిప్రభ :– పూర్వ సూత్రమందు ద్వియమ, ద్వియమపరములందు అణు మాత్రముగ కంపము వచ్చునని చెప్పిన ఏకదేశిమతము అంగీకారయోగ్యము కాదని త్రిభాష్య రత్నకారులు నిరసించెను గద. కనుక అట్టి స్థలమునందు ఏమి వచ్చునో ఈ సూత్రమున చెప్పుచున్నారని అతనభిప్రాయపడెను.

తస్యామ్=ద్వియమస్థలే, రెండు స్వరితముల వ్యవధానముగ నున్నపుడ మొదటిదానియందలి, ప్రకృతౌ=స్వరిత ప్రకృతికములగు ఉదాత్తానుదా ములందు, ఏవ=మాత్రమే అణుమాత్రమగు నిహతత్వం వచ్చును.

ఇక ద్వియమపర స్థలములందు, అనగ మూడు స్వరితములున్నచో పూర్వమందున్న రెండింటి ప్రకృతియందు నిహతత్త్వము వచ్చును. అ తియె కాని నిహతత్త్వము ఆ మూడింటియందును రాదు. మొదటి రెండిం యందే యుండును. ఆ విషయము సూత్రమందలి ఏవకారముచే తెలియ చున్నది.

పై వ్యాఖ్యను సమర్థించుచు కౌహలేయ శిక్షా వాక్యమును ఉట్టంకి చిరి— "రెండింటియందు పూర్వమున్నది మాత్రమే అణుమాత్రికమగు నిహ తత్త్వము నొందును. మూడున్నచో, అందు మొదటి రెండింటియంద మాత్రమే అణుమాత్రిక నిహతత్త్వము ఉండును. మిగిలిన మూడవదా యందు స్వస్వభావమును మాత్రము కలిగి యుండును."

ఇది త్రిభాష్య రత్నకారులగు సోమయార్యుని వ్యాఖ్యా సారము. అయితే వైదికాభరణ వ్యాఖ్య దీనికి భిన్నముగ నున్నది.

[అస్మత్సంహితాయాం తస్యామేవ స్వరితాత్మికాయా మేవ ప్రకృతౌ కంప భవతి। తథా భూతాత్కంపాం శాత్పూర్వాంశస్తు తస్యామేవ స్వరిత ప్రకృత వవతిష్ఠతే। యత్తూదాత్తపరస్య స్వరితస్య కమ్పత్వం కంపాత్పూర్వాంశస ఉదాత్తత్వం చ శిక్షాయాం స్మర్యతే। తత్ కూష్మాండాది విషయం శాఖాన్త విషయం చ వేదితవ్యమ్॥— ఇతి వైదికాభరణ వ్యాఖ్యా॥] [4

సూత్రము 5. న పూర్వశాస్త్రే॥ (న పూర్వ శాస్త్రే)॥

త్రిభాష్య :— పూర్వ శాస్త్రం నామ విక్రమ విధిః। తస్మిన్నేతదణుకార్యం భవతి। ఏవం వా సూత్రార్థః— పూర్వశాస్త్రే అధ్యాయ ప్రథమసూత్రే య విక్రమసంజ్ఞా ఉక్తా సా కమ్పవిధావత్ర న భవతి। విక్రమస్య దృఢ ప్రయత త్వాత్, కమ్పస్య తదభావాదితి॥

న। పూర్వశాస్త్రే॥

మణిప్రభ :— పూర్వశాస్త్రే=పూర్వ శాస్త్రమందు, న=కాదు. పూర్వ శా

మనగ ఈ అధ్యాయ ప్రథమ సూత్రమున చెప్పిన విక్రమ విధి. ఆ విక్రమ సంజ్ఞకమగు అనుదాత్తమందు ఈ కంప ప్రసక్తి— అనగ అణుమాత్రముగ కంపము (లేక) నిహతత్వము– రాదు. ఏలననగ ఉచ్చారణయందు, విక్రమోచ్చారణమునకు దృఢమగు ప్రయత్నమవసరము. కమ్పమునొందు స్వరితములకిట్టి దృఢ ప్రయత్నము లేదు. కనుక వానియందు కంపము వచ్చుటకవకాశమున్నది. కాని విక్రమ విషయమున అట్టి నిహతత్వ కంపములకవకాశము లేదు.— ఇది ఈ సూత్ర భావము అని త్రిభాష్య రత్నకారులు చెప్పిరి.

అయితే వైదికాభరణ కర్త పూర్వ శాస్త్రమనగ వ్యాకరణ శాస్త్రమని చెప్పెను. అతనీ కంప సిద్ధాంతమునంగీకరించడు. అతని మతమున ఈ ప్రాతిశాఖ్య వ్యాకరణము నాధారము చేసికొని యున్నది కాని, శిక్షల నాధారము చేసికొని లేదు. ఈ కంపన, నిహతత్వములు శిక్షాశాస్త్ర విహితములు. కనుక ఆ వ్యాఖ్యాతకంగీకారము కాదు. వ్యాకరణ శాస్త్ర నిషిద్ధములు కాని శిక్షా విషయమును మాత్రమే ప్రాతిశాఖ్య అంగీకరించునని అతని అభిప్రాయము. అతని వచన మిట్లున్నది— "అస్య శాస్త్రస్య మూలభూతం వ్యాకరణం పూర్వ శాస్త్రమిత్యుచ్యతే। తస్మిన్ కంపో న విధీయతే। సాక్షాచ్ఛిక్షాయాం తు విధీయతే। వ్యాకరణ ప్రధానం హ్యేతచ్ఛాస్త్రమ్। తస్మాత్ వైయాకరణేభ్యోఽన్యే శిక్షాకారా ఇహైక ఇతి వ్యపదిశ్యన్తే। తథా చాస్మిన్ శాస్త్రే విధీయమానానాం కార్యాణాం విషయేషు వ్యాకరణోక్త కార్యాణాం సంగృహీతత్వాన్న తత్ర వ్యాకరణోక్తో విశేషః పరిగ్రాహ్యః। శిక్షార్థస్యతు సర్వస్యాత్రాపరిగృహీతత్వా దిహానుక్త మవిరుద్ధం కార్యం తతః పరిగృహీతవ్యమితి సిద్ధమ్"— ఇతి వైదికాభరణ వ్యాఖ్యా॥

నిష్కర్ష: ఈ వ్యాఖ్యాత లిరువురిలో త్రిభాష్య రత్నకారులు చెప్పినదే మాకును సమ్మతమగును. శిక్షాశాస్త్రము ప్రధానముగ వర్ణశాస్త్రము. వ్యాకర

ఐను పద శాస్త్రము కాని ప్రాతిశాఖ్యయందు ఈ రెండింటి విషయములను గ్రహించి, పదములకుచ్చారణాది సాధుత్వము చూపబడినది

మరియు పూర్వ శాస్త్రమనగ పూర్వమందు చెప్పిన విక్రమ విధియని అంగీకరించుట యుక్తము. అచట ఈ కంప నిహత్యత్వములు ప్రద్ధించక పోవుటకు కారణమును త్రిభాష్యరత్నకారులు స్పష్టము చేసియే యున్నారు

సూత్రమందలి ద్విరుక్తి అధ్యాయ పరిసమాప్తిని సూచించును [5]

కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ ప్రాతిశాఖ్యకు
త్రిభాష్య రత్నానుసారము వేదులోపనామక
సుబ్రహ్మణ్యముచే వ్రాయబడిన "మణిప్రభ
అను ఆంధ్ర వివరణమున పందొమ్మిదవ అధ్యాయము
సమాప్తము



స్వరిత ప్రకరణము | సూత్రములు—12

ఈ అధ్యాయములో 1 నుండి 8 సూత్రములు భిన్న స్వరితముల లక్షణములను చెప్పును మిగిలిన నాల్గు సూత్రములు ఆయా స్వరితోచ్చారణ విధిని తెల్పును

సూత్రము 1 ఇవర్ణోకారయోర్యవకారభావే క్షైప్ర ఉదాత్తయోః॥

త్రిభాష్య – ఉదాత్తయోః ఇవర్ణోకారయోః యథోపదేశం యవకార భావే సతి స్వరితో యో విహితః స క్షైప్రః ఇతి సంజ్ఞాయతే। యథా— వ్యైవైనేన। కృధీస్వస్మాన్॥ ఉదాత్తయోరితి కిం? వస్వ్యః। అన్వేనం విప్రాః॥

ఇవర్ణోకారయో । యవకార భావే। క్షైప్రః। ఉదాత్తయో ॥

మణిప్రభ – ఇక నిపుడీ యధ్యాయమున స్వరిత భేదములను పరియత్న భేదములను వివక్షించుట ద్వార వాని లక్షణములను చెప్పుచున్నారు

ఉదాత్తయోః = ఉదాత్తములైన ఇవర్ణోకారయోః = ఇకార ఈకార ఉకారములకు యవకారభావే – యకారముగాని వకారముగాని (ఇ—య, ఉ—వ) ప్రాప్తించగ వాని తర్వాతనుండు అనుదాత్తము స్వరితముగ మారినచో ఆ స్వరితమునకు క్షైప్రః = క్షైప్రమని పేరు

ఇవర్ణమనగ హ్రస్వ దీర్ఘ ఇకారములు ఉకారమనగ కేవలము హ్రస్వ ఉకారమే గ్రహింపబడును దానికి మాత్రమే వకారముగ మారు అవకాశము గలదు దీర్ఘ ఊకారమునకు ప్రగృహ్య సంజ్ఞ (సూ 4 5) విధింపబడినది కాగ పూర్వ పదాంతమందు ఉదాత్తమగు ఇవర్ణముగాని హ్రస్వోకారముగాని యుండవలెను ఉత్తర పదాదియందు ఈ వర్ణములను యకారముగ గాని వకారముగ గాని మార్చునట్టి అనుదాత్తముగు అచ్చు ఉండవలెను అపుడు సంహితా పాఠమున ఆ ఇకార, ఉకారములు క్రమముగ యకార వకారములుగ మారును అట్లు మారునపుడు పూర్వపరములందున్న ఉదాత్తానుదాత్తముల రెండింటి స్థానమున స్వరితము వచ్చును (సూ 10 16) అట్టి స్వరి

తమును క్షైప్ర స్వరితమందురు. ఇది సూత్రార్థము. ఉదాహరణలు :

1. వి ఏవ్యైనేన— వ్యైవైనేన (5-3-12).

2. కృధీ స్వస్మాన్— (4-7-15). (సు అస్మాన్).

ఉదాత్తయోః ఉదాత్తములైన ఇకార ఉకారములనుటచే, వస్వ్యసి అన్వేనం అనువానియందలి స్వరితమునకు క్షైప్ర సంజ్ఞ వారింపబడినది.

[!]

సూత్రము 2. సయకార వకారం త్వక్షరం యత్ర స్వర్యతే స్థితే పదేఽనుదాత్త పూర్వేఽపూర్వేవా నిత్య ఇత్యేవ జానీయాత్।

త్రిభాష్య :— సయకారం వా సవకారం వా అక్షరం స్వరః ఇత్యర్థః। స్థితే పదే పదకాలే ఇత్యర్థః। యత్ర స్థలే స్వర్యతే అనుదాత్త పూర్వే అపూర్వేవా పూర్వాభావే వా సతి, సః "నిత్యః" ఏవేతి సర్వత్ర జానీయాత్। సర్వత్రేతి సంహితా, పద జటాస్వి త్యర్థః। యథా— వాయవ్యమ్। కన్యేవ తున్నా। తతో బిల్వః। న్యఞ్చం చినుయాత్। క్వ జగతీ చ। క్వాస్యాస్య, క్వ క్వాస్య। ఇతి జటాయామ్। తు శబ్దో నిత్యాదావుచ్చోదయ విషయే "నోదాత్త స్వరిత పరః" (సూ. 14-31) ఇతి నిషేధం నివారయతి। నను నిత్యః కథమేతన్నిషేధ విషయః? ఉదాత్తాత్పరోఽనుదాత్తః (సూ. 14-29) ఇతి లక్షణాఽసంభవాత్। అత్రోచ్యతే-వర్ణ విభాగవేలాయాముదాత్త పూర్వ త్వమస్తి। "సమాహారః స్వరితః" (1-40) ఇత్యుచ్చ పూర్వత్వాత్ స్వరిత స్యేతి నిషేధ విషయత్వం। అనుదాత్తశ్చాసౌ పూర్వశ్చ అనుదాత్త పూర్వః తస్మిన్। పూర్వాఽభావః అపూర్వః। తస్మిన్ శూన్యేత్యర్థః।

స్థితే పదే ఇతి కిమ్? వ్యైవైనేన। అనుదాత్తపూర్వ ఇతి కిమ్? మర్త్యేఽ అవివేశ। సర్వాఽ అగ్నీన్। కేచిదేవమాహుః— "ఉక్థ్యోఽథ యాజ్యై వైనమ్" ఇత్యాది। ప్రాతిహతం నిరాకరోత్యేవకారః పదసమయే అనుదాత్త పూర్వత్వాత్ పూర్వవిశేష ద్వయస్య అన్యథా వైయర్థ్యాత్। తస్మాదత్ర నిత్య స్వరితత్వమేవ, న సంజ్ఞాన్తరమితి విజ్ఞేయమ్॥

స యకారవకారమ్। తు। అక్షరమ్। యత్ర। స్వర్యతే। స్థితే। పదే। అనుదాత్తపూర్వే। అపూర్వే। వా। నిత్యః। ఇతి। ఏవ। జానీయాత్॥

మణిప్రభ :– ఈ సూత్రములో నిత్య స్వరితమును చెప్పుచున్నారు. సూత్రమందు, అక్షరమ్=అచ్చు; అనుదాత్త పూర్వే=పూర్వమందు అనుదాత్తమును కలిగినది, అపూర్వే=పూర్వమందెట్టి స్వరమును కలిగియుండనట్టి, సయకారవకారం=యకారముతో గాని, వకారముతోగాని కూడియున్నట్టిది, స్వర్యతే=స్వరితమును కలిగియుండునో, అట్టి స్వరితమును, నిత్య ఇతి ఏవ=నిత్య (జాత్య) స్వరితమనియె, జానీయాత్=తెలియవలెను. పదే స్థితే=పద పాఠమందున్నట్టిది

అనగ, పదపాఠమునందు, పదాదియందున్నట్టియు, లేదా అనుదాత్తమును పూర్వమందు కల్గినట్టియు అచ్చు, యకారముతో కాని, వకారముతో కాని కూడియుండి, సహజముగ స్వరితమైనచో (అనగ, సంహితా పాఠమునే సూత్ర నిర్దేశముచే స్వరితముగ మారనట్టి) అట్టి స్వరితమును నిత్య స్వరితమందురు. దీనినే ఇతర ప్రాతిశాఖ్యలందు జాత్యస్వరితమనిరి. సంహితా పాఠమున సూ. 10-16; 14-29, ఇత్యాది సూత్రములచే అనుదాత్తములు స్వరితముగ మారు అవకాశము కలదు. కాని పదపాఠమున అట్టి అవకాశము లేదు. కనుకనె— ఆ స్వరితము పద పాఠావస్థయందే యుండవలెను.— అని చెప్పబడినది. అదియును యకార, వకారముతో కూడిన అచ్చునకు చెంది యుండవలెను.

ఉదాహరణలు : "అనుదాత్తపూర్వే"— అనుదానికి.

వాయవ్యమ్। (1-8-7), కన్యేవ (3-1-12); బిల్వః (2-1-8).

ఇక "అపూర్వే" అనుదానికి ఉదాహరణలు :

న్యఙ్ఛమ్ (5-5-3); క్వ (7-1-4); జటాపాఠమందు—

క్వాస్యాస్య క్వః క్వాస్య (7-4-4).

అనుదాత్తపూర్వః అనుదానికి అనుదాత్తశ్చ అసౌ పూర్వశ్చ అని విగ్రహ వాక్యము. అపూర్వః అనుదానికి పూర్వాభావః।

సూత్రమున "అనుదాత్తపూర్వే" అని చెప్పుటచే మర్త్యాం అవివేశ సర్వా అగ్నీన్ ఇత్యాదులందలి స్వరితమునకు "నిత్య సంజ్ఞ వారించ బడినది

ఇక నీ సూత్రమందలి ఎవ అనునది ఈ స్వరితములను ప్రాతిహత సంజ్ఞను వారించును

ఈ సూత్రమునకు గార్గ్య గోపాలయజ్వ వ్యాఖ్య సరళముగ నున్నది అనగ విషయమిదే ఐనను వివరణ పద్ధతి సరళముగ నున్నది [2]

సూత్రము 3 అవచే న్నానాపదస్థముదాత్తమథచేత్సాం హితేన స్వర్యతే స ప్రాతిహత ॥

త్రిభాష్య – అవ శబ్దః పూర్వత్వ మాత్రాకర్షకః। అథ శబ్దో నిత్య సంజ్ఞా వ్యవచ్ఛేదకః। నానాపదస్థోదాత్త పూర్వత్వాధికారకోఽయం। నానాపదస్థం అక్షర ముదాత్తపూర్వం చేత్ పరతః నీచం సాంహితేన విధినా స్వర్యతే చేత్, స ప్రాతిహత వేదితవ్యః। యథా— మాతే అస్యామ్। ఇషే త్వా। తం తే దుశ్చక్షాః। సాంహితేనేతి కిం? యున్మ్యశ్ఛమ్। నానాపదస్థ మితి కిమ్? తయా ధీవత్వయా॥

అవ। చేత్। నానాపదస్థమ్। ఉదాత్తమ్। అథ। చేత్। సాంహితేన। స్వర్యతే। సః। ప్రాతిహతః॥

మణిపత్రిక – ఈ సూత్రముచే ప్రాతిహత స్వరితమును చెప్పుచున్నారు

నానాపదస్థమ్ = భిన్న పదమందున్నట్టి పదాన్తమందలి ఉదాత్తము తర్వాతనున్న పదాదియందలి అనుదాత్తమునకు పూర్వమందు స్వరిత విష యమున చెప్పిన సూత్రముల ననుసరించి సంహితాపాఠమున స్వరితముగ మారినచో అట్టి స్వరితమునకు "ప్రాతిహత స్వరితము అని పేరు

అనగ పదావస్థలో రెండు పదములు అందు పూర్వపదము అన్త్యో దాత్తము రెండవది అద్యనుదాత్తము ఈ రెండు పదములను సంహితా

పాదమున కలిపి చెప్పునపుడు సూ 14-29, 12-9, ఇత్యాది సూత్రములచే ఆ అనుదాత్తము స్వరితముగ మారవచ్చును అట్లు మారుటచే వచ్చు స్వరితమును ప్రాతిహతమందురు. ప్రతిహతస్య భావః ప్రాతిహతమ్। అనగ ఉదాత్తముచే అనుదాత్తము ఆహతమై (కొట్టబడినదై) స్వరితముగ మారెను కనుక, ఆ స్వరితము ప్రాతిహతమగును

ఉదాహరణలు సూ తే అస్యామ్ (1-6-12),
ఇషేత్వా (1-1-1), తం తే దుశ్చక్షాః (3-2-10)

సాంహితేవ అని చెప్పుటచే "యన్న్యఞ్చమ్" అనుచోట స్వరితమునకు ప్రాతిహత సంజ్ఞ వారించబడెను ఇచట న్య ఞ్చమ్‌లోని స్వరితము సహజమగు నిత్య స్వరితము అంతియేకాని "యత్" లోని ఉదాత్త ప్రభావముచే అనుదాత్తము నుండి వచ్చినది కాదు అట్లే "నానా పదస్థమ్" అని చెప్పుటచే తయా దేవతయా (4 2-9) లోని స్వరితమునకు ప్రాతిహత సంజ్ఞ వారింపబడెను [3]

సూత్రము 4 తస్మాదకార లోపేఽభినిహతః॥

త్రిభాష్య – తస్మాత్ నానాపద స్థోదాత్తాత్, పరభూతస్య అనుదాత్తాకారస్య లోపే సతి యః స్వరితః సః "అభినిహతః" వేదితవ్యః। యథా– సోఽబ్రవీత్। తేఽబ్రువన్॥ తస్మాదితి కిమ్? భ్రాజోఽసి దేవానామ్॥

తస్మాత్। అకారలోపే। అభినిహతః॥

వివరణ – ఈ సూత్రముచే "అభినిహత" స్వరితమును చెప్పుచున్నారు

సూత్రమున, తస్మాత్–పూర్వ పదాంతమందున్న, ఉదాత్త స్వరము వలన అని అర్థము. పూర్వ సూత్రమందున్న "నానాపద స్థముదాత్తమ్" అనునది ఈ "తస్మాత్" పదముచే గ్రహింపబడినది.

"ఉత్తరపదాదియందున్న అనుదాత్తమగు అకారము సంహితా పాఠ మున లోపించగ, ఆ లోపమునకు నిమిత్తమ్మైన పూర్వపదాన్త వర్ణము యొక్క ఉదాత్తమునకు స్వరితము విధింపబడినది. (సూ. 12-9) అట్టి స్వరితమునకు "అభినిహత" స్వరితము అని పేరు. ఉదాహరణలు :

సో౽బ్రవీత్। ఇచట సః అబ్రవీత్. ఇది సో అబ్రవీత్ ఈ స్థితిలో ఓకారము ఉదాత్తము అకారము అనుదాత్తము. సంహితా పాఠమున అకా రము లోపించి, ఓకారము స్వరితమును పొందును. కాగ అట్టి స్వరితము "అభినిహత" మగును. ఇట్లే తే౽బ్రువన్ (తే అబ్రువన్).

"తస్మాత్" అని చెప్పుటచే బ్రాహ్మణో౽సి దేవానామ్ (2-4-3) అను స్థల మున ణో పైనున్న స్వరితమునకు "అభినిహత" సంజ్ఞ వారింపబడినది. ఇచట ఓకారముపై సహజముగనె స్వరితమున్నది. అంతియె కాని ఉదాత్త స్థానమున వచ్చినది కాదు. సహజమైనది కద అని దానికి నిత్య (జాత్య) సంజ్ఞ రాదు. అపూర్వము కాదు. అనుదాత్తపూర్వమును కాదు. [4]

సూత్రము 5. ఊభావే ప్రశ్లిష్టః॥

త్రిభాష్య:- ఊభావే యత్ర స్వర్యతే సః ప్రశ్లిష్టః వేదితవ్యః। సూన్నీయ మివ। సూద్గాతా। మా సూత్తిష్ఠన్। దిక్షూప దధాతి॥

ఊభావే। ప్రశ్లిష్టః॥

మణిప్రభ :- ఈ సూత్రముచే ప్రశ్లిష్ట సంజ్ఞ కల్గిన స్వరితమును విప రించుచున్నారు.

పూర్వ పదాన్తమందలి ఉదాత్తమగు ఉకారము, ఉత్తర పదాదియం దలి అనుదాత్తమగు ఉకారముతో సంహితా పాఠమున దీర్ఘ ఊకారముగ మారగ, ఊకారములపై నున్న రెండు స్వరములు కలసి ఒకటే స్వరితముగ మారును. అట్టి స్వరితమును ఊభావముచే సిద్ధించిన స్వరితమందురు దానికే ప్రశ్లిష్ట స్వరితమని పేరు.

ఉదాహరణలు : సూన్నీయమివ (6-2-4) (సు ఉన్నీయ ..); సూద్గాతా (7-1-8) (సు ఉద్గాతా), మాసూత్తిష్ఠన్ (7-5-2) (మాసు ఉత్తిష్ఠన్); దిక్షూవ దధాతి (5-5-5) (దిక్షు ఊవ . )॥

ఇచట ఊ భావము— సవర్ణదీర్ఘ సంధివలన యగు ఊకారము. [5]

సూత్రము 6. పద వివృత్త్యాం పాదవృత్తః॥

త్రిభాష్య :– పదయోర్వివృత్తిః పదవివృత్తిః। తస్యాం యః స్వర్యతే సః పాదవృత్తః వేదితవ్యః। యథా— తా అస్మాత్। స ఇధానః। య ఉపసదః॥ వివృత్తిః వ్యక్తిరిత్యర్థః। పదయోరితి కిమ్? "ప్రఉగ ముక్థమ్"॥

పదవివృత్త్యామ్, పాదవృత్తః॥

మణిప్రభ :– ఈ సూత్రముచే "పాదవృత్త స్వరితము" వివరింపబడు చున్నది.

వివృత్తి అనగ రెండు స్వరముల (అచ్చుల) మధ్య సంధి కార్యము లేకుండ వ్యక్తముగ యుండుట. (స్వరయోర సంధిః వివృత్తిః।) పదవివృత్తి అనగ పదయోః వివృత్తిః అని చెప్పబడినది.

అనగ "పూర్వ పదాన్తమందలి అచ్చునకు ఉత్తర పదాదియందలి అచ్చుతో సంధి జరుగకుండ, రెండు పదములు వ్యక్తముగ నుండుటను పద వివృత్తి యందురు. సంహితా పాఠమున, ఇట్టి స్థితిలోనున్న పూర్వపదాన్త మందలి ఉదాత్త ప్రభావముచే ఉత్తర పదాదియందలి అనుదాత్తము, స్వరితముగ మారినచో దానిని పాదవృత్త స్వరితమందురు."

ఉదాహరణలు : తా అస్మాత్ (2-1-2) స ఇధానః (4-4-4), య ఉపసదః (6-2-4).

త్రిభాష్య రత్నకారులు వివృత్తి అనగ వ్యక్తిరిత్యర్థః పదయోః వివృత్తిః పద వివృత్తి అని విగ్రహము చెప్పిరి. ఇట్టి వివరణచే ఏక పదమందు వివృత్తి యున్నను అచట స్వరితమునకు ఈ సంజ్ఞ వారింపబడినది.

ఉదాహరణ: ప్రఉగముక్థమ్ (4-4-2).

ఇతర ప్రాతిశాఖ్యాకారులు పద వివృత్తిః అనుదానికి "పదయోః వివృత్తిః" అని విగ్రహ వాక్యమును చూపిరి. కాని గార్గ్య గోపాలయజ్వ పదే వివృత్తిః పద వివృత్తిః అని చెప్పెను. [6]

సూత్రము 7. ఉదాత్తపూర్వ స్తైరో వ్యంజనః॥

త్రిభాష్య :- ఉదాత్తపూర్వాధికారే సతి పునరత్ర తత్కథనాదేక పదస్థోఽదాత్త విశేషోఽవగమ్యతే। తస్మాదేక పదస్థోదాత్త పూర్వోయః స్వరితః సః తైరో వ్యంజనో వేదితవ్యః। యథా— యుఙ్క్ష్వస్య। వస్వ్యసి। స ఇన్ద్రోఽమన్యత। తదశ్వోఽభవత్। ప్రఉగమ్। తం త్వష్టాఽఽధత్త॥

ఉదాత్తపూర్వః। తైరో వ్యఞ్జనః॥

మణిప్రభ.- ఈ సూత్రమున స్వరితములలో నొకటియగు తైరో వ్యంజన స్వరిత లక్షణమును చెప్పుచున్నారు.

"ఉదాత్తమును పూర్వమందు కలిగిన"— అనెడి భావము ప్రాకరణికముగ సిద్ధించును. అయితే ఉదాత్త పూర్వత్వము కూడ అట్లే సిద్ధించు చుండగ, సూత్రమందు మరల ఉదాత్తపూర్వః అని చెప్పబడినది. కనుక "ఏక పదస్థమగునట్టియు, ఉదాత్త పూర్వమగునట్టియు స్వరితమునకు తైరో వ్యంజన"మని సూత్రార్థము లభించును.

ఉదాహరణలు: యుఙ్క్ష్వస్య (7-4-20); వస్వ్యసి (1-2-5), స ఇన్ద్రోఽమన్యత (7-1-5); తదశ్వోఽభవత్ (5-3-12); ప్రఉగమ్ (4-4-2).

ఈ స్వరిత లక్షణమును ఇతర ప్రాతిశాఖ్య వ్యాఖ్యాతలు, ఈ ప్రాతి

శాఖ్యా వ్యాఖ్యాతయగు గార్గ్య గోపాలయజ్వయు అన్యథా చూపుచున్నారు. పరిశీలింపుడు!

గార్గ్య గోపాలయజ్వ— "పద శబ్దోఽత్రాను వర్తతే। పదే సమాన పదే, ఉదాత్తపూర్వకో వ్యంజన వ్యవహితో యః స్వరితః సః తైరో వ్యంజన సంజ్ఞో భవతి।"— ఇది ఈతని వివరణ: దీని ప్రకారము ఉదాత్త స్వరిత ముల మధ్య వ్యంజన వ్యవధానము ఉండవలెను. దీని నంగీకరించినచో "ప్ర ఉగమ్" అను ఉదాహరణ (మాహిషేయ, త్రిభాష్యరత్నములందలిది) కుదరదు. అయితే ఋక్ప్రాతిశాఖ్య యందు వ్యంజన వ్యవహితా వ్యవహితత్వములు (సూ. 3-17, 18) రెండును చెప్పబడినవి. కాని వాజసనేయి, చతురధ్యాయిక (3-62) లలో వ్యంజన వ్యవహితత్వమే చెప్పబడినది. అయితే ఈ నిర్వచనము ఆయా శాఖలను బట్టి మారుచుండవచ్చును. [7]

సూత్రము 8. ఇతి స్వారనామధేయాని॥

త్రిభాష్య:- ఇతి ఏతానిస ప్త స్వరిత నామధేయాని వ్యాఖ్యాతాని। యథా- అభ్యస్థాత్; అధ్వర్యోవేః ఇతి క్షైప్రః। వాయవ్యమ్; క్వాస్య ఇతి నిత్యః। సతేలోకః; యత్త్వా కుద్ధః ఇతి ప్రాతిహతః। సోఽబ్రవీత్ ఇత్యభి నిహతః। సూద్గాతా ఇతి ప్రశ్లిష్టః। త ఏనమ్ ఇతి పాదవృత్తః। మమ నామ ఇతి తైరో వ్యంజనః॥

ఇతి। స్వారనామధేయాని॥

మ.టీప్రభ:- ఇంతవరకు ఈ ఏడు సూత్రములలోను వివిధములగు స్వరిత ముల యొక్క పేర్లు చెప్పబడెను. ఆయా అవస్థననుసరించి స్వరితము— 1 క్షైప్రము 2 నిత్యము 3 ప్రాతిహతము 4 అభినిహతము 5 ప్రశ్లిష్టము 6 పాదవృత్తము 7 తైరోవ్యంజనము— అని సప్త విధమును. [8]

సూత్రము 9. క్షైప్ర నిత్యయోర్దృఢ తరః॥

త్రిభాష్య:- క్షైప్రే, నిత్యేచ ప్రయత్నో దృఢతరః కార్యః॥

క్షైప్ర నిత్యయోః। దృఢతరః॥

మణిప్రభ :— ఇంతవరకు స్వరితములలోని వైవిధ్యము చూపబడినది. ఇపుడు అట్టి వివిధ స్వరితముల నుచ్చరించుట యందు చేయవలసిన ప్రయత్న భేదములను చెప్పుచున్నారు.

క్షైప్ర, నిత్య స్వరితముల నుచ్చరించుటలో దృఢతర ప్రయత్నము చేయవలెను— అని సూత్రార్థము. అనగ వీనిని ఉచ్చారణలో ప్రయత్నము దృఢతరముగ నుండును. [9]

సూత్రము 10. అభినిహతే చ॥

త్రిభాష్య :— అన్వాచయే వర్తమానః చకారో దృఢమాత్రం బోధయతి। అభినిహతే ప్రయత్నో దృఢః స్యాత్। న తు దృఢతరః ఇతి పృథక్ సూత్రారంభాత్ ప్రతీయతే॥

అభినిహతే। చ॥

మణిప్రభ :— సూత్రమందలి చకారము పూర్వ సూత్రమునుండి దృఢతరః అనుదానినన్వాదేశము చేయును, అట్లని అభినిహతము నుచ్చరించుటలో ప్రయత్నము "దృఢతరము" అని భావించరాదు. అదే భావమైనచో అభినిహతమును పూర్వ సూత్రమున క్షైప్ర నిత్యములతో కలిపి చెప్పెడివారు. కనుక ప్రత్యేకముగ సూత్రము చెప్పుటచే ఆ ప్రయత్నం దృఢమని తెలియవలెను. దృఢతరము కాదు. కాగ "అభినిహత స్వరోచ్చారణయందు ప్రయత్నము దృఢముగ నుండును"— అని సూత్రార్థము.

గార్గ్య గోపాలయజ్వ వ్యాఖ్య కొంచెము వైవిధ్యము చూపుచున్నది. చూడుడు— "చ శబ్దో దృఢతర ఇత్యన్వాదిశతి। పృథక్ సూత్ర కరణం అనిత్యత్వ జ్ఞాపనార్థమ్। యథా వ్యాకరణే "చుటూ" (పా I 3-7) ఇతివత్। తేన అనుదాత్తపూర్వక ఏవ అభినిహతే దృఢతరః ప్రయత్నః కార్యః। ఉదాత్తపూర్వేఽపూర్వే చ దృఢ ఏవ॥ అనగ ఆ అభినిహత స్వరితము అనుదాత్తపూర్వకమైనచో ప్రయత్నము దృఢతరముగ చేయవలెను. అట్లుగా:

ఉదాత్తపూర్వమైనను, పూర్వాభావమైనను, (అపూర్వమైన) ఆ అభినిహత స్వరితము నుచ్చరించుటకు ప్రయత్నము దృఢమాత్రము నుండవలెను— అని భావము.

అయితే వీరిరువిరిలో త్రిభాష్య రత్నకారుల వ్యాఖ్య న్యాయముగ నున్నది. [10]

సూత్రము 11. ప్రశ్లిష్ట ప్రాతిహతయోర్మృదు తరః॥

త్రిభాష్య :- ప్రశ్లిష్టే ప్రాతిహతే చ ప్రయత్నో మృదుతరః కార్యః॥

ప్రశ్లిష్టప్రాతిహతయోః। మృదుతరః॥

మణిప్రభ :- ఈ సూత్రములో ప్రశ్లిష్ట, ప్రాతిహత స్వరితముల నుచ్చరించుటయందు చేయవలసిన ప్రయత్నము చెప్పబడెను.

మృదు–దృఢ అనునవి వ్యతిరేక పదములు. దృఢమునకు ప్రతియోగి మృదువు. దృఢమనగ కఠినమైనది. దీనికి భిన్నమైనది మృదు భావము. కాగ "ప్రశ్లిష్ట ప్రాతిహత స్వరితముల నుచ్చరించుటలో ప్రయత్నము మృదుతరముగ నుండును"— అని సూత్ర భావము. [11]

సూత్రము 12. తైరోవ్యంజన పాదవృత్తయోరల్పతరోఽల్పతరః॥

త్రిభాష్య :- తైరోవ్యంజనే పాదవృత్తే చ ప్రయత్నః అల్పతరః స్యాత్। యద్యప్యల్పతర మృదుతర దృఢభావా స్తత్రోక్తాః, తథాపి "దీపవద్వేణుపత్రవత్" ఇతి శిక్షానురోధాత్ కోమల శిరస్కత్వం సర్వత్ర జ్ఞేయమ్॥

తైరోవ్యంజన పాదవృత్తయోః। అల్పతరః। అల్పతరః॥

మణిప్రభ :- ఈ సూత్రమున "మిగిలిన స్వరిత ప్రభేదములగు తైరోవ్యంజన, పాదవృత్తములను పలుకునపుడు ప్రయత్నము అల్పతరముగ నుండవలెను"— అని చెప్పుచున్నారు.

ఒక్క విషయమును గమనించవలెను. నిజమునకు ఉదాత్తము నుచ్చరించునపుడు కాఠిన్యం, అనుదాత్తమును పలుకునపుడు మృదుత్వము ఉండును. స్వరితము వాని సమాహారము కనుక, నాతికఠినము, నాతి మృదువుగ నుండవలెను. అయితే ఉన్నంతలోనే, పాఠకుడు తన శక్త్యాను సారము పారమునందు కఠినతర, మృదుతర, కఠినత్వ, మృదుః భావములను ప్రదర్శించుచు, ఆయా స్వరితముల యొక్క వైవిధ్యమును శ్రోతలకు ప్రద ర్శించవలెను.

గార్గ్య గోపాలయజ్వ తన వైదికాభరణ వ్యాఖ్యయందు— "అల్పే బహుశ ప్రతియోగీ। బహుశో దీర్ఘకాలికః। అల్పోఽల్పకాలికః।" — అని వివరణ చూపెను.

ఈ విధముగ సప్త స్వరితములను ప్రదర్శించుటకై శిరః కంపనము కోమల, కాఠిన్య మృదుత్వాదులను తగు మాత్రముగ ప్రదర్శించుచు, ఆయా స్వరిత వైవిధ్యమును తెలియచేయవలెను. [12]

సూత్రమందలి అల్పతరః, అల్పతరః అను ద్విరుక్తి అధ్యాయ పరి సమాప్తిని సూచించును.

కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ ప్రాతిశాఖ్యకు
త్రిభాష్య రత్నానుసారము వేదులోపనామక
సుబ్రహ్మణ్యముచే వ్రాయబడిన "మణిప్రభ
అను ఆంధ్ర వివరణమున ఇరువదియవ అధ్యాయము
సమాప్తము.



## అధ్యాయము–21

స్వరాంగత, స్వరభక్తి : సూత్రములు–16.

ఈ అధ్యాయమున వర్ణముల అంగాంగి భావము మొదటి తొమ్మిది సూత్రములలో చెప్పబడినది. మిగిలిన సూత్రములందు ప్రచయము, స్వరభక్తి, యమ మొదలగు భిన్న విషయములు చెప్పబడినవి. కాగ ప్రాధాన్యమునను సరించి ఈ ప్రకరణమును అంగ ప్రకరణమనవచ్చును.

సూత్రము 1. వ్యఞ్జనః స్వరాఙ్గమ్॥

త్రిభాష్య :– స్వరస్య అఙ్గం స్వరాఙ్గమ్। వ్యంజనం స్వరాంగం భవతి। "శ్వానో నాదోఽఙ్గమేవ చ" (సూ. 24-5) ఇతి విజ్ఞేయత్వేన విధానాదయమారంభః।

నను కూటో యూప ఇత్యాదౌ వ్యంజనమేవ అర్థవిశేష బోధకమితి స్వరో వ్యంజనాంగం కిం న స్యాత్? ఉచ్యతే— వ్యంజనం కేవలమను స్థాతుం న శక్నోతి కిన్తు సాపేక్షం, స్వరస్తు నిరపేక్షః। సాపేక్ష నిరపేక్షయోర్నిరపేక్షమేవ విశిష్టమాచక్షతే ప్రేక్షావన్తః। విశిష్టం ప్రతి అంగత్వమవిశిష్టస్యైవ। కించ స్వర వైశిష్ట్య బోధకమన్యదపి విద్యతే—

> దుర్బలస్య యథారాష్ట్రం హరతే బలవాన్నృపః।
> దుర్బలం వ్యంజనం తద్వద్ధరతే బలవాన్ స్వరః॥

కించ శిక్షా వ్యాఖ్యానే—

> యస్స్వయం రాజతే తం తు స్వరమాహ పతంజలిః।
> ఉపరిస్థాయినా తేన వ్యంజనం వ్యంజనముచ్యతే॥
> స్వరాస్తు బ్రాహ్మణా జ్ఞేయాః. . ఇత్యాది॥
>
> ఉదాత్తశ్చానుదాత్తశ్చ స్వరితశ్చ స్వరాస్త్రయః।
> హ్రస్వో దీర్ఘః ప్లుత ఇతికాలతో నియమా అచి॥ ఇతి॥

స్వరాణామేవోదాత్తాదయో ధర్మాః, వ్యంజనానాం తు తదంగతయా। వ్యంజనమర్థమాత్రమ్। స్వరశ్చ మాత్రాకాలః। తయోస్సంధిరర్థమాత్రః। ఇత్యేవం దీర్ఘకాలః ప్రసక్తః। తత్ప్రతిషేధార్థం "వ్యంజనం స్వరాంగం" ఇత్యుక్తమ్। స్వర సంసృష్టస్య వ్యంజనస్య స్వరకాల ఏవకాలో ద్రుతవృత్తౌ న తు స్వర

స్యైవ సర్వత్రేత్యర్థః। ద్రుతవృత్తావితి కిం? హ్రస్వార్ధకాలం వ్యంజనం (సూ. 1-37) ఇతి వ్యర్థం స్యాదితి బ్రూమః। యథా క్షీరోదక సంపర్కే క్షీర స్యైవ ఉపలబ్ధిర్నోదకస్య। తథా స్వరవ్యంజన సంపర్కే స్వర స్యైవోప లబ్ధేర్వైశిష్ట్యమ్॥

వ్యఞ్జనమ్। స్వరాఙ్గమ్॥

మణిప్రభ :- వ్యంజనం=హల్లు వర్ణము, స్వరాంగమ్=అచ్చునకు అంగము. వ్యంజనము ఏ అచ్చుతో కూడి యుండునో, అది ఆ అచ్చుయొక్క అవయవ మగును.

అయితే రెండు మూడు హల్లులు కలసి యున్నపుడు ఆ హల్లులయొక్క అంగత్వ జ్ఞానము, వేదాచార్య పదవినొందగోరువానికి తెలిసి యుండవలెను. [చూడుము— సూ. 24-5). కనుక ఈ అధ్యాయమున ఆ విషయము చర్చించబడు చున్నది.

స్వరము, వ్యంజనము— ఈ రెండింటిలో స్వరము (అచ్చు) బలమైనది. కనుక బలవంతుడు బలహీనుని వ్యక్తిత్వమును (ప్రత్యేకతను) హరించినట్లు, స్వరము వ్యంజనమును తనలో కలుపుకొని, తనకవయవముగ చేసికొనును. స్వరము స్వతంత్రమైనది. నిరపేక్షము హల్లు అట్లుగాక మరి యొకదానిపై ఆధారపడి యుండును. కనుక అది సాపేక్షము మరియు ఉదాత్తానుదాత్త స్వరిత భేదములు స్వరములకే గలవు. వ్యంజనములకు లేవు. అట్లే స్వరము ఏకమాత్రా కాలము గలిగి ఉచ్చరించబడును. కాని హల్లునకుచ్చారణ కాలము కేవలము అర్ధమాత్రా కాలము ఈ విధముగ స్వరముయొక్క ఆధిక్యతను తెలియునగును.

హల్లు అచ్చు కలసి ఉచ్చరింపబడునపుడు (క, గ, ఝ) వాని ఉచ్చారణ కాలము ఒకటిన్నర (సార్థ) మాత్రలు అగుటచే, అది దీర్ఘముగ పరిగణింపబడదా? పరిగణింపబడదు. ద్రుతోచ్చారణమందు హల్లు తన వ్యక్తిత్వమును కోల్పోయి, అచ్చునందు కలసిపోవుటచే, అచ్చుయొక్క ఉచ్చారణ కాలమునె నీరక్షీర న్యాయము ననుసరించి ఆ వర్ణోచ్చారణ కాలముగ గ్రహింతురు.

సూత్రము 2. తత్పర స్వరమ్॥

త్రిభాష్య:– స్వరప్రధానతయా కేవలమవస్థాతు మసహమానం వ్యంజనం కదా పూర్వస్యాంగం, కదా పరస్యాంగం ఇతి సందేహే వ్యవస్థాపయతి। తత్= అంగభూతం వ్యంజనం, పరస్వరం భజతే। యథా "ఇమానేవ లోకానువ ధాయ (సం 5-5-5)"॥ పరశ్చాసౌ స్వరశ్చ పరస్వరః। తం పర స్వరమ్॥

తత్। పరస్వరమ్॥

మణిప్రభ :– సామాన్యముగ పదములో హల్లునకు పూర్వమందు, పరమందు కూడ అచ్చు యుండును. అట్టి సమయమున ఆ హల్లు ఏ అచ్చునకవయవ మగును – అను సందేహ నివృత్తికై ఈ సూత్రము చెప్పబడినది. ఇది సామాన్య సూత్రము. తత్=ఆ వ్యంజనము, పరస్వరమ్=తనకు పరమందున్న స్వరమునె (పొందును). అనగ

సామాన్యముగ హల్లు తనకు అవ్యవధానముగ పరమందున్న అచ్చునకె అంగమగును. పూర్వమందున్న స్వరమున కవయవము కాదు.

ఉదా : ఇమానేవ లోకానువధాయ . (5–5–5). [2]

ఇకనిపుడీ సామాన్య సూత్రమున కపవాదములను చెప్పుచున్నారు.

సూత్రము 3. అవసితం పూర్వస్య॥

త్రిభాష్య :– అవసితం పదాన్తవర్తి వ్యంజనం పూర్వస్య స్వరస్య అంగం స్యాత్। యథా : ఊర్క్, వషట్; హవిః॥

అవసితమ్। పూర్వస్య॥

మణిప్రభ : అవసితమునగ చివరనుండునది. లేక మిగిలినది అని అర్థము. ప్రకృత సందర్భమునునుసరించి, వ్యస్త పదాన్తమందుండునట్టి హల్లు అని భావము. అది పూర్వస్య=తనకు పూర్వమందున్న అచ్చునకు అంగమగునని భావము. కాగ "పదాన్తమందున్న హల్లు తత్పూర్వమందున్న అచ్చునకు అవయవమగును". అని సూత్రార్థము.

**ఉదాహరణలు :** ఊర్క్— ఇచట రేఫ, కకారములు రెండును వానికి పూర్వ మందున్న ఊకారమున కంగములగును. ఇట్లే వషట్ అనుచోట టకారము తత్పూర్వమందున్న అకారమున కవయవము. హవిః అనునపుడు విసర్గ పూర్వమందున్న ఇకారమునకు అంగము అగును. [3]

సూత్రము 4. సంయోగాది॥

త్రిభాష్య :— ద్వయోర్బహూనాం వా వ్యంజనానాం సంయోగో భవతి యది తస్య సంయోగస్య ఆదివ్యంజనం పూర్వస్యాంగం భవతి। యథా— యజ్ఞాన్వ్యాదిశత్॥ అప్స్వ న్తః॥ పరసూత్రే చకారః పూర్వ స్వరాంగ బోధక ఇత్యతాపి తల్లభ్యతే॥

సంయోగాది॥

మాహిషేయ :— ప్రకృతమున సంయోగమనగ రెండులేక అధికమగు హల్లులు కలసియుండుట. "హలోఽనన్తరాస్సంయోగః" అని పాణిని సూత్రము (పా. 1-1-7). అట్లు అనేక హల్లులు కలసియున్నపుడు అట్టి హల్లుల కంగత్వ మెట్లు నిర్ణయించవలెనో ఈ సూత్రము చెప్పుచున్నది.

సంయోగస్య ఆది : సంయోగాదిః॥ ఇచట ఆదియనగ ఆదియందున్న వ్యంజనమని భావము. ఈ సూత్రములోనికి పూర్వసూత్రమునుండి పూర్వస్య అనునది అనువృత్తిగ వచ్చును. ప్రథమ సూత్రము నుండి "స్వరాంగం" అని వచ్చును. కాగ సంయోగే ఆదివ్యంజనం తస్య పూర్వస్య స్వరస్య అంగం భవతి అని వాక్యార్థము. "సంయోగమందలి మొదటి హల్లు తత్పూర్వమం దున్న స్వరమునకు అంగమగును"— అని సూత్రార్థము.

గమనిక : ముద్రిత మాహిషేయ వ్యాఖ్యా గ్రంథమునందు సూత్రము "సం యోగి చ" అని యున్నది. దాని వ్యాఖ్యానమున ". .. తత్రాద్యం వ్యంజనం పూర్వస్య స్వరస్యాంగం భవతి" అని యున్నది. ఇచట తత్రా ద్యం అని యుండవలెను. ఇది అచ్చు పొరపాటుగను, తర్వాత ముద్రిత గ్రంథములు పూర్వ గ్రంథమును గుడ్డిగ అనుకరించుట చేతనీ పొరపాటు వచ్చుచున్నది— అని భావించుచుంటిమి. [4]

సూత్రము 5. పరేణ చా సాంహితమ్॥

త్రిభాష్య :- పరేణస్వరేణ "అసాంహితం" అసంయుక్తం చ వ్యంజనం పూర్వ స్వరాంగం భవతి। యథా— తత్సవితుః। నను తర్హి పూర్వ సూత్ర మనర్థకమ్। సంయోగాది భూతస్యాపి వ్యంజనస్యానేనైవ పూర్వ స్వరాంగత్వ సిద్ధేః। మైవం మంస్థాః। "మర్త్యశ్రీః, అర్వ్యాఽసి" ఇత్యత్ర యవకారయోః "రేఫాత్పరం చ" (సూ. 14-4) ఇతి ద్విత్వాకృతే ప్రథమ యవకారయోః "పరేణ చాఽసాంహితమ్" ఇత్యనేవ పూర్వ స్వరాంగత్వం ప్రాప్తం భవతి। రేఫస్య తు "నాన్తస్థాపరమసవర్ణం" (సూ. 21-7) ఇత్యనేన పరస్వరాంగత్వం పాప్తమ్। తచ్చా శక్యం తథోచ్చారణా అసంభవాత్। అన్యతర బాధే కర్తవ్యే సతి కిం వా బాధ్యమితి సందేహః। తత్ర నియామకత్వేన "సంయోగాది" (సూ. 21-4) సూత్రమపేక్షితే॥

పరేణ, చ, అసాంహితమ్॥

మణిప్రభ :- ఈ సూత్రమందు పరేణ=పరమందున్న అచ్చుతో, అసాంహితమ్=కలసియుండని వ్యంజనము పూర్వ స్వరాంగమగును. సూత్రమందలి చకారము "పూర్వ స్వరాంగమ్" అను భావమును అనువృత్తి చేయును. కాగ "సంయోగమందు వ్యంజనము పరస్వరాంగము కానిచో నది పూర్వ స్వరాంగమగును"— అని సూత్రార్థము.

ఉదాహరణ : తత్సవితుః। ఇచట తకారము పూర్వ స్వరాంగము.

సందేహము : "పరేణ స్వరేణ అసాంహితం వ్యంజనం తత్పూర్వ స్వరస్య అంగం భవతి" అని ఈ సూత్రము చెప్పుచున్నది. మరి ఇట్టి స్థితిలో "సంయోగాది" అనెడి నాల్గవ సూత్రము అనర్థకమగుచున్నది కదా?

సమాధానము : నాల్గవ సూత్రము వ్యర్థము కాదు. కొన్ని ప్రత్యేక విషమ స్థలములలో అంగ నిర్ణయము చేయవలసినపుడు ఈ నాల్గవ సూత్రము సార్థకమగుచున్నది ఉదాహరణకు మర్త్యశ్రీః, అర్వ్యాసి అనుచోట్ల "రేఫాత్పరం చ" (సూ. 14-4) అను సూత్రముచే యకారము (ర్త్య), వకార (ర్వ్యా) ములకు ద్విత్వము వచ్చును. అపుడు మర్య్యశ్రీః, అర్వ్వాసి అని అగును.

ఇపుడు యకార, వకారములకు సంబంధించి ప్రథమ యకార, వకారములీ సూత్రముచే (పరేణచాఽసాంహితమ్) పూర్వ స్వరాంగములగును. మరి రేఫ, పూర్వ స్వరాంగము కాలేదు. వా స్త్రస్థా పరమ సవర్ణమ్ (సూ. 21 7) అను సూత్రముచే రేఫకు పూర్వ స్వరాంగత్వము నిషేధింపబడుచున్నది. ఇట్టి స్థితిలో ఈ రేఫ దేనికంగమగునని సందేహము. అపుడు ఈ నాల్గవ సూత్రము అచట ప్రవర్తించి సంయోగాదియందున్న వ్యంజనమునకు పూర్వ స్వరాంగత్వమును కల్పించును. ఆ విధముగ నాల్గవ సూత్రము సార్థకమగుచున్నది. కనుక నాల్గు, ఐదు సూత్రములు రెండును అవసరములగుచున్నవి.

సూత్రమందు పరేణ అను పదముచే పరేణ స్వరేణ అని ఎందుకు గ్రహించవలెను? పరేణ వ్యంజనేన అని ఏల అనుకొనరాదు? అను ప్రశ్నకు వైదికాభరణ కర్త ఇట్లు చెప్పుచున్నారు — "అత్ర పరేణేతి వచన సామర్థ్యాత్ పరశబ్దస్య స్వరవిశేషణత్వం లభ్యతే। న హి పరేణ వ్యంజనేన, అసంహితం వ్యంజనమస్తి। అసంయుతస్యాపి సంహితత్వాత్। అవసితస్య తు సిద్ధమేవ పూర్వాంగత్వమితి॥ [5]

సూత్రము 6. అనుస్వార స్స్వర భక్తిశ్చ॥

త్రిభాష్య :- చకారః సముచ్చయ కథనద్వారా పూర్వ స్వరాంగత్వాకర్షకః। అనుస్వారః, పూర్వస్వరం భజతే। యథా — "అ ంశునాతే"। స్వరభక్తిశ్చ పూర్వస్వరం భజతే। యథా— గార్హపత్యః। విదౌ సమానే సూత్రస్యాస్య పృథక్కరణం క్వచిత్ స్వరభక్తేః పరాంగత్వ మాపాదయితుమ్। తథాహి—

స్వారాద్ధ్రస్వాత్ పరాం భక్తిం ప్రచయత్వం నయేద్బుధః।
ఋతస్య ధూర్షదం చేతి స్వతన్త్రా భక్తిరుచ్యతే॥

అనుస్వారః। స్వరభక్తిః। చ॥

మణిప్రభ :- సూత్రమందలి చకారము సముచ్చయ వాచి. మరియు పూర్వ సూత్రములనుండి పూర్వ స్వరత్వము నిచటకాకర్షించును. కాగ "అనుస్వార పూర్వ స్వరమున కంగమగును. స్వరభక్తియును పూర్వ స్వరమునకంగమగును"— అని సూత్ర భావము,

అనుస్వారకుదాహరణలు : అగ్నేమహాం అసీత్యాహ (2-5-9); సర్వాం అగ్నీన్ (5-6-1); అవిమాం అశ్వీ (1-6-6)॥ ఈ ఉదాహరణములు వైదికాభరణ కర్త చూపినవి.

త్రిభాష్య రత్నకారులు ఇచ్చిన "అంశునా తే" ఉదాహరణ అంతగ బాగులేదు ఇచట అనుస్వారకు పరాంగత్వమున కవకాశము లేదు. కనుక పూర్వాంగత్వమవివాదము.

ఇక స్వరభక్తిః: అది కూడ పూర్వాంగత్వమునె బొందును. "రేఫోష్మ సంయోగే రేఫ స్స్వరభక్తిః" (సూ. 21-15) అను సూత్రముచే స్వరభక్తి నిర్వచింపబడుచున్నది. ఇట్టి స్వరభక్తికి సంయోగాది (సూ. 21-4) అను సూత్రముచే పూర్వాంగత్వము సిద్ధించుచుండగ పునర్విధానముచే ఈ స్వరభక్తి "వ్యంజనము" అని నిర్ధారించుట జరిగినది. అట్లే స్వరభక్తియందు స్వర సాధర్మ్యము కన్పించును. కనుక దీనిని స్వరముగ భ్రమపడకుండు టకుగాను, స్పష్టప్రతిపత్తికై ఈ సూత్రమును చెప్పిరి.

స్వరభక్తి అనునది రేఫకు (విశేషణము అనగ) గుణమెకాని స్వతంత్ర వర్ణము కాదు. కనుక "సంయోగాది" అను సూత్రముచే పూర్వాంగత్వము సిద్ధించును. కాని పైని చెప్పిన ప్రయోజనమాశ్రయించి, ప్రత్యేక సూత్రమును చెప్పిరి. అంతియె కాని, స్వరమునకు మరల స్వరాంగత్వము రాదు కనుక, దీనికట్టి పూర్వ స్వరాంగత్వ సిద్ధికై ఈ సూత్రమును చెప్పిరని భావించరాదు.

త్రిభాష్య రత్నకారులు "ఇచట స్వరభక్తికి పూర్వాంగత్వ విధానముచే కొన్నిచోట్ల పరాంగత్వమును కల్పించవచ్చును" అని చెప్పిరి. ఇచట వైదికాభరణ కర్త "తస్మాత్ స్వరభక్తేః స్వప్రాధాన్య నిరాసార్థమేవ పృథగ్వచన మితి సిద్ధమ్"— అని రాద్ధాంతము చేసిరి. [6]

సూత్రము 7. నాన్తస్థాపర మసవర్ణమ్॥

త్రిభాష్య :- నకారః పూర్వ స్వరాంగత్వ వ్యావర్తకః। అన్తస్థాపరః వ్యఞ్జనం తస్యాః అన్తస్థాయాః అసవర్ణం విలక్షణం పూర్వ స్వరాంగం న భవతి।

అర్థాత్ పరస్వరాంగం తదితి వేదితవ్యమ్। స్వతః స్థాతుమశక్యత్వాత్। యథా— అధ్యవసాయ దిశః (6-1-5), మధుమిశ్రేణ (5-2-8); అశ్లోణయా (6-1-6); ఇషిత్వా (4-3-7)॥ అన్తస్థా పరా యస్మాత్ తదన్తస్థాపరమ్। అసవర్ణమితి కిమ్? వరిచాయ్యం చిన్వతి (5-4-12)॥

న। అన్తస్థాపరమ్ అసవర్ణమ్॥

మణిప్రభ :- ఈ సూత్రము, రెండంతస్థ వర్ణములు సంయోగమందు లేనపుడు, పూర్వ వ్యంజనము యొక్క స్వరాంగత్వమును నిర్ణయించును.

అన్తస్థా వర్ణములు అనగ య వ ర ల - అను నాల్గు వ్యంజనములు. కావున సంయోగమందు పూర్వ వర్ణము పరమందున్న అన్తస్థకంటె భిన్నమైనచో, అట్టి వ్యంజనమునకు పరాంగత్వం సిద్ధించును. పూర్వాంగత్వము సూ. 21-4 చే సిద్ధించుచుండగ, అది యీ సూత్రము ("న" కారము) చే వారింపబడినది. అనగ పూర్వాంగత్వము రాదని తాత్పర్యము.

ఉదాహరణలు : అధ్యవసాయ —ఇచట ధకార, యకారలకు సంయోగము. యకారము అన్తస్థ వర్ణము. కనుక ధకార, యకారముల రెండింటికిని పరస్వరాంగత్వమే యగును. అట్లే మధు మిశ్రేణ (శ్రే); అశ్లోణయా (శ్లో), ఇషిత్వా (త్వా) వానియందు శకార, తకారములకు పరాంగత్వమే వచ్చును.

ఇచట అసవర్ణమనగ అంతస్థకాని వ్యంజనమనియే అర్థము. అంతియే కాని వేరొక అంతస్థ వర్ణమని భావించరాదు. [7]

సూత్రము 8. నాసిక్యాః॥

త్రిభాష్య :- నాసిక్యాయమాః పరస్వరం భజన్తే। యథా— రుక్మమునః దధాతి। (5-2-7); రాజ్ఞి సూకరః (5-5-11)

నాసిక్యాః॥

మణిప్రభ :- నాసిక్య వర్ణములు కూడ పరాంగత్వమునే పొందును. ఈ నాసిక్య వర్ణములనె "యమ" వర్ణములందురు. ఇవి పదమధ్యయందు ఆగమముగ వచ్చు వర్ణములు. ఈ వర్ణములను ఈ అధ్యాయము 12, 1 సూత్రములలో వివరించిరి.

సూత్రము 9. స్పర్శశ్చోష్మపర ఊష్మా చేత్పరస్య॥

త్రిభాష్య :– పూర్వః చకారో నాసిక్యాః (21-8) ఇత్యనేన సముచ్చయ వాచకః। ఉత్తరస్తు పరస్వరాంగత్వాకర్షకః। "ఊష్మాపర స్పర్శశ్చ" పర స్వరాంగం భవతి। అసౌ ఊష్మా పరశ్చేత్ పరస్వరాంగం చేదిత్యర్థః। షట్థ్ సంపద్యన్తే (5 4-3)। వషట్థ్ స్వాహా (7-3-12)। ఊష్మా పరశ్చేదితి కిం? అక్ష్ణయా వ్యాధారయతి (5-2-7)। ఊష్మాపరో యస్మాత్ అసౌ ఊష్మాపరః॥

స్పర్శః। చ। ఊష్మపరః। ఊష్మా। చేత్। పరస్య॥

మణిప్రభ :– ఈ సూత్రమందు రెండు చకారములు కలవు. అందు పూర్వ చకారము పూర్వ సూత్రమందలి నాసిక్యాః (21-8) అనుదానితో సముచ్చయ వాచకము అనగ పర స్వరాంగత్వమును చెప్పును. కాగ "పర స్వరాంగమగు ఊష్మ వర్ణముకంటె పూర్వమందున్న స్పర్శవర్ణము కూడ ఆ ఊష్మతో కూడ పర స్వరాంగత్వమునె పొందును, ఒకవేళ ఆ ఊష్మ పరస్వరాంగము కానిచో (అనగ పూర్వ స్వరాంగమైనచో) ఆ స్పర్శ వర్ణము కూడ తత్పూర్వ స్వరాంగమే అగును"— అని సూత్రభావము.

ఉదాహరణలు : షట్థ్ సంపద్యన్తే। ఇచట సకారము పర స్వరాంగము. కనుక దానికి పూర్వమందున్న థకారము కూడ పర స్వరాంగమే (అ–కు అంగము) అగును. కాని టకారము మాత్రము "సంయోగాది" (సూ. 21-4) అను సూత్రముచే పూర్వ స్వరాంగమగును. ఇట్లే వషట్థ్ స్వాహా అనుచోట కూడ థకారము పర స్వరాంగమగును.

"ఊష్మా పరశ్చేత్" అని ఎందుకు? ఊష్మకు పరాంగత్వము లేనిచో, తత్పూర్వమందున్న స్పర్శకు కూడ పరాంగత్వము రాదని తెల్పుటకు, ఉదా : అక్ష్ణయా వ్యాఘారయతి। జగత్స్థాః। యత్ స్థావరాణామ్॥ [9]

సూత్రము 10. స్వరితాత్సంహితాయామనుదాత్తానాం ప్రచయ ఉదాత్త శ్రుతిః॥

త్రిభాష్య :– స్వరితాత్పరేషా మనుదాత్తానాం అనుదాత్తయోరనుదాత్తస్య

వా సంహితాయాం ప్రచయః నామ ధర్మో భవతి। యథా— అగ్నే దుద్ర గహ్య కిꣳ శిల వన్యయా తే (2-4-1) సంహితాయామితి కిం? అగ్నే। దుద్ధ గహ్య। కిꣳ శిల। వన్య। యా। తే। ఉదాత్తస్య శ్రుతిరివ శ్రుతిరస్య అసౌ "ఉదాత్త శ్రుతిః" ఇతి ప్రచయ స్వరూప నిరూపణమ్। అతో న పునరుక్తి శంకా॥

స్వరితాత్। సంహితాయామ్। అనుదాత్తానామ్। ప్రచయః।
ఉదాత్త శ్రుతిః॥

మణిప్రభ :- ఈ సూత్రములో స్వరమునకు సంబంధించిన ఒక విశేషమును చెప్పుచున్నారు.

సంహితా పాఠమునందు, స్వరితము తర్వాత వచ్చు అనుదాత్తములు, అనుదాత్త స్వరమును కలిగియుండవు. అవి ఉదాత్తమువంటి స్వరమును పొంది యుండును. అట్టి స్వరమును ప్రచయ స్వరమందురు. ఇది ధర్మవాచకము. కనుకనే లేఖనమందు వానికి అనుదాత్త చిహ్నము చూపబడదు. ఇట్టి ధర్మము గల వర్ణమును కూడ ప్రచయమనియే అందురు ధర్మ, ధర్మి- వీనికభేద వ్యవహారము. కాగ "ఉదాత్త శ్రుతిని బోలిన శ్రుతి గల్గిన అనుదాత్తము ప్రచయమగును". ఇట్టి అనుదాత్తములు స్వరితముకంటె పరముగ ఒకటిగాని, అంతకంటె ఎక్కువగ కాని వరుసగ నుండవచ్చును.

ఇచట "సంహితాయామ్" అని ఉండుటచే, ఈ ప్రచయము సంహితా పాఠమునందె యుండును. పదపాఠమున ఉండదు.

ఉదా : సంహితయందు— అగ్నే దుద్ధ గుహ్య కిꣳ శిల వన్యే యా తే॥

పదపాఠమున— అగ్నే। దుద్ధ। గుహ్య। కిꣳ శిల। వన్య। యా। తే।

ఇచట గ్నేలోని స్వరితము కంటె వరుసగ తొమ్మిది వర్ణములు పదపాఠమున అనుదాత్తములె। యా అనునది ఉదాత్తము. తే అనుదాత్తము. కనుక సంహితయందు స్వరితముగ చూపబడినది. (సూ. 14-29).

ఈ సందర్భంలో వైదికాభరణమందలి వ్యాఖ్యను పరిశీలింపుడు— తదయమర్థః। సంహితాయాం స్వరితాత్పరేషాం ఏక, ద్వి, బహూనాం అనుదాత్తానాం వ్యంజనాన్తర్హితానామనన్తర్హితానాం చ ప్రచయ స్వరాత్మకో

గుణో భవతీతి। కిం రూపోఽసౌ గుణః యం ప్రచయో వక్ష్యసి। స ఉదాత్త శ్రుతిరితి బ్రూమః। ఉదాత్తవత్ శ్రుతిర్యస్య తథోక్తః। ఉత్క్షేపణ రహితః ఉదాత్తగుణ ఏవ ప్రచయ ఇతి యావత్॥ [10]

సూత్రము 11. నోదాత్త స్వరితపరః॥

త్రిభాష్య :- ఉదాత్తపరః స్వరితపరో వా అనుదాత్తః ప్రచయో న భవతి। యథా— తయాదేవతయా (4-2-9)। తదాహుః త్వ జగతీ (7-1-4)। ఉదాత్తశ్చ స్వరితశ్చ ఉదాత్త స్వరితౌ। తౌ పరౌ యస్మాత్సః తథోక్తః॥

[నోదాత్త స్వ్వరితపరః అని వైదికాభరణమందలి సూత్రము.]

న। ఉదాత్త స్వరితపరః॥

మణిప్రభ :- ఈ సూత్రము పూర్వ సూత్రమందు విధించబడిన ప్రచయ స్వరమునకు కొంతవరకు అపవాదము అగుచున్నది. పూర్వసూత్రము "స్వరితము కంటె పరమగు అనుదాత్తమునకు ప్రచయ లక్షణము"ను చెప్పినది కాని ఇపుడీ సూత్రమున "అట్టి అనుదాత్తము తర్వాత ఉదాత్తముగాని, స్వరితముగాని యున్నచో, ఆ అనుదాత్తమునకు ప్రచయలక్షణము వర్తించదు" అని చెప్పబడినది. స్వరితము తర్వాత అనేక అనుదాత్తములుండి, ఆ తర్వాత ఉదాత్తమో, స్వరితమో యున్నచో, ఈ ఉదాత్త స్వరితములకు అవ్యవధానముగ పూర్వమందున్న ఒక్క అనుదాత్తమునకు మాత్రమే ఈ ప్రచయ లక్షణము వర్తించదు. మిగిలినవానికి ప్రచయ లక్షణముండును— అని సూత్ర భావము. [11]

సూత్రము 12. స్పర్శాదనుత్తమాదుత్తమపరాదానుపూర్వ్యా న్నాసిక్యాః॥

త్రిభాష్య :- ఉత్తమపరాత్ అనుదాత్తాత్ స్పర్శాత్ పరతః ఆనుపూర్వ్యాత్ యథా క్రమం ఆగమా భవన్తి। ప్రథమ స్పర్శాత్ ప్రథమ నాసిక్యః ద్వితీయాత్ ద్వితీయః। ఏవమన్యత్రాపి। యథా— తం ప్రత్నథా (1-4-9); విమిధ్నానాః (3-5-4), విద్మాతే అగ్నే (4-2-2); దారూణదధ్మసి (4-1-10)

ఇత్యాది॥ స్పర్శాదితి కిం? కల్మాషీ భవతి (5-1-1)॥ అనుత్తమాదితి కిం? సమ్నాయ సుమ్నిని (1-1-13) ఉత్తమ పరాదితి కిం? సద్భ స్వగరస్సుమేక॥ (4-4 5)॥

స్పర్శాత్, అనుత్తమాత్, ఉత్తమపరాత్, ఆనుపూర్వ్యాత్, నాసిక్యాః॥

పదచ్ఛేదము :- ఈ సూత్రము "నాసిక్య" సంజ్ఞా విధాయక సూత్రము నాసిక్యము గుణము. కాగ అనునాసికధ్వని గల్గినది. అనగ ఆ వర్ణమునుచ్చరించు నపుడు వాయువు నాసిక, ముఖ మార్గములద్వార బయటకు వచ్చును. అట్టి ఈ నాసిక్య లక్షణము ఎపుడు ఎట్టి వర్ణములకు కలుగునో ఇపుడు చెప్పుచున్నారు.

"వర్గ పంచమాక్షరమునకు పూర్వమందు తద్భిన్నమగు స్పర్శ వర్ణమున్నచో అదే స్పర్శ వర్ణము ఆ పంచమాక్షరమునకు పూర్వమందు ఆగమముగ వచ్చును. ఇట్లు అధికముగ వచ్చిన స్పర్శవర్ణము అనునాసిక్యగుణము కలిగియుండును. అట్టి ఈ వర్ణము పర స్వరాంగత్వము నొందును"— అని సూత్ర భావము. ఉదాహరణలు :

తం ప్రత్న్నథా— తం ప్రత్నథా, అగ్మే విమథ్నానాః— విమథ్నానాః, విద్మాతే— విద్మాతే మొదలగునవి.

ఉత్తమపరాత్ = వర్గ పంచమాక్షరమును పరమందు గల్గిన, అనుత్తమాత్ = అపంచమాక్షరము కానటువంటి, స్పర్శాత్ = స్పర్శ వర్ణము కంటె, ఆనుపూర్వ్యాత్ = క్రమముగ అనగ ఆ స్పర్శ వర్ణమె, నాసిక్యాః = నాసిక్య గుణము కలిగిన ఆగమములుగ, భవన్తి = అగుచున్నవి.

సూత్రమున స్పర్శాదితి కిం? కల్మాషీ భవతి। ఇచట "మ" పంచమవర్ణమె కాని, లకారము స్పర్శ వర్ణము కాదు. కనుక ఇచట అనునాసిక్యాగమము లేదు. ఇట్లే ఇతరత్ర గ్రహించవలెను. [12]

సూత్రము 13. తాన్యమానేకే॥

త్రిభాష్య :- తాన్ నాసిక్యాన్ ఏకే శాఖినః "యమాన్" బ్రువతే। ఉక్తాన్యే వోదాహరణాని॥

తాన్, యమాన్, ఏకే॥

మణిప్రభ :- పూర్వసూత్రమందు చెప్పిన అనునాసిక్య గుణము కలిగి ఆగమములుగ వచ్చిన స్పర్శ వర్ణములనె కొన్ని ఇతర శాఖలకు చెందిన ఆచార్యులు "యమ" వర్ణములని పిలుచుచున్నారు. అనగ ఆ ఆగమములగు నాసిక్య స్పర్శ వర్ణములకె "యమ" సంజ్ఞను భిన్న శాఖీయులు చెప్పుచున్నారు.

ఉదాహరణలు పూర్వ సూత్రమందు చెప్పినవానిని గ్రహించవలెను. [13]

సూత్రము 14. హకారాన్నణమ పరాన్నాసిక్యమ్॥

త్రిభాష్య :- హకారాదితి కర్మణి ల్యబ్లోపే పంచమీ। తస్మాత్ న ణ మే పరం హకారమారుహ్య నాసిక్యం భవతి। సానునాసిక్యో హకారః స్యాదిత్యర్థః అహ్నాం కేతుః (?-4-14), అపరాహ్ణే (2-1-2), బ్రహ్మవాదినః (1-1-1)॥

హకారాత్, నణమ పరాత్, నాసిక్యమ్॥

మణిప్రభ - ఈ సూత్రమునందు హకారమునకు అనునాసిక్య గుణము కలిగిన సవర్ణమును ఆగమముగ చెప్పుచున్నారు.

"నకార, ణకార, మకారములలో నొకదానికంటె పూర్వమందున్న హకారమునకు పరముగ అనునాసిక్య ధర్మము గల్గిన అదే వర్ణము ఆగమముగ వచ్చును"— అని సూత్రార్థము.

పూర్వమందు (సూత్రము 12-న) స్పర్శవర్ణములకు అనునాసిక్యగుణము కల్గిన స్పర్శవర్ణము ఆగమముగ వచ్చునని చెప్పబడినది. ఇపుడీ సూత్రము (14) నందు హకారము స్పర్శవర్ణము కాకపోయినను, అనునాసిక్య గుణము గలిగిన అదే వర్ణము (ఊష్మయగు హకారము) ఆగమముగ (యమ) వచ్చునని చెప్పబడినది. ఉదాహరణలు :

అహ్నాం కేతుః— అహ్‌హ్నా కేతుః; ఇట్లే అపరాహ్ణే, బ్రహ్మవాదినః మొదలగు వానియందు గ్రహించవలెను. [14]

సూత్రము ౹౮. రేఫోష్మ సంయోగే రేఫస్స్వర భక్తిః॥

త్రిభాష్య:— రేఫస్యోష్మణశ్చ సంయోగే సతి తత్రోష్మ సంయుక్తో రేఫ స్స్వర భక్తిరితి జానీయాత్। స్వరభక్తిరితి కీదృశీ? స్వరస్య భక్తిః స్వర భక్తిః। భక్తిః భాగః అవయవః ఏకదేశ ఇతి యావత్। యోఽస్య రేఫస్య సమానకరణః స్వరః తద్భక్తిః స్యాత్। ఋకారశ్చాస్య జిహ్వాగ్ర కరణత్వేన శ్రుత్యాచ సమాన ధర్మః। ఏతదుక్తం భవతి।— ఋకారస్యావయవో భవతీ త్యర్థః। సూత్రేణానేన స్వరభక్తి రేవం విహితా। స్వరభక్తి స్వరూపం తు విస్పష్టం వ్యాచష్టే వరరుచిః —

ఋకారాదిరణుమాత్రా, రేఫోఽర్ధమాత్రా మధ్యే, శేషా స్వరభక్తిః అణుమాత్రా॥ ఇతి॥ అస్యాయమర్థః —

ఇన్ద్రియా విషయో యోఽసావణురిత్యుచ్యతే బుధైః।
చతుర్భిరణుభిర్మాత్రా పరిమాణమితి స్మృత్యమ్॥

మాత్రికస్య ఋకార స్యాదిరణుమాత్రః స్వరభాగః, మధ్యే రేఫ అర్ధ మాత్రః, అన్తేఽప్యణుమాత్రః స్వరభాగః। ఏతత్ ఋకార స్వరూపమ్। అత్ర ఋకార మధ్యవర్తిని రేఫేఽర్ధమాత్రే విభజ్యమానే సతి తౌ భాగౌ పూర్వో త్తరాణు సహితౌ ప్రత్యేకం స్వరభక్తి నామధేయం భజతః। సా చ స్వరభక్తి రర్ధమాత్రా। కుత్ర కా స్వరభక్తిరిత్యా శంక్య శిక్షాకారైరుక్తమ్—

శషసేషు స్వరోదయాం హకారే వ్యఞ్జనోదయామ్।
శషసేషు తు వివృతాం హకారే సంవృతాం విదుః॥

ఇతి। "యో వై శ్రద్ధామ్" ఇత్యాదౌ సూత్రోక్త క్రమభావాఽభావాత్ న స్వర భక్తిః। స్వరభక్త్యన్తరమపి శిక్షాయాముక్తమ్—

కరేణూ రహయోర్యోగే కర్విణీ లహకారయోః।
హరిణీ రశసానాం చ హరితా లశకారయోః॥
యాతు హంసపదా నామ సా తు రేఫషకారయోః।
ఏవం పంచవిధాం భక్తిముచ్చరేత్సర్వ కాముకః॥

యథా కరేణుః— బర్హిః। కర్విణీ—మల్హాః।
హరిణీ— దర్శపూర్ణమాసౌ। హారితా—సహస్రబల్శాః।
హంసపాదా— వర్షాభ్యః। ఇత్యాది॥

రేఫోష్మ సంయోగే, రేఫః, స్వరభక్తిః॥

మణిప్రభ :– "రేఫ తర్వాత ఊష్మ వర్ణముండవలెను. ఆ రెండింటి సంయోగమందు రేఫకు స్వరభక్తి వచ్చును" — అని సూత్రార్థము.

స్వరభక్తి అనగ స్వరముయొక్క భాగము. లేక అవయవము. కాగ ఈ రేఫ తనతో సమానకరణ స్థానములు గల్గిన స్వరముయొక్క భాగమునొందును. అట్టి స్వరము ఋకారము. అయితే ఈ ఋకారమందు కూడ కొన్ని భాగములున్నవి. ఋకారము మాత్రాకాలికము. అనగ చతుర్థు ప్రమాణమన్నమాట కాగ అందు ఋకారమందలి ప్రథమభాగము అణుకాల పరిమితమగు స్వరభాగము. తర్వాతనుండు రెండు భాగములు అర్థమాత్రాకాలికమగు రేఫ, వ్యంజనము భాగము. మిగిలిన అణుకాలపరిమితమగు భాగము స్వరము అగును. ఇదే విషయమును వరరుచి గూడ తన వ్యాఖ్యానమున స్పష్టపరచెను. కాగ వ్యంజన భాగమగు రేఫను రెండుగ విభజించి పూర్వోత్తర భాగములలో వేర్వేరుగ కలుపగ ఏర్పడు ధ్వనికే "స్వరభక్తి" అని పేరు. కాగ ఈ స్వరభక్తి అర్థమాత్రాకాల పరిమితము.

రేఫోష్మ సంయోగమున స్వరభక్తి ఏర్పడునని చెప్పితిమి కద. ఊష్మ వర్ణములు నాలుగున్నవి. ఈ రేఫకు ఒక్కొక్కదానితో సంయోగము కలిగినపుడు ఏర్పడు స్వరభక్తికి ప్రత్యేకములగు పేర్లు కలవు. ఈ స్వరభక్తి రేఫోష్మ సంయోగముచే అగునని చెప్పినను, లకారోష్మ సంయోగముచే కూడ స్వరభక్తి ఏర్పడును. "రలయోరభేదః" అను వాక్యము ఇందుకు ప్రమాణము. ఇక

1 రేఫ హకారయోగమున ఏర్పడు స్వరభక్తి కరేణు వనబడును.

2 లకార హకారయోగమున నేర్పడు స్వరభక్తి కర్విణీ అనబడును.

3 రేఫకు శకార/సకారయోగమున వచ్చు స్వరభక్తి హరిణమునబడును.

4 లకారమునకు శ/సకార యోగమున వచ్చు స్వరభక్తి హారితమనబడును.

5 రేఫ షకార సంయోగజమగు స్వరభక్తి హంసపదమనబడును.

వీనికి బర్హిః, మల్హా, దర్శపూర్ణమాసౌ; సహస్రవల్శాః, వర్షాభ్యః అను నవి క్రమముగ ఉదాహరణములు.

అయితే, ఘోషైశ్రద్ధామ్ అను స్థలమున శకార రేఫ సంయోగమున్నను అచట స్వరభక్తి రాదు. సంయోగ రేఫోష్మ క్రమమందుండవలెనె గాని ఊష్మ రేఫలకు కాదని గుర్తించవలెను. [15]

సూత్రము 16. న క్రమే ప్రథమపరే ప్రథమపరే॥

త్రిభాష్య :- క్రమశబ్దో ద్విత్వపర్యాయః। కథమేతత్? ప్రకృతిర్విక్రమః క్రమః (సూ. 24-5) ఇత్యత్ర ద్విత్వస్యైవ క్రమశబ్దేనాభిధానాత్। అత్రాపి స ఏవార్థ ఇతి నిశ్చినుమః। ఊష్మణః క్రమేసతి తస్మిన్నూష్మణి ప్రథమపరే వా సతి న స్వరభక్తిర్భవతి। క్రమే యథా — దార్శ్యమ్ (3-2-2), వర్షాభ్యః (7-4-13), బర్హిర్భిః (5-7-11); ఏతర్హ్యారూఢః (5-1-5)॥ ప్రథమ పరే యథా— అదర్శ్మజ్యోతిః (3-2-5), కార్ష్ణి ఉపానహౌ (5-4-4); వర్ష్టో పర్జన్యః ( -5-20) ఇతి॥ ప్రథమః పరః యస్మాదసౌ ప్రథమపరః॥

న। క్రమే। ప్రథమపరః। (ప్రథమపరః॥)

మణిప్రభ :- ఈ సూత్రముచే స్వరభక్తికి కొన్ని సందర్భములలో నిషేధమును చెప్పుచున్నారు.

పూర్వ సూత్రమున రఘాష్మ సంయాగమున ఊష్మకు పూర్వమందు స్వరభక్తి ప్రాప్తించునని చెప్పబడినది. కాని ఇపుడు "అట్టి ఊష్మవర్ణమునకు ద్విత్వము వచ్చినను, లేక ఊష్మకంటె ప్రథమ స్పర్శ (క, చ. ట, త, ప) పరమందున్నను, ఆ రేఫకు స్వరభక్తి రాదు" అని చెప్పబడినది. సూత్రమున క్రమమనగ ద్విత్వమని అర్థము. ఈ అర్థమునే వ్యాఖ్యాతలందరును చెప్పిరి. ఈ అర్థ గ్రహణమునకు సూ 24-5 త్రమును ప్రమాణముగ త్రిభాష్యకారులుదహరించిరి.

ఇక నుదాహరణలు  ఊష్మకు క్రమము (ద్విత్వము) వచ్చిన స ర్భము — దార్శ్శ్యమ్ (3-2-2), వర్ష్షాభ్యః (7-4-13), బర్స్ లిః (5-7-11), ఏతర్హ్హ్యరూధః (5-1-5)

ప్రథమపరే— అదర్శ్శ జ్యోతిః, కార్ష్ణి ఊపావహౌ, వర్ష్ణా వర్షన్యః॥ అ మూర్ష్ణు (1-4-44)

సూత్రమున ప్రథమపరే, ప్రథమపరే అను ద్విరుక్తి అధ్యాయ స ప్తిని సూచించును [16

కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ ప్రాతిశాఖ్యకు
త్రిభాష్య రత్నానుసారము వేదులోపనామక
సుబ్రహ్మణ్యముచే వ్రాయబడిన "మణిప్రభ"
అను ఆంధ్ర వివరణమున ఇరువది యొకటవ అధ్యాయము
సమాప్తము

※※※

## అధ్యాయము—22

శబ్దము — వర్ణములు : సూత్రములు—15

సూత్రము 1. శబ్దః ప్రకృతి స్సర్వ వర్ణానామ్॥

త్రిభాష్య:— సర్వ వర్ణానాం శబ్దః ధ్వనిః ప్రకృతిః మూలకారణం భవతి శబ్దేన స్వర వ్యంజనాత్మకో రాశిరుచ్యతే। సర్వేచ తే వర్ణాశ్చ సర్వవర్ణాః తేషాం సర్వ వర్ణానామ్॥

శబ్దః। ప్రకృతిః। సర్వ వర్ణానామ్॥

మణిప్రభ :— శబ్దః=ధ్వని, సర్వవర్ణానాం=స్వర, వ్యంజనములగు అక్షరము లన్నిటికి, ప్రకృతిః=మూలకారణము. ప్రధాన కారణము. కాగ "భాషయం దున్న స్వరములు, వ్యంజనములు, విసర్జనీయములు, రంగ, శకార, యమ వర్ణములు — ఈ సర్వ వర్ణరాశికి శబ్దమే మూల కారణము. లేక ఉపాదాన కారణము. [1]

సూత్రము 2. తస్య రూపాన్యత్వే వర్ణాన్యత్వమ్॥

త్రిభాష్య :— ప్రాతి శ్రుత్కస్థాన భేదాత్ తస్య శబ్దస్య ప్రకృత భూతస్య రూపాన్యత్వే సతి వర్ణాన్యత్వం స్యాత్। యథా— అ, ఇ, ఉ, ఇత్యాది॥

తస్య। రూపాఽన్యత్వే। వర్ణాఽన్యత్వమ్॥

మణిప్రభ : తస్య=ఆ శబ్దమునకు, రూపాన్యత్వే=రూపస్య అన్యత్వే=భిన్న స్వరూపము సిద్ధించగ, వర్ణాన్యత్వమ్=వర్ణ భేదము కలుగుచున్నది.

సర్వవర్ణములకు కారణభూతమగు శబ్దము ముఖగోళమందు భిన్నస్థలము లందాహతమై భిన్న స్వరూపములలో బహిర్గతమగుచున్నది. అట్టి వైవిధ్యము గల ఒక్కొక్క శబ్ద స్వరూపమునకు, వివిధములగు సంకేతములు చేయగ భిన్న వర్ణములు ఏర్పడుచున్నవి. ఈ విధముగ స్థాన కరణ ప్రయత్నాది భేదములచే నానావర్ణములుత్పన్నమగుచున్నవి.

ఉదా : అ, ఇ, ఉ, య, వ ఇత్యాదులు. [2]

సూత్రము 3. తత్రి శబ్దద్రివ్యాణ్యుదాహరిష్యామః॥

భాష్య :– తేషాం వర్ణానాం సర్వత్రి సంఘాత ప్రయోగేసతి శాస్త్రమిత్యు
ృతే। తస్య శబ్ద ఇతి పర్యాయ నామ। తత్ర తస్మింఛాస్త్రే యాని ద్రవ్యాణి
వన్తి, తాన్యుదాహరిష్యామః। యత్ కర్మ యేన క్రియతే తత్తస్య ద్రవ్యం
ధనమితి యావత్। యథా ఘటస్య మృదితి, ఏవం శాస్త్రస్య వర్ణాః। యాని
ద్రవ్యాణి సంవ్యవహారార్థాని కర్తవ్యాని తాని వ్యాఖ్యాస్యామః। శబ్దస్య
వ్యాణి శబ్ద ద్రవ్యాణి। తాని॥

తత్ర। శబ్దద్రవ్యాణి। ఉదాహరిష్యామః॥

ంణిపత్రిభ :– త్రిభాష్యరత్న, మాహిషేయ వ్యాఖ్యానములననుసరించి—
బ్దము=శాస్త్రము అని అర్థము. ద్రివ్యమనగ సాధనము. కాగ, ఈ శాస్త్రివ
హనకు సాధనములగు కొన్ని సాంకేతిక వర్ణములను, పదములను వివరించు
న్నామని సూత్ర భావము.

కుండలు చేయుటకు మన్ను ఎంత అవసరమొ, అట్లే ఈ శాస్త్రమును
రిగ అర్థము చేసికొని, అధ్యయనము చేయుటకు ఈ చెప్పబోవు సాంకేతిక
దములు, వాని అర్థములు, స్వరూపము మొదలగు యీ జ్ఞానము కూడ
ంత అవసరము. ఉదాహరిష్యామః=వివరించుచున్నాము. [3]

సూత్రిము 4. వర్ణకారౌ నిర్దేశకౌ॥

భాష్య :– వర్ణ శబ్దః కార శబ్దశ్చ నిర్దేశకౌ వాచకౌ స్యాతామ్। యథా—
వర్ణ వ్యంజన శకుని (సూ. 6-7) ఇతి॥ అథ షకార ః సకార విసర్జ
యో॥ (సూ. 6-1)। ఇతి। వర్ణశ్చ కారశ్చ వర్ణకారౌ॥

వర్ణకారౌ। నిర్దేశకౌ॥

ంణిప్రభ :– "వర్ణ" అనునదియు, "కార" అనునదియు ఆయా స్వర వ్యం
నములను నిర్దేశించును. అనగ వానిని తెల్పును. ఉదాహరణ :
వర్ణము, ఇవర్ణము, ఉవర్ణము— అనగ అ, ఇ, ఉ. ఇట్లే షకారము, సకా
ము, దకారము — అనగ ష, స, శ. ఇట్లే మిగిలిన వానిని కూడ గ్రహించ
లెను. [4]

సూత్రము 5. చాపీత్యన్వాదేశకౌ ॥

త్రిభాష్య :- చ, అపి ఇత్యేతౌ అన్వాదేశకౌ స్యాతామ్। పూర్వాపేక్షయా అన్వాదేశ ఇత్యుచ్యతే। యథా— "అసదామాసిఞ్చః శ్చ"॥ (6-3). "ఇతి పరేఽపి" (4-4)॥

చ। అపి। ఇతి। అన్వాదేశకౌ ॥

మణిప్రభ :- చ, అపి— ఈ రెండు పదములు అన్వాదేశకములు. అనగ "పూర్వ సూత్రమందు లేక పూర్వవాక్యమందు చెప్పిన పదమును లేక పదములను, భావములను తర్వాత (అనగ అవి ప్రయోగింపబడిన) సూత్రము, లేక వాక్యములోనికి అనువృత్తి తెచ్చువానిని" అన్వాదేశకములందురు. కాగ చ, అపి అనునవి అట్టి పదములు.
సూత్రము 6-3 నందలి చకారము పూర్వ సూత్రమునందలి "సకారము షకారముగును" అను భావమును ఆ సూత్రములోనికి తెచ్చును. అట్లే 4-4 లోని అపి అవగ్రహసంజ్ఞ వచ్చును అను భావమును పూర్వ సూత్రమునుండి ఇందులోనికి తెచ్చును. కాగ చ, అపి ఈ రెండు అన్వాదేశకములు. [5]

సూత్రము 6. త్వథైవేతి వినివర్తకాధికారకావధారకాః॥

త్రిభాష్య :- తు, అథ, ఏవ— ఇత్యేతే శబ్దాః యథా క్రమేణ వినివర్తకాధికారకావధారకాః భవన్తి। యత్ర తు శబ్దః శ్రూయతే తత్ర నివృత్తిః। యత్ర అథ శబ్దః తత్రాధికారః। యత్ర ఏవ శబ్దః తత్రావధారణమితి వేదితవ్యమ్। యథా— ఏషస్తురస్య (1-19); అథ సంహితాయామేక ప్రాణభావే (5-1); స్పర్శ ఏవైకేషామాచార్యాణామ్ (14-3)॥ విశేషేణ నివర్తయతీతి వినివర్తకః। అధికరోతీతి అధికారః। అవధారయతీతి అవధారకః॥

తు। అథ। ఏవ। ఇతి। వినివర్తకాధికారకావదారకాః॥

మణిప్రభ :- తు శబ్దము పూర్వమందు చెప్పినది అనువృత్తము కాకుండ నిషేధించును. అథ శబ్దము అధికారవాచి। అట్లే ఏవ శబ్దము అవధారణవాచి।

అనగ "నిశ్చయముగ" అని చెప్పును. ఉదాహరణలు :
ఏఫః తు రస్య (1-19). ఇచట తు శబ్దము పూర్వ సూత్రమునుండి వర్ణ, కార శబ్దముల అనువృత్తిని వారించినది. అట్లే అధ సంహితాయాం.. . (5-1)॥ ఇచట అథ శబ్దము అధికారవాచి. మరియు స్పర్శ ఏవై కేషాం . (14-3) అను సూత్రమందలి "ఏవ" శబ్దము స్పర్శయే అను అవధారణను-నిశ్చయమును చెప్పును. వినివర్తకమనగ విశేషముగ నివారించునది, అధికరించునది అధికారము, అవధారణ భావమును చెప్పునది అవధారకమనబడును. [6]

సూత్రము 7. వేతి వైభాషికః॥

త్రిభాష్య :– వా ఇత్యేష శబ్దో వైభాషికో వైకల్పికో భవతి। యథా — ముఖ నాసిక్యా వా (2-50)॥

వా। ఇతి। వైభాషికః॥

మణిప్రభ :– "వా" అను శబ్దము తత్పూర్వమందు చెప్పిన విషయమునకు వికల్పతను చెప్పును విభాషా ఏవ వైభాషికః। అనగ పూర్వమందు చెప్పిన విషయము కొన్ని స్థలములందు ప్రవర్తించును ఒకప్పుడు ప్రవర్తించక పోవచ్చును. ఉదా : ముఖనాసిక్యా వా (2-50) సూత్రమందలి వా శబ్దము నాసిక్య వర్ణములు ముఖము ద్వార ఉచ్చరింపబడవచ్చును, ఉచ్చరింపబడక పోవచ్చును— అని తెల్పును లేక ఆ రెండింటి ద్వార కూడ పల్కవచ్చును. "మరియొక విధముగ కూడ" అను అర్థమును "వా" తెలియచేయును. [7]

సూత్రము 8. నేతి ప్రతిషేధకః॥

త్రిభాష్య :– "న" ఇతి శబ్దః ప్రతిషేధకః భవతి। యథా— న సుషు మ్నోఒగ్నిః (13-15) ఇతి॥

న। ఇతి। ప్రతిషేధకః॥

మణిప్రభ :– "న" అను శబ్దము పూర్వమందు చెప్పిన విషయమును ప్రకృతమున నిషేధించును. అనగ ఇది నిషేధ వాచకము. న సుషుమ్నోఒగ్ని

(13-15) సూత్రమున సుషుమ్న, అగ్ని ఇత్యాది పదములందలి నకారమునకు పూర్వమందు చెప్పిన, ణత్వము ఇచట రాదు అని నిషేధించుచున్నది [8]

సూత్రము 9. ఆయామో దారుణ్యమణుతా ఖస్యేత్యుచ్చైః కరాణి శబ్దస్య॥

త్రిభాష్య :– ఉచ్చైరుదాత్తః (1-38) ఇత్యుక్తమ్। తదర్థమిదమారభ్యతే। లోకవద్వ్యాదృచ్ఛికోచ్చారణ ప్రతిషేధార్థమ్। ఆయామః గాత్రాణాం దైర్ఘ్యమ్। దారుణ్యం స్వరస్య కఠినతా। అణుతా ఖస్య గలవివరస్య సంవృతతా। ఏతాని సాధనాని "శబ్దస్య ఉచ్చైః కరాణి" శబ్దముచ్చైః ఉదాత్తం కుర్వన్తీత్యర్థః। ఉచ్చశబ్దముచ్చారయతా ఏతత్ కర్తవ్యమితి విధిః। ఉచ్చైః కుర్వన్తీతి ఉచ్చైః కరాణి॥

ఆయామః। దారుణ్యమ్। అణుతా। ఖస్య। ఇతి। ఉచ్చైః కరాణి। శబ్దస్య॥

మణిప్రభ :– పూర్వనుండు ఐదు సూత్రములలో శాస్త్రమందు ప్రయోగింప బడు కొన్ని సాంకేతిక పదములు, వినియోగము, ప్రయోజనములు వివరింప బడినవి. ఇక నిపుడు ఉదాత్తాది భిన్న స్వరములను పలుకటయందు మన అవయవ విన్యాసమును చెప్పుచున్నారు.

ఉచ్చైరుదాత్తః (1-38) అని సూత్రము. కనుక ఉదాత్త స్వరము పలుకుటకు గాత్రాది భాగములనెట్లు సవరింపవలెనో ఈ సూత్రమున వివరించు చున్నారు.

ఖస్య=గొంతుక యొక్క అవగ గళ వివరమందలి అవయవ భాగముల యొక్క ఆయామ, దారుణ్య, అణుత అను లక్షణములు ఉదాత్త స్వరమును పలుకుటయందు దోహదపడుచున్నవి.

ఆయామము : గొంతుకయందలి కండరములను సాగదీయుట-దీర్ఘములుగ చేయుట.

దారుణ్యము : పై విధముగ సాగదీసిన కండరములను అట్లే బిగించి యుం చుట.

అణుత : కంఠరములను సాగదీసి, బిగించి యుంచగ, అవి దగ్గరగ కూడుకొని యుండును. అనగ వాటిమధ్య సహజముగనుండు దూరము తగ్గి అవి సంకుచితములు (దగ్గరగ) అగును. ఈ విధముగ వానిమధ్య నుండు వైశాల్యము తగ్గి అణుత్వము నొందును. ఇది అణుత ఈ విధముగ గొంతుయందలి నాద తంత్రులను సవరించినచో అందుండి వెలువడు ధ్వనిని ఉదాత్త ధ్వని యనియు, ఆ స్థితిని ఉదాత్తస్థితి అని అందురు. కాగ "ఆయామ, దారుణ్యాణుతలు శబ్దమునకు ఉదాత్తమును కల్పించును"— అని సారాంశము.

[9]

సూత్రము 10. అన్వవసర్గో మార్దవమురుతా ఖస్యేతి నీచైః కరాణి॥

త్రిభాష్య :– నీచైరనుదాత్తః (1-39) ఇత్యుక్తమ్। అన్వవసర్గః గాత్రాణాం విస్తృతా। మార్దవం స్వరస్య స్నిగ్ధతా। ఖస్య ఉరుతా కంఠస్య స్థూలతా। ఇత్యేతాని సాధనాని శబ్దస్య నీచైః కరాణి, శబ్దం నీచైరనుదాత్తం కుర్వన్తీత్యర్థః। నీచ శబ్దముచ్చారయతా ఏతత్కర్తవ్యమితి విధిః। నీచైః కుర్వన్తీతి నీచైః కరాణి॥

అన్వవసర్గః। మార్దవమ్। ఉరుతా। ఖస్య। ఇతి। నీచైః। కరాణి॥

మణిప్రభ :– పూర్వము ఉదాత్త స్వరమును పలుకుటకు గాత్రము నెట్లు సరిచేయవలెనో చెప్పిరి. ఇకనిపుడు అనుదాత్తస్వరమును పలుకుటకు గాత్రమందలి నాదతంతులనెట్లు సవరించవలెనో చెప్పుచున్నారు. ఇది పూర్వము చెప్పిన విధానమునకు వ్యతిరేకముగ నుండును. కాగ— అన్వవ సర్గ, మార్దవము, కంఠమందలి ఉరుతా— ఇవి అనుదాత్తమును పలుకుటయందు సహకరించును.

అన్వవ సర్గమనగ గొంతును సడలించి విశాలముగ చేయుట. పూర్వమందువలె బిగించి సాగదియురాదు.

మార్దవమనగ మృదువుగ నుండుట. నాదితంత్రులను సాధ్యమైనంత స్వేచ్ఛగ వదులుచేసి యుంచవలెను. అట్లు చేయుగ నాదతంత్రుల మధ్య దూరము ఉరుతా విస్తృతముగ, అధికముగనగును. అట్టి స్థితిలో కంఠము నుండి

బయుల్వెడలు ధ్వని, పూర్వ సూత్రమందు చెప్పిన ధ్వనికి విలక్షణముగ వెలువడును దానినె అనుదాత్త స్వరమందురు కనుక అనుదాత్తమును పలుకు వ్యక్తి తన కంఠమందలి నాదతంత్రుల నీ విధముగ సవరించవలెను

ఉచ్చైః కరాణి అనగ స్వరమును మీదకు ఊర్ధ్వ భాగమునకు ఉత్క్షిప్తము చేయునని అర్థము. అట్లే నీచైః కరాణి అనగ స్వరమును (శబ్దమును) అవక్షిప్తము (దిగువ వైపుగ) చేయునవని భావము ఉత్=మీదుకు, ఎగువకు, క్షిప్=ఎగురుట, పోవుట ఉత్క్షేపము అవ=క్రిందుకు, క్షిప్=ఎగురుట అనగ దిగువకు పోవుట, క్రిందుగ పడుట అవక్షేపము [10]

సూత్రము 11 మన్ద్రమధ్యమ తారాణి స్థానాని భవన్తి॥

త్రిభాష్య – మంద్రం, మధ్యమం, తారం చేత్యేతాని స్థానాని భవన్తి। మన్ద్రమితి ప్రథమమ్। మధ్యమమితి ద్వితీయమ్। తారమితి తృతీయమ్। ఏషాం స్థానానాం ప్రయోజన ముత్తరత్ర వక్ష్యతే॥

మన్ద్రమధ్యమ తారాణి। స్థానాని। భవన్తి॥

మఱియు – ఇంతవరకు ఉదాత్తానుదాత్తస్వరములను పలుకుటకు గాత్రము నెట్లు సరిచేయవలెనో చెప్పబడినది. ఇపుడు మన కంఠనాళమునుండి వెల్వడు శబ్దమును భిన్న స్థాయిలలో వెలువరించునపుడు దాని నే విధముగ విభజించవచ్చునో ఇపుడు చెప్పుచున్నారు

మంద్రస్థాయి, మధ్యమస్థాయి, తారస్థాయి॥

తారస్థాయి అనగ ఉదాత్త స్థాయిలో బిగ్గరగ పలుకుట

మధ్యమస్థాయి అనగ స్వరిత స్థాయితో–బిగ్గరగను కాదు– అట్లని అల్ప ధ్వని కాని మామూలు స్థాయిలో పలుకుట ఇక మంద్రస్థాయిలో అనగ అనుదాత్త స్థాయిలో నెమ్మదిగ, మృదు మధురంగ లోగొంతుకతో పలుకుట ఈ వివరణము సుఖముగ అర్థము చేసికొనుటకు చెప్పితిమి కాని నిజమునకు ఉదాత్తానుదాత్త స్వరితములు మూడింటిని, ఈ త్రివిధ స్థాయిలలోను పలుకవచ్చును

ఈ విధముగ స్థూలముగ శబ్దము ఈ మూడు స్థాయిలలో వెలువడును. [11]

సూత్రము 12. తత్రైక వింశతిర్యమాః॥

త్రిభాష్య :– ఏతాని స్థానాని శేషా మిత్యపేక్షాయా మాహ। తేషు త్రిషు స్థానేషు "ఏక వింశతిర్యమాః" స్వరా భవన్తి। తేషాం యమానాము త్తరత్ర ప్రయోజనం వక్ష్యతే॥

తత్ర, ఏకవింశతిః, యమాః॥

మణిప్రభ :– తత్ర పూర్వమందుచెప్పిన మంద్ర మధ్యమతార స్థాయీలలో (స్థానములందు) ఏక వింశతిః=ఇరువది యొకటి, యమాః=యమ నామక స్వరములు (ధ్వనులు) ఉత్పన్నమగును.

సాధారణముగ యమ వర్ణమనగ అదే వర్ణమును రెండుసార్లు వచ్చినచో, అందు ఆగమముగ వచ్చిన వర్ణమును "యమ" వర్ణము అందురు. యమ అనగ కవలి అని అర్థము. ఇచట–ఈ సూత్రమందలి "యమ" పదము సాంకేతికము. ఇది స్వరములకు సంబంధించినది. పూర్వము చెప్పిన మూడు స్థానములలో, ప్రతిదానియందు సప్త స్వరములు చొప్పున, మొత్తము ఇరువది యొక్క స్వరములు పుట్టును. ఈ సప్త ధ్వనులకే యములని పేరు. వీనిని తర్వాత అధ్యాయములో (23-14) వివరించుచున్నాము. [12]

సూత్రము 13. ఋగ్విరామః పదవిరామో వివృతివిరామస్సమాన పద వివృత్తి విరామ స్త్రిమాత్రో ద్విమాత్ర ఏక మాత్రోఽర్ధమాత్ర ఇత్యాను పూర్వ్యేణ॥

త్రిభాష్య :– ఋగ్విరామాదయః త్రిమాత్రాదికాలా యథా క్రమం భవన్తి। యథా– "ఉభావాచస్య సాతయే హువే వామ్" ఇతి ఋగ్విరామః। "ఇషేత్వా ఊర్జేత్వా" ఇతి పద విరామః। "స ఇధానః, త ఏనమ్, తా అస్మాన్" ఇతి వివృత్తి విరామః। "ప్ర ఉగమ్" ఇతి సమాన పద వివృత్తి విరామః। ఋచి విరామో ఋగ్విరామః। పదస్య విరామో పద విరామః। పదద్వయ వివృత్తౌ విరామః వివృత్తి విరామః। శిక్షాయానుస్య విశేష ఉక్తః—

హ్రస్వాదిర్వత్సాను సృతిరన్తే వత్సానుసారిణీ।
పాకవత్యుభయ హ్రస్వా దీర్ఘమధ్యా పిపీలికా॥

మాత్రికా వత్సాను సృతిస్తథా వత్సాను సారిణీ।
పాదోనా స్యాత్ పాకవతీ పాదమాత్రా పిపీలికా॥ ఇతి॥

సమానం చ తత్పదం చ సమానపదమ్। ఏకపదమిత్యర్థః। సమానపదే వివృత్తిః సమానపద వివృత్తిః, తస్యాం విరామః సమానపద వివృత్తి విరామః। త్రిస్రో మాత్రా యస్యాసౌ "త్రిమాత్రః"। ద్వే మాత్రే యస్యాసౌ ద్విమాత్రః। ఏకమాత్రా యస్యాసౌ ఏకమాత్రః। అర్ధం మాత్రా యస్యాసౌ అర్ధమాత్రః॥

ఋగ్విరామః, పదవిరామః, వివృత్తి విరామః, సమానపద వివృత్తి విరామః, త్రిమాత్రః, ద్విమాత్రః, ఏకమాత్రః, అర్ధమాత్రః, ఇతి, ఆనుపూర్వ్యేణ॥

మణిప్రభ.- ఇపుడు వేదాధ్యయనము చేయునపుడు ఋక్కునకు ఋక్కునకు మధ్య కొంత విరామముండవలెను. అట్లే ఋక్కు పాదమునకు పాదమునకు మధ్య విరామముండవలెను పాదమందు కూడ, పదమునకు పదమునకు నడుమ విరామముండవలెను. పదమందును వర్ణమునకు వర్ణమునకు నడుమ విరామముండవలెను. ఈ సూత్రమున ఇట్టి విరామ కాలములను గూర్చి చెప్పుచున్నారు.

ఋక్కునకు ఋక్కునకు మధ్యనుండు విరామమును ఋగ్విరామమందురు. ఇది త్రిమాత్రా కాలికము. పాదద్వయ మధ్యనుండు విరామము ను పాద వివృత్తి (విరామము) అందురు. ఇది ద్విమాత్రికా కాలము. రెండు పదముల మధ్యనుండు విరామమును పద విరామమందురు ఇది మాత్రా కాలికము. ఇక పదమందు వర్ణముల మధ్యనుండు విరామము "సమానపద వివృత్తి" అనబడును. ఇది అర్ధమాత్రా కాలికము. ఈ విధముగ, వ్యవధానమును చూపించుచు చేయు వేద పఠనము స్పష్టముగ మధురముగ నుండును. [13]

